# చతుర

సంపుటి : 7 మే 1984 సంచిక : 4


## ఈ నెల సమగ్ర నవల

డాక్టర్ అయి పల్లెలోని పేదప్రజలకు వైద్యం చేయాలనేది ఇంటర్ చదివే ఆ పసివాడి ఆశయం! ఆ లక్ష్యసాధన కోసం కష్టపడి చదివాడు. కష్టం ఫలించి ఫస్ట్‌క్లాసులో ఉత్తీర్ణుడయ్యాడు.

కాని, అవధుల్లేని అతని ఆనందానికి అంతలోనే ఆనకట్ట పడింది. తీవ్రమైన ఆశాభంగం వాస్తవ పరిస్థితుల రూపంలో ఎదురైంది. అయినా, ఆశ అతన్ని ముందుకే నడిపించింది.

లక్ష్యం దిశగా సాగిన ఆ బాటలో అడుగడుగునా ఆటంకాలే! విద్యార్థి ఉద్యమాలు... సమ్మెలు...ఎన్నెన్నో అనుభవాలు... ఆ అనుభవాలలో ఏ సంఘటనలు అతని మనసుని... జీవితాన్ని...



# అశాంతినికేతన్

...గా మార్చాయి? ఆయా సందర్భాలలో అతనికి తారసపడిన వ్యక్తులెవరు? వారి పరిచయం అతన్ని ఏవిధంగా ప్రభావితం చేసింది? చివరికి తన లక్ష్యాన్ని సాధించుకోగలిగాడా అతను?

## సింహప్రసాద్

ఓ మధ్యతరగతి యువకుడు ఉన్నత విద్యార్జనకై తపించి ఎదుర్కొన్న కష్టనష్టాలకు చేసిన యదార్థ చిత్రణ 'అశాంతి నికేతన్' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు : ఇ. రాజ్యలక్ష్మి

మూడవ కవరు : ఎల్. ఆర్. గ్రోవర్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# నేను మా పళ్ల డాక్టరును అడిగా - కేవలం ఫోర్‌హాన్స్ ఎందుకు?

"ఎందుకంటే మీ చిగుళ్లు గట్టిగా వుంటే పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి..."

మరి కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గి వున్నది.



అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్. జె. ఫోర్‌హెన్ తాను తయారు చేసిన టూత్ పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు. ఇది నేరుగా చిగుళ్ల మీద పని చేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టు నిస్తుంది. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.




**ఫోర్‌హాన్స్ - ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.**

338 F 172 TEL

## ప్రకటనల పర్వాం

పువ్వులు, నవ్వులు, పసిపాపలు ఎలాంటి ప్రకటనల ప్రమేయం లేకుండానే అందరిని ఆకర్షించే అంశాలు. అయితే ఇప్పుడు వాటికూ కూడా ప్రకటనలు అవసరమయేలా చేస్తోంది ప్రకటనల యుగం. ప్రభుత్వాలు దేశరక్షణ కోసం. ఆయుధాలకై ఎక్కువ నిధులను కేటాయిస్తున్నట్లే కంపెనీలు ప్రకటనల కోసం ఎక్కువ మొత్తాలను ఖర్చు చేస్తున్నాయి.

ఈనాడిలా విస్తరిస్తున్న ప్రకటనలు






ఆసలెలా ప్రారంభమయ్యాయి? పూర్వం తపెస్ నగరంలో తాటాకు మీద రాసి వున్న వ్రాతప్రతి దొరికింది. మూడువేల సంవత్సరాలక్రితం నాటిదయిన ఆ తాళపత్రంలో తప్పిపోయిన కొడుకును అప్పగించినవారికి బహుమతి ఇస్తానని ఓ తండ్రి ఇచ్చిన ప్రకటన వుంది.

క్రీ. పూ. 1500లో కూడా గ్రీకు దేశంలోని షాపులవారు తాము అమ్మే వస్తువుల వివరాలను అందంగా రంగుల్లో రాయించి బయట వేలాడదీసేవారు. ఇది కూడా ఒకరకంగా ప్రకటనే గదా! ముద్రణా యుగం ప్రారంభమవగానే ప్రకటనల్లో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. ప్రథమంగా 1477లో ప్రార్థనలకు సంబంధించిన ఓ పుస్తకపు అమ్మకపు ప్రకటన లండన్‌లోని ఓ పత్రికలో వచ్చింది. కవర్ పేజి ప్రకటనలు క్రీ.శ. 1625 తర్వాత రావడం మొదలెట్టాయి.

# ప్రపంచం

వ్యాపార ప్రకటనలే గాక, తమ అభిప్రాయాలనూ, ఫిలాసఫీనీ వివరిస్తూ చర్చివారూ, సంఘసేవకులూ ఇచ్చే సందేశాత్మక ప్రకటనలు చాలా వచ్చేవి. తర్వాత రేడియో, దూరదర్శన్ కేంద్రాలకు కూడా పాకాయి ప్రకటనలు. మొదటి రేడియో ప్రకటన 1920లో వచ్చింది. మన రేడియోల్లో వ్యాపార ప్రకటనలు వేసే వాణిజ్య విభాగం వివిధ భారతి 1967లో జన్మించింది. తొలి టీవీ ప్రకటన 1976 జనవరి 4న వెలువడింది. ముందుముందు ప్రకటనలు ఇంకే రూపం ధరిస్తాయోమరి.

## సూపర్ ఫాస్ట్

ఇప్పటివరకూ మా బుల్లెట్ రైలంత వేగంగా నడవగలది మరోటి లేదని భుజాలు చరచుకున్న జపానువారిని వెనక్కు నెడుతూ ఫ్రాన్స్‌వారు అంత కంటే వేగంగా నడిచే రైలును రూపొందించారు. జపానీస్ బుల్లెట్ ట్రెయిన్ గంటకి 128 మైళ్ళ వేగంతో పయనిస్తే ఫ్రాన్స్ వారి సూపర్ ఫాస్ట్ ట్రెయిన్ వేగం గంటకి 168 మైళ్ళు.

ప్రస్తుతం ఈ సూపర్ ఫాస్ట్ రైలు పారిస్ – లియొన్స్ నగరాల మధ్య నడుస్తోంది. మొదటి పన్నెండు మైళ్ళు ఎద్దులబండి పోయినంత నెమ్మదిగా పోతుంది రైలు. ఎందుకంటే అక్కడి రైలుమార్గం ఈ రైలు వేగాన్ని తట్టుకొనే విధంగా సిద్ధం చేయాల్సివుంది. ఈ 12



మైళ్ళు దాటగానే రైలు విపరీతమైన వేగాన్ని అందుకుంటుంది. రైల్లో కూర్చున్న మనిషి బయటి ప్రకృతి దృశ్యాలను సైతం చూడలేడు ఆ వేగానికి. రైలు మెరుపులా దూసుకుపోతూఉంటుంది.

ఇంత వేగంతో నడుస్తున్నా రైల్లో కూర్చున్నవారికి కుదుపు వుండదు. హాయిగా మెర్సిడెజ్ కారులో పోతున్నంత సుఖంగా వుంటుంది. అంతెందుకు సూపర్ ఫాస్ట్ రైల్లో ప్రయాణం చేస్తే విమానంలో ప్రయాణం చేసినట్లుంటుందట!

పారిస్‌లో బయలుదేరిన ఈ రైలు లియోన్స్ నగరాన్ని రెండు గంటల్లో చేరుతుంది. పైగా ఇది ప్రయాణికులను విమానంలా నగర పొలిమేరల్లో గాక నగరం మధ్యకి తెచ్చి వదులుతుంది. అదే నగర శివార్లలో అయితే అక్కడి నుంచి నగరంలోకి వచ్చి పడాలంటే మళ్ళీ కారునో, బస్సునో ఆశ్రయించాలి. మరో సౌకర్యం ఏమంటే విమానం ఛార్జీలకన్నా సూపర్ ఫాస్ట్ రైలు ఛార్జీలు చాలా తక్కువ. కనుక ఫ్రాన్స్‌లో విమానాలకన్నా ఈ రైలుకే గిరాకీ బాగా వుందట.

## పావురాల పోస్ట్

మనిషి ఉపగ్రహ యుగంలోకి ప్రవేశించినా కొన్నిచోట్ల వార్తలనందించడంలో ఇక్ష్వాకుల కాలంనాటి పద్ధతులనే అనుసరిస్తున్నారు. ఒరిస్సాలోని కొన్ని ప్రాంతాల్లో తపాలా బట్వాడాకు ఇప్పటికీ పావురాలనే ఉపయోగిస్తున్నారు. ఈ పావురం వార్తాహరులు ప్రభుత్వానికి చెందినవి. వీటిని పోలీసు శాఖవారు ఉపయోగిస్తున్నారు.

మనదేశానికి స్వాతంత్ర్యంవచ్చి 37 ఏళ్ళు అయినా తపాలా, టెలిగ్రాఫ్ సౌకర్యాలు ఇంకా అన్ని గ్రామాలకూ అందలేదు. ఒరిస్సాలోని 13 జిల్లాలలో ఈ ప్రభుత్వ పావురాలు సమర్థవంతంగా సమాచారాన్ని అందజేస్తున్నాయి. పైగా పావురాలు ఎలాంటి వాతావరణంలోనయినా పనిచేయగలగడం ప్రభుత్వానికి అదనపు లాభం. మరోలాభం ఏమంటే అవి మనుషుల్లా సమ్మెచేసి జీతాలు పెంచమని అడగవు. యంత్రాలలా అరిగిపోయేవీ కరిగిపోయేవీ కాదు. అందుకే తపాలా సౌకర్యాలు లేని మారుమూల ఊళ్ళల్లో పావురాల పోస్టే బెస్ట్ అన్న నిర్ణయానికి వచ్చింది ప్రభుత్వం.

ఈ పావురాలు మారుమూల కొండ ప్రాంతాలనుండి ఎన్నికల వార్తలను, ఫలితాలను చేరవేయడంలో, ఏమాత్రం వెళ్లే అవకాశంలేని వరద ప్రాంతాల పరిస్థితిని తెలియజేయడంలో చాలా ఉపయోగపడుతున్నాయి. ఒరిస్సా పోలీసుల వద్ద ప్రస్తుతం వెయ్యికి పైగా పావురాలున్నాయి.మరికొన్ని వందల పావురాలను తీసుకుంటున్నారు వారు.

ఒరిస్సా డి.ఐ.జి. పట్నాయక్ ఈ పావురం వార్తాహరులు నమ్మకమైన దూతలని అంటున్నారు. ఈ పావురాలు చిన్న చిన్న పోలీస్ స్టేషన్లనుంచి పెద్ద పోలీస్ స్టేషన్లకు ముఖ్యమైన సమాచారాన్ని తీసుకెళుతుంటాయి. వారిప్పుడు మరిన్ని ఉత్తమజాతి పావురాల కోసం కలకత్తా, బొంబాయిలోని పావురాల సేకరణదారులనూ, క్లబ్బులనూ అడుగుతున్నారు.

వార్తలను చేరేసే పావురాలకు మంచి శరీర సౌష్టవం, గాలి ఒత్తిడిని తట్టుకొనే





శక్తి, చురుకుదనం వుంటాయి. వయసును బట్టి ఒకో పావురం గంటకి 80 నుంచి 90 కిలోమీటర్ల దూరం పయనిస్తుంది. ఒకో పావురం సగటున 8 ఏళ్ళు జీవిస్తుంది. ఏకబిగిన 15 నుంచి 20 గంటలు పయనిస్తుంది.

పావురాలు రెండు తరగతులు. ఒకో రకం పావురాలు ఒరిస్సాలోని ఏ జిల్లాకైనా సరే వెళ్ళి క్షేమంగా తిరిగి వచ్చేస్తాయి. రెండోరకం పావురాలు వాటికి బాగా పరిచయమున్న చోట్లకు మాత్రమే వెళ్ళగలవు. దట్టమైన అడవుల్లోకి వెళ్ళే పోలీసు దళాలు పావురాలను వెంట తీసుకువెళ్ళి అవసరమైనపుడు వాటి ద్వారా ప్రధాన కార్యాలయాలకు వార్తలను పంపిస్తుంటాయి.

పావురాలకు ఆరు వారాల వయసు వున్నపుడు శిక్షణ మొదలవుతుంది. ఆరు బయట ఒక సంవత్సరం శిక్షణానంతరం పావురానికి పరీక్షగా ఓ పని అప్పగిస్తారు. నెగ్గితే ఒరిస్సా పోలీసు శాఖలో దాన్ని శాశ్వత ఉద్యోగిగా నియమిస్తారు. విజయవంతంగా వార్తలనందించిన పావురాలకు మంచి విందు చేస్తారు. ఒకో పావురాన్ని నిర్వహించడానికి 50 రూపాయలు ఖర్చు అవుతుంది.

పావురాల ప్రధాన శత్రువులు రాబందులు. ఏటా ఒకోజిల్లా కనీసం 10 పావురాలనయినా రాబందుల మూలంగా కోల్పోతుంది. అయితే పావురాలు కూడా రాను రాను అనుభవం మీద రాబందుల బారి పడకుండా పయనించడం నేర్చుకుంటున్నాయి. ఈ పావురాలు మన ప్రధాని, అధ్యక్షుడి ముందు కూడా తమ ప్రతిభను నిరూపించుకున్నాయి. 1954లో జవహర్‌లాల్ నెహ్రూ వదిలిన పావురం క్షేమంగా కటక్ చేరి కటక్ పోలీసులకు సందేశాన్ని అందించింది.

ఈమధ్య గుజరాత్ ప్రభుత్వం కూడా సౌరాష్ట్రలో వరద బాధిత ప్రాంతాలకు కొన్ని పావురాలను పంపింది. మధ్యప్రదేశ్ పోలీసులు బందిపోటు ప్రాంతాల నుంచి వార్తలను పంపడానికి ఎప్పుడూ పావురాలనే వాడతారు.




# కిడ్‌నాప్ పెళ్ళిళ్ళు

కేవలం బస్సులు, విమానాలనే కాదు కొందరు వధువులను కూడా కిడ్‌నాప్ చేసి మరీ పెళ్ళిళ్ళు చేసుకుంటారు. వీటిని సంఘం ఆమోదిస్తుంది కూడా!

భారతదేశంలోని ఈశాన్య ప్రాంతంలో వున్న లడక్‌లో పెళ్ళిళ్ళలో కట్న కానుకలు తీసుకునే ఆచారం లేదు. ఇక్కడ అబ్బాయే అమ్మాయిని ఎత్తుకు పోయి శ్రీకృష్ణుడిలా పెళ్ళాడేయటానికి బదులు అబ్బాయి తల్లిదండ్రులే అమ్మాయిని కిడ్నాప్ చేసేస్తారు.

ఇదోరకం కిడ్నాప్. వీరు ఎత్తుకు పోదలచిన అమ్మాయి ముఖాన ముసు గేయటం, కాళ్ళూ చేతులూ కట్టేయడం లాంటి పనులు చేయరు. అబ్బాయి, అమ్మాయి తరపు కుటుంబాల మధ్య పెళ్ళికి ఒప్పందం కుదరగానే పెళ్ళి కూతురి కుటుంబం అమ్మాయిని కిడ్నాప్ చేయడానికి గ్రీన్‌సిగ్నల్ చూపిస్తారు. తరువాత సాఫీగా కిడ్నాపింగ్ జరిగిపో తుంది.

ఆ తర్వాత అబ్బాయి తరపువారు అమ్మాయిని వాళ్ళింట్లో వుంచుకోరు. మధ్యవర్తి ఇంట్లో వుంచుతారు. తరవాత బౌద్ధ కేలండర్ ప్రకారం ఓ శుభ ముహూర్తాన అమ్మాయిని మధ్యవర్తి ఇంటినుండి మళ్ళీ కిడ్నాప్ చేస్తారు. ఈసారి అమ్మాయిని తమ ఇంటికే తీసుకు వెళతారు. ఇది జరిగిన నాలుగురోజులకి అబ్బాయి ఇంట్లోనే వధూవరులకి పెళ్ళి జరుగుతుంది. ఆశ్చర్యం ఏమంటే ఈ పెళ్ళికి వధువు తరపువాళ్ళెవరూ రారు. మరో నాలుగు రోజులు గడిచాక వరుడి కుటుంబ సభ్యులు వధువు ఇంటికి వెళ్ళి "మీ ప్రియమైన కుమార్తెను మేము ఎత్తుకుపోయినమాట నిజమే. ఆ విషయం మర్చిపోయి పరస్పరం క్షమించుకుందాం. మీ అమ్మాయిని ఎల్లప్పుడూ సంతోషంగా వుంచుతామని హామీ ఇస్తున్నాం. మీ అమ్మాయిని కిడ్నాప్ చేసినందుకు క్షమించండి" అని చెబుతారు.

వధువు కుటుంబం సరదాగా కోపం నటించాక చివరికి ఉదారంగా వరుడి కుటుంబాన్ని క్షమిస్తారు. వధూవరులు అమ్మాయి ఇంట్లో కొద్దిరోజులున్నాక అందరూ కలిసి అబ్బాయి ఇంటికి వెళతారు. ఆరోజున బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేస్తారు. విందు ముగిసిందంటే ఆ పెళ్ళిని అందరూ ఆమోదించినట్లే లెక్క.

## బట్టతల వైద్యం

అన్నింటికీ మందులు కనిపెడుతున్నారు గాని బట్టతలకు చికిత్సేమిటో మాత్రం ఎవరూ చెప్పలేకపోతున్నారు. ఇప్పుడేదో బట్టతల మీద వెంట్రుకలను నాటి బట్టతలను పోగొడుతున్నారనుకోండి. అయినా బట్టతల వైద్యం ఇరవయ్యో శతాబ్దపు వింతేమీ కాదు. పూర్వకాలంలో కూడా బట్టతలను నివారించడానికి అనేక పద్ధతులు ఉపయోగించేవారు. ఆరువేల సంవత్సరాల క్రితం ఈజిప్ట్ రాజు సత్తా తల్లి బట్టతలకో చిట్కావైద్యం కనిపెట్టింది.

ఆవిడ చికిత్స ప్రకారం కుక్కమలం, గాడిద మూత్రం, స్ట్రాబెర్రీ పండు పిప్పి కలిపి ఆ మిశ్రమాన్ని బట్టతలకు పట్టిస్తే జుత్తు పెరుగుతుందట. క్రీ. పూ. 400 ప్రాంతంలో ప్రముఖ శాస్త్రవేత్త, తత్వవేత్త అయిన హిపోక్రటస్ గులాబి ఎసెన్స్‌ను మద్యంలో కలిపి తలకు పట్టిస్తే బట్టతల మీద జుత్తు పెరుగుతుందని చెప్పాడు. రోమన్స్ ఎలుగుబంటి కొవ్వును బట్టతలకు రాసేవారట. క్రీ.పూ. 100లో ప్రముఖ బ్రిటిష్ వైద్యుడు తయోష్ క్రిటిష్ బట్టతలకు బతికివుండగానే కాల్చిన పాము బూడిదను రాస్తే జుత్తు పెరుగుతుందని సూచించాడు.

అరిస్టాటిల్ అతిగా సెక్స్‌లో పాల్గొనేవారు బట్టతలతో బాధపడతారని ప్రతిపాదించాడు.

క్రీస్తుశకం 18, 19 శతాబ్దాలలో ఫ్రాన్స్ బట్టతల నివారణకు ప్రసిద్ధి చెందింది. కాని ఆధునిక శాస్త్రీయ విజ్ఞానం ఈ సాంప్రదాయిక చికిత్సా విధానాలను ఆమోదించదు. ఆధునిక వైద్యం ప్రకారం జుత్తు కింది, పైభాగాలు రెండూ శుభ్రంగా వుంచాలి. ఆరోగ్యకరమైన జుత్తు పెరగడానికి మంచి ఆహారం, తలస్నానం వుండాలి. క్రమబద్ధంగా మసాజ్ చేయడం కూడా జుత్తు పెరుగుదలకు దోహదం చేస్తుంది.



బట్టతలను పూర్తిగా నివారించడానికి జుత్తు మార్పిడి శస్త్ర చికిత్స ఒక్కటే మార్గంలా కనిపిస్తోంది. కాకపోతే ఇదికాస్త ఖరీదైనది, బాధాకరమైనది. పైగా సమయం ఎక్కువ కావాలి.

ఇప్పుడు మెడ దగ్గిరున్న జుత్తును తీసి బట్టతలమీద నాటుతున్నారు. ఈ పద్ధతి నూటికి నూరు శాతం విజయవంతమవుతుందని వైద్యులు హామీ ఇస్తున్నారు. కొత్త చికిత్సలు వచ్చేవరకూ వీటితో తృప్తిపడక తప్పదు. అయితే ఇవి ఖరీదైనవి గనుక అందుబాటులో లేనివారు ప్రస్తుతానికి ప్రముఖులైనవారి బట్టతలలను గుర్తు తెచ్చుకొని తృప్తిపడటం మంచిది. ✳

నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్ల ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

GKBE.882.86 TL

బడిలో గంట గణగణమని మోగగానే అంతవరకూ ఆడుకుంటున్న పిల్లలంతా బిలబిలమంటూ బళ్ళోకి పరుగెత్తారు.

వాళ్ళంతా కూర్చోడానికి బల్లల్లేని, ఇవాళో రేపో కూలుతుందనిపించే పాకలో గల ఆ ప్రాథమికపాఠశాల విద్యార్థులే. పై తరగతివారి పిల్లలు మాత్రం పట్నం కాన్వెంటుకెళ్తూంటారు.

బడికెళ్తోన్న పిల్లల్నీ, బడినీ చూస్తూ లోపలికి నడిచాడు రవి.

లోపలంతా గోలగోలగా చేపల బజార్ని తలదన్నేలా వుంది.

బెత్తం వూపుతూ పిల్లల్ని అదలిస్తోన్న శివయ్య మాస్టారు రవిని చూస్తూనే "నువ్వటోయ్... రారా" అని పిలిచి ముక్కుపొడుం దట్టించేక అన్నారు "స్కూలుకి ఫస్టొచ్చావని విన్నాను. ఇప్పుడేం చేద్దామను కుంటున్నావ్?"

"ఇంటర్మీడియట్ చదువుదామనీ.."

కళ్ళద్దాలపైనుంచోసారి మిర్రిచూసి "అభిప్రాయం మంచిదే అనుకో గాని మన తాహతు కూడా చూసుకోవాలికదా. ఈరోజుల్లో కాలేజీలంటే వ్యాపార సంస్థలే. చేరింది మొదలు సర్టిఫికెట్టు తీసుకునేదాకా ప్రతిదీ డబ్బుతోనే ముడి పడి వుంటుంది. పైగా పట్నంలో వుండి చదవాలి. మీ నాన్న ఎంతవరకూ ఈద గలడు?" అన్నారు.

"నాకు చదవాలనుందండీ"

"నీలాటి చురుకైన కుర్రాడు తప్ప కుండా చదవాల్సిందే. కాని రెక్కల్లో శక్తి వున్నంత మేరకే ఎగరటం శ్రేయస్కరం. అయినా ఈరోజుల్లో ఎంత చదివినా వుద్యోగాలెక్కడివోయ్. యమ్మేలు చదివినవాళ్ళు ప్యూను పోష్టులకి పోటీ పడుతున్నారే. టెన్త్ పాసయ్యావు గనుక టైపూ, షార్టు హేండూ నేర్చుకుని వుద్యోగ ప్రయత్నాలు చెయ్యడం మంచిది గదా!"

రవేం మాట్లాడలేకపోయాడు. అతడికి ఆశాభంగమయ్యింది. ఇలాటి మాటల్తోనే సలహా కోసం వచ్చిన తన తండ్రిని ఆయన నిరాశపర్చేశాడట. అందుకనే పై చదువులకి పంపనని భీష్మించుకు కూర్చు న్నాడాయన. మాస్టారి చేత మళ్ళీ చెప్పించి తండ్రి మనసు మార్పించాలనొచ్చాడు తను. కానీ ఈయన ధోరణి నిరుత్సాహ కరంగా వుంది.

"నీకు బాధగా వుండొచ్చుగాని లోకం సంగతి చెప్పడం నా ధర్మం. మా అబ్బాయిని నేను చదివించడం లేదా అని నువ్వడగొచ్చు. వాడు యమ్మెస్సీ చదువు తున్నాడు. అదిగాక జాతకరీత్యా వాడు కలెక్టరవడం ఖాయం అని ఉంది"

ఆమాటలంటున్నపుడు ఆయన కళ్ళల్లో మెరిసిన మెరుపులకి ఆశ్చర్యమూ, ఆసందమూ కూడా కలిగాయి రవికి. అది చూశాక తనుతప్పకుండా కాలేజీలో చేరా లన్న కోరికమరింత బలపడింది.

"మీరో మాట చెబితే మానాన్న కాదనడు మాస్టారూ" ప్రాథేయపూర్వ కంగా అన్నాడు.

కళ్ళు చికిలించి చూశారాయన.

"ఆర్థిక ఇబ్బందుల్లో చిక్కుకుని సగంలో చదువుకి స్వస్తి చెప్పా ల్సొస్తుందేమో ఆలోచించుకో. ఆ తర్వాత నీ ఇష్టం, మీ నాన్న ఓపిక"

ఆయన వల్ల తనకార్యం సానుకూల పడదని స్పష్టమవడంతో వస్తానని చెప్పి బయల్దేరాడు రవి.

భోంచేసి పడుకున్నాడన్న మాటే




గాని నిద్రాదేవి అతన్ని కరుణించడం లేదు.

చదువునాపెయ్యాలంటే గుండెల్ని పిసికేస్తున్నంత బాధ!

చదువు కొనసాగించాలంటే ముందు కడుగెయ్యనివ్వని తండ్రి ఆర్థిక స్థితి!

కాని, ఏది ఏమైనాసరే డాక్టర్నవ్వా లన్న కోరిక అతని హృదిలో ఏనాడో గాఢంగా నాటుకుపోయి ఉంది. దాన్ని మరచిపోవటం అసాధ్యం.

ఆ జీవితాశయం నెరవేరాలంటే తను చదవాలి. ఇంటర్లో చేరాలి. అతడో నిశ్చయానికొచ్చి హాయిగా నిద్రపోయాడు.

* * *

ఆకలి లేదంటూ భోంచెయ్యలేదు రవి.

పాలలో పంచదార కలిపి ఇచ్చింది తల్లి శాంతమ్మ.

సాయంత్రం వరకూ ముభావంగానే ఉండి రాత్రి కూడా భోజనం చెయ్యననే సరికి ఆవిడకి అనుమానం వచ్చింది.

"ఏవిట్రాఅబ్బాయ్...అలావున్నా వేమిట్రా చెప్పరా" అంది కన్నీళ్ళతో.

"నేను చదువుకుంటాను" తలొంచు కున్నాడు ఆమె కళ్ళల్లోకి చూడలేక.

"అలాగేలే.. మీ నాన్నతో చెబుతాన్లే. మన తాహతు చాలదనిగాని నువ్వు చదువాపడం మీనాన్నకి మాత్రంఇష్టమను కున్నావట్రా. కాళ్ళు కడుక్కునిరా.. నిన్ననగాతిన్న అన్నం — ఈమాత్రం భాగ్యానికి పొద్దుట్నుంచీ కడుపు మాడ్చు కోవాలేమిట్రా పిచ్చినాయనా"

గబగబా పీటవాల్చి భోజనం వడ్డిం చింది.

రవి భోజనమైన కాస్సేపటికి రామయ్యగారు పొలాన్నుంచొచ్చారు. స్నానం, భోజనం ముగించుకుని ఓ చుట్ట వెలిగించి పొగాకు కట్ట ముందేసుకుని చుట్టలు చుడుతూ కూర్చున్నారు.

"మీ కెప్పుడూ చుట్టల యావేగాని అబ్బాయి సంగతేమైనా పట్టించుకుంటారా లేదా" అంది శాంతమ్మ వంటగది సర్దివచ్చి.

"అదేంమాటే! ఏంచేస్తే బావుంటుందని వాకబు చేస్తూనే వున్నాను గదా. శివయ్య మాస్టారేమో పైచదువులకు నువ్వు తూగలేవు టైపు నేర్పించి ఉద్యోగంలో పెట్టమంటున్నారు"

"కాని వాడికింకా చదవాలనుందట. మీరొద్దంటున్నారని పొద్దుట్నుంచీ అన్నం తినలేదు బిడ్డ"

కొడుకుకేసి ఆశ్చర్యంగా చూశా రాయన. రవి తలొంచుకున్నాడు. ఆయన ముఖం బాధతో అసహాయతతో కంది పోయింది. చూపులు మరల్చి తనపనిలో నిమగ్నమయ్యారు.

"కూర్చోరా"

కూర్చున్నాడు రవి.

"చురుగ్గా చదువుతూ స్కూలుకల్లా ఫస్టున పాసైనందుకు మేమెంత పొంగి పోతున్నామో నిన్నింకా చదివించలేక పోతున్నందుకు అంతగానూ కృంగి పోతున్నాంరా. మన స్థితిగతుల గురించి నీకు తెలీందేముంది చెప్పు. మనకున్నదే అయిదెకరాల భూమి. దానిమీద వచ్చే అయివేజు ఏమాత్రం? కష్టమైతే పెరిగింది గాని పంట దిగుబడి పెరగలేదుకదరా. బేరేజు పన్నూ, ఆ పన్నూ ఈ పన్నూ అంటూ పళ్లూడగొడుతున్నారాయె. ఎరు వుల ధరలూ, పురుగు మందుల ధరలూ ఎక్కువైపోయినా ధాన్యం రేటుమాత్రం గిట్టుబాటు కావటంలేదాయె. 'కొనబోతే కొరివి అమ్మబోతే అడవి' అన్నట్టయి

ఎంతోరుచి...
ఎంతోరుచి...

ప్రియలోనే
వుంది.




అన్ని రకాలలోను అనంతమైన రుచులు
కలబోసి అందిస్తై ప్రియ పచ్చళ్ళు.
తలచుకొంటే చాలు తరగిపోని
రుచిరానుభూతికి- ప్రియ.
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి
తీసుకువెళ్ళండి.

ఎంతోరుచి... ఎంతోరుచి...-ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

Kiran PF 832

పోయింది మన పని. అప్పులుచేసి పెట్టుబళ్లు పెడుతూ భూమినే నమ్ముకుని ఏదోరకంగా బండిని లాక్కొస్తున్నాం తప్ప అన్నీ వుండి కాదుకదా. సోమయాజులగారి పొలమోనాలుగెకరాలు కౌలుకి చేస్తున్నామంటే ఏదో ఎప్పట్నుంచో చేస్తున్నామనిగానీ అందులో ఏదో మిగులుతుందనికాదుకదా"

ఆగి సాభిప్రాయంగా చూశారు కొడుకు వంక.

రవి మాట్లాడలేకపోయాడు. తండ్రి మాటల్లో పొల్లులేదని తెలుసు. కాని తన చదువాగడమన్న వూహనే భరించ లేకుండా వున్నాడతడు.

"ఆ సోదంతా ఇప్పుడెందుకండీ...వాడి కవన్నీ ఏం తెలుస్తాయి? మన బాధలూ గాథలూ ఎప్పుడూ వుండేవేగా" అసహనంగా అంది శాంతమ్మ.

"ఇవన్నీ ఇవాళ కాకపోయినా రేపైనా తెలియాల్సినవేనే! ఇంటికి పెద్ద బిడ్డ. నా తర్వాత పిల్లల బాగోగులూ అవీ అన్నీ వాడే చూడాలిగదా"

"ఎప్పుడోమాట ఇప్పుడెందుకులెండి. వాడు పైకిరావాలిగానీ తమ్ముళ్ళనీ చదివిస్తాడు, చెల్లికి పెళ్ళి చేస్తాడు. ఆ సంగతులు నా బిడ్డకి మీరేం చెప్పనక్కర్లేదు"

"అయితే ఏమిటంటావ్?"

"వాడికంత ఇదిగా చదవాలనున్నప్పుడు చదివిద్దామండీ. ఆపైన భగవంతుడే వున్నాడు"

"నిజమేగానీ దిగే ముందు లోతెంతో, మన శక్తి ఎంతో బాగా చూసుకుని మరీ దిగాలి. లేకపోతే అభాసుపాలవుతాం. వ్యవసాయ పెట్టుబళ్ళకోసం ఎంత తడువు ళ్ళాటవుతోందో నీకుతెలుసుకదా. ఇంట్లోని బంగారమంతా మార్వాడీదగ్గరే వుందాయె. మరటువంటప్పుడు తొందరపడి రంగంలోకి దిగితే ఎంత కష్టమైపోద్దో ఆలోచించు. కాలేజీ చదువంటే మాటలుకాదు. శివయ్య మాస్టారన్నట్టు నెలనెలా ఇంతింత డబ్బు మూటలు పంపాలి" అన్నారాయన చేతుల్తో ఎంత మూటో చూపిస్తూ.

"ఈ కష్టాలూ, అప్పులూ ఎప్పుడూ వుండేవేనండీ! కాని బిడ్డని రేపు మంచి రోజులొచ్చి చదివించాలనుకున్నా చదివించగలమా చెప్పండి? అందుకని ఇప్పుడే ఏ ఇబ్బందోపడి అప్పులో అప్పనుకుని చదివిస్తే వాడే దరిజేరుస్తాడు మిగతా పిల్లల్ని"

వాళ్ళ ఆశలు అన్నీ తన చుట్టూనే అల్లుకుంటున్నాయని గ్రహించేసరికి గుండెలు బరువెక్కాయి రవికి.

"సరే... మీరంతగా చెబుతోంటే కాదనడం ఎందుకూ. ఏమైతే అవుతుందిగానీ అలాగే కానివ్వరా! ఇంతకీ ఏడాదికి ఏమాత్రం ఖర్చవుతుందేమిట్రా?"

"ఏమో... కనుక్కోవాలి!"

"రేపెళ్ళి మావయ్యని కనుక్కొస్తావూ?"

"వూఁ"

ఆ మర్నాడే టౌన్లో వుంటోన్న మేనత్త ఇంటికెళ్ళాడు రవి.

అతడికొచ్చిన మార్కుల సంగతి విని మేనత్తా మావయ్యలిద్దరూ సంతోషించారు. ఇదే అదననుకుని మేనత్త తన పుట్టింటి గొప్పల్లో ఓ నాలుగు వల్లించేసింది.

మున్సిపాలిటీవారి అప్పర్ ప్రైమరీ స్కూల్లో టీచరుగా పనిచేస్తోన్న మావయ్య కుటుంబరావుగారికి కాలేజీలో చేరాలన్న తన వుద్దేశాన్ని వ్యక్తపరచి

సంవత్సరానికెంత ఖర్చవుతుందో తండ్రి కనుక్కురమ్మన్నాడని చెప్పేడు రవి.

"గది అద్దెకు తీసుకుసుంటూ, హోటల్లో భోంచేస్తే ఎంతలేదన్నా ఏడాదికి ఫీజుల్తో కలిసి రెండువేలు దాటుతుందిరా. అయినా ఎవరూ లేనట్టు ఎక్కడోవుండి చదువుకోవడం ఎందుకూ మా ఇంట్లోనే వుండి చదువుకుందువుగాన్లే" అన్నారాయన.

మేనత్త కూడా ఆమాటే అంది.

కాని రవికిష్టంలేదు. వాళ్ళతో వుంటే తనకిబ్బందని కాదు - తనవల్ల వాళ్ళకే ఇబ్బంది. నాలుగొందల చిల్లర జీతమొచ్చే చిరుద్యోగులు టౌన్లలో పడే ఆర్థిక ఇబ్బందులెలాంటివో అతడికి తెలుసు. ఒకవేళ వాళ్ళింట్లోనే వుంటూ ఏ బియ్యంపు మూటలో తెచ్చిద్దామంటే స్వీకరించడానికి వారికభిమానం అడ్డొస్తుందాయె.

"ఎందుకులే మావయ్యా! ఇంకా మా ఊరి కుర్రాళ్ళున్నారు. అందరం కలిసి ఒక చోటుండి చదువుకోవాలను కుంటున్నాం" అన్నాడు—నిజానికెవ్వరూ లేకపోయినా.

అసలు వాళ్ళ వూళ్ళో కాలేజీ చదువు చదివినవాళ్ళు ఆరుగురే. వాళ్ళలో శివయ్య మాస్టారబ్బాయి ఒక్కడూ మాత్రం యూనివర్శిటీలో చదువుతోంటే మిగతావాళ్ళు డిగ్రీతోనూ, పీయూసీతోనూ, ఇంటర్మీడియట్‌తోనూ ఆపేశారు. వాళ్ళ గ్రామంలో హైస్కూలు లేనందున పక్కవూరెళ్ళి హైస్కూల్లో చదివిన వాళ్ళు ఓ నలభైమందికంటే వుండరు. వాళ్ళలో యస్సెల్సీ లేక యస్సెస్సీ పాసైనవాళ్ళు పదిమందికి మించరు. ఎక్కువమంది ఎలిమెంటరీ స్కూల్లో చదివో, అదీ చదవకో, వ్యవసాయంలోనో, మరో వృత్తిలోనో ఇమిడిపోతూంటారు.

"పోనీ బయటవుండి చదివేకన్నా హాస్టల్లో చేరితే మంచిది కద్రా! స్కాలర్‌షిప్ వస్తుందిగనుక ఖర్చు సగానికి సగం తగ్గుతుంది"

రవికీ అదే బాగుంటుందన్పించింది. హాస్టల్లోవుంటే భోజనం ఖర్చూ, రూము ఖర్చూ వుండదు. ఇక కాలేజీ ఫీజులూ, పుస్తకాలూ, పైఖర్చూ మాత్రం భరించాల్సుంటుంది.

అలాగే అన్చెప్పి వచ్చి తండ్రితో హాస్టల్లో వుండి చదువుతాననీ, సంవత్సరానికి ఏడెనిమిది వందలవుతుందనీ చెప్పాడు— వెయ్యి రూపాయలంటే ఇదైపోతారేమోనని.

"అలాగే చదువుకో." అన్నాడాయన కొడుకు వంకోసారి చూసి గాఢంగా నిశ్వసిస్తూ.

"త్వరగా చేరితే మంచిదన్నాడు మావయ్య. మళ్ళీ సీట్లు దొరుకుతాయో లేదోనని..."

"మంచిరోజు చూసుకునెళ్దాంలే"

పురోహితుడు చెప్పిన రోజున తండ్రీ కొడుకులిద్దరూ టౌనుకెళ్ళారు. కుటుంబరావుగార్ని తీసుకుని కాలేజీకి వెళ్ళారు.

అడ్మిషన్ ఫారాలు నింపుతూ "కాంపోజిట్ లెక్కల్లో ఎక్కువ మార్కులొచ్చాయిగా యంపీ గ్రూపు తీసుకో" అన్నారాయన.

"బై. పి. గ్రూపు తీసుకుంటాను మావయ్యా"

"మెడిసిన్‌కి వెళ్ళే తప్ప రేపు వుద్యోగం రావడానికి ఆ గ్రూపేం తోడ్పడదు"

"మావయ్య ఎలా చెబితే అలా చెయ్యరా" అన్నాడు తండ్రి.

"నాకా గ్రూపే చదవాలనుంది" అన్నాడు రవి.

"సరే... అదే తీసుకో. ఈరోజుల్లో ఏ డిగ్రీ అయినా ఒకటేలే. క్లాసు వస్తే ఏ గ్రూపైనా విలువిస్తారు"

ఫీజు కట్టేసి క్లాసులెప్పుడు ప్రారంభిస్తారో తెలుసుకొని వచ్చేశారు ఇంటికి.

ఆరోజు రవి ఆనందానికి అవధుల్లేవు.

ఆ రాత్రి ఎన్నెన్నో కలలుకన్నాడు. అప్పుడే డాక్టరైపోయినట్టూ, స్వగ్రామంలో ప్రాక్టీసు ప్రారంభించినట్టూ, ఎందరెందర్నో మృత్యుముఖం నుండి కాపాడినట్టూ...

* * *

క్లాసులు ప్రారంభమయ్యే రోజు దగ్గర పడింది.

టౌనుకెళ్ళడానిగ్గానుబట్టలూ,పుస్తకాలూ వగైరాలన్నీ సర్దుకున్నాడు రవి. అత్తయ్యకిమ్మని తల్లి ఇచ్చిన మైసూరు పాక్ ముక్కల పాకెట్టు జాగ్రత్త చేశాడు.

అమ్మనీ, నాన్ననీ, తమ్ముళ్ళనీ, చెల్లినీ, స్నేహితుల్నీ, ఆ ఇంటినీ, వూరునీ వదలి వెళ్ళాలంటే బాధగా అన్పించింది. తల్లి కళ్ళల్లోని నీళ్ళూ, తమ్ముళ్ళ బిక్క మొఖాలూ చూసి ముందుకడుగెయ్యలేక వేశాడు.

పాలేరు సామాను మోసుకొస్తోంటే మైలున్నర దూరంలోని మెయిన్ రోడ్డు దగ్గరికెళ్ళి ఆగారు బస్సుకోసం.

రామయ్యగారు పదినోట్లు పదిచ్చి "ముందు కావాల్సినపుస్తకాలుకొనుక్కో. ఓ పది - పదిహేనోజులపాటెలాగూ మేనత్త ఇంట్లోనే వుంటావుగా. ఈ లోపల ఇంటికొచ్చేసరికి లెక్క అందుతుందిలే. పట్టుకెళ్ళవుగాని. నీకసలే పట్నంలో వుండటం కొత్త. కాస్త జాగ్రత్తగా మంచిస్నేహితుల్తోవుంటూండు.సినిమాలూ సిగరెట్లూలాంటివి అలవాటు చేసుకోకు. తెల్సిందా? నీకేం కావాల్సొచ్చినా సిగ్గుపడకుండా మావయ్య నడుగు. మావయ్యతో కూడా చెప్పేన్లే. ప్రతి ఆదివారం ఇంటికొస్తూండు. అన్నట్టు సామానేం మర్చిపోలేదుకదా?" అనడిగారు.

"లేదు"

"సరే... జాగ్రత్తగా ఉండు. ఎవ్వరితోను పోట్లాటల్లాంటివి పెట్టుకోకు. నీ చదువు తప్ప ఇంకే విషయాల్లోనూ తలదూర్చకు. ఒకటికి రెండు సార్లు నాన్నెందుకు చెబుతున్నాడో అని ఆలోచించు"

కాలేజీ స్టూడెంటు అవబోతోన్న తనకి తండ్రి మరీ చిన్నపిల్లాడికి జాగ్రత్తలు చెప్పినట్టు చెబుతోంటే రవికి అదోలా అన్పించింది.

ఇంతలో బస్సొచ్చింది. తన కెపాసిటీకన్నా ఓ ఇరవై మందిని ఎక్కువే ఎక్కించుకుని మరీ వచ్చింది పూర్ణగర్భిణిలా.

అతికష్టంమీద బస్సెక్కాడు రవి. పాలేరు సామానుని బస్సుటాపు మీద వేశాడు.

నిలబడటానిక్కూడా చోటులేక ఇబ్బందిపడ్డా కొన్నినిమిషాలకే అదంతా మర్చిపోయాడు రవి. కాలేజీ జీవితం గురించిన తీయని వూహల లోకంలోకి జారిపోయాడతడు.

బస్సు దిగి రిక్షామీద మేనత్త ఇంటికెళ్ళాడు.

"రావయ్యారా" అంటూ ఆప్యాయంగా



ఆహ్వానించింది మేనత్త అన్నపూర్ణ.

అతడికీ, వారి పెద్దబ్బాయికి కలిపి వీధివైపునున్న చిన్న గదిని ఖాళీచేసి ఇచ్చారు. ఇక వారికి మిగిలిందల్లా ఒక చిన్న హాలూ, వంటగదీనూ.

కుటుంబరావుగారికి నలుగురు పిల్లలు.

పెద్దవాడు జయంత్. రవికన్నా రెండేళ్లు చిన్నవాడైనా పొడుగవటం వల్ల రవికన్నా పెద్దవాళ్ళా కన్పిస్తాడు. నైన్త్‌క్లాస్ చదువుతున్నాడు. కాస్త జులాయిగా తిరుగుతాడేమో - వాడంటే చుట్టుపక్కల పిల్లలకి హడల్.

రెండోది భవాని. ఆ పిల్లపుట్టగానే రవి పెళ్ళాం అన్నారంతా. పట్టుమని పదేళ్లైనా లేకపోయినా నిండుకుండలా ఉంటుంది ఎప్పుడూ.

తర్వాతది కామేశ్వరి. తన అక్కకి పూర్తి భిన్నం. చాలా చలాకీ పిల్ల. అస్తమానూ బావా బావా అంటూ రవి చుట్టూనే తిరుగుతూంటుంది.

ఆఖరివాడు గోపి. వాడస్తమానూ పుస్తకం తెచ్చి పాఠం చెప్పమంటాడు రవిని. ఇప్పుడు కాదు. బావ చదువుకోవా లంటుంది కామేశ్వరి. దాంతో ఇద్దరికీ పోట్లాట. ఎవరు చెప్పినా వినరుగాని రవి కేకేస్తే చాలు గప్‌చిప్ అయిపోతారు.

మొదట్లో సిగ్గుపడ్డా తర్వాత అందర్లోనూ కలిసిపోయి తమ్ముళ్ళా, చెల్లెలు దగ్గరలేని లోటు మర్చిపోయాడు రవి.

• • •

ఆవాళే క్లాసులు ప్రారంభమని నోటీసు పెట్టారు. విద్యార్థిగా ప్రథమంగా కాలేజీలో అడుగుపెడుతూ విచిత్రానుభూతి ఫీలయ్యాడు రవి. ఓపక్క మహోత్సాహం, మరోపక్క కంగారూ పోటీపడుతున్నాయి.

తనేకాదు-తన క్లాసువాళ్ళంతా కూడా కొత్తవాళ్లే కదానని పదే పదే ధైర్యం చెప్పుకుని క్లాస్‌రూంలోకెళ్ళాడు. హైస్కూళ్లోలా మొదటి బెంచీ మీద కూర్చోడానికి ధైర్యంచాలక రెండో బెంచీ మీద కూర్చున్నాడు.

చాలామంది కుర్రాళ్లే వచ్చినా ఒక్కరూ సరిగ్గా కూర్చోలేదు. గుమ్మాల్లోనూ, క్లాస్‌రూం బయట మర్రి చెట్ల నీడల్లోనూ వుత్సాహంగా కబుర్లు చెప్పుకుంటున్నారంతా.

బెల్ మోగి అరగంటైనా లెక్చరర్ రాలేదు. 'ఇదేం కాలేజీరా బాబూ' అనుకొంటోంటే "ఏమండీ" అని పిలిచారెవరో.

అటు తిరిగిన రవి వణికిపోయాడు.

తనకొద్ది దూరంలో ఇద్దరు అమ్మాయిలు!

"ఏమండీ" అన్నాడు తిరిగి లేచి నిలబడి.

"ఇవేళక్లాసులు కేన్సిలయ్యాయాండీ?" కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటూ అడిగిందో అమ్మాయి.

"అబ్బే...ఏమోనండీ... తెలీదండీ! ఇవాళే అని నోటీసు పెట్టారు కదండీ. మళ్ళీ మార్చారాండీ?" ఎదురు ప్రశ్న వేశాడు రవి.

"మాకూ తెలీదండీ" అనెళ్ళిపోయారు వాళ్ళు.

అప్పుడుగాని వాళ్ళ ప్రశ్నకి జవాబుగా తనూ అదే ప్రశ్నని వాళ్ళకే వేసినట్టు తెలీలేదతడికి. సిగ్గూ, నవ్వూ కూడా ఒక్కసారే వచ్చాయి.

ఓ కుర్రాడొచ్చి "మీ పేరేమిటండీ?" అంటూ రవి పక్కన కూర్చున్నాడు.




"కె. రవి"

"ఎస్సెస్సీలో పెర్సెంటేజ్ ఎంతొచ్చింది?"

"డెబ్భయ్యొకటి"

"వెరీగుడ్! నాకు డెబ్భయి శాతం వచ్చాయి"

ఆతడికన్నా ఒక్క పెర్సెంటైతేనేం ఎక్కువొచ్చినందుకు రవి భుజాలు అరంగుళం పొంగాయి. "మీ పేరేమిటండీ?" అనడిగాడు వుత్సాహంగా.

"వీరాస్వామి"

మిగతా వివరాలు కూడా తెలుసుకున్నాక "మీరెక్కడుంటున్నారు?" అనడిగాడు.

"మా వూరతన్తో కలిసి గది అద్దెకు తీసుకునుంటున్నాను. మీరు?"

"బంధువులింట్లో వుంటున్నాను"

కాసేపట్లో ఇద్దరూ సన్నిహితులైపోయారు. కాలేజీ గురించి, ఇంటర్మీడియట్ తర్వాతి చదువుల గురించి మాట్లాడుకున్నారు.

యం.బి.బి.యస్. చదువుతాననీ, తమ పల్లెలోనే ప్రాక్టీసు పెడతాననీ రవి చెప్పేసరికతడి కళ్లు మెరిసాయ్.

"మీరదృష్టవంతులండీ! నాకూ చదవాలనే వుందిగానీ చదవటానికి వీల్లేకుండా వుంది మా ఇంటి పరిస్థితి" బాధగా అన్నాడు.

"అంటే?"

"మా నాన్నగారింకో సంవత్సరం

లోనో, రెండు సంవత్సరాల్లోనో రిటైర వుతారు. ఆతర్వాత మా కుటుంబ భార మంతా నామీదే పడుతుంది"

"అదేం? మీకేం పొలం లేదా?"

"రెక్కలే మా ఆస్థిపాస్తులు. ఖాళీగా వుండటం ఎందుకని కాలేజీలో చేరాను గానీ, ట్యూషన్లు చెబుతూ వుద్యోగ ప్రయత్నాలు చెయ్యడం నా ముఖ్యోద్దేశం"

వెంటనే ఏం మాట్లాడలేకపోయాడు రవి.

ప్రతివారికీ సమస్యల సంకెళ్లు ఉన్నట్టు వున్నాయి. ఇక ఈ దేశంలో సుఖ పడుతున్నది ఎవరు?

ఇంతలో సూటూ బూటూ ధరించిన ఓ లెక్చరర్ వచ్చాడు. గుమ్మాల్లోనూ, బయటా నిలబడివున్న వాళ్ళంతా బిలబిల మంటూ లోపలికొచ్చేశారు. రెండు నిమిషాల్లో క్లాసంతా నిండి నిశ్శబ్దమై పోయింది.

అటెండెన్స్ వేసి తన గురించి చెప్పి అందరి పేర్లు, వూర్లూ చెప్పమన్నా డాయన.

అనంతరం ఇంగ్లీషు పాఠం మొదలు పెట్టాడు.

ఆయన షేక్స్పియర్ అన్నాడు. నాటకాలన్నాడు. ట్రాజెడీలన్నాడు. సోనెట్స్ అన్నాడు. ఫిలాసఫీ అన్నాడు.

ఇంగ్లీషులో ఆయన అనర్గళంగా వుపన్యసిస్తోంటే నోరు తెరచి చూస్తూండి పోయాడు రవి. అతడికి ఒక్క ముక్కా అర్థంకాలేదు.

ఎంత ఆంగ్ల పాఠమైతే మాత్రం తెలుగులో అర్థంచెబుతూ వివరించకూడదా అన్పించింది. ఇదివరకు ఇంగ్లీషు మీడియం రోజుల్లో ఎలా అర్థం చేసుకునేవారో, ఏం జీర్ణించుకునేవారో అన్పించింది.

బెల్ మోగటంతో ఆయన వెళ్ళ డానికుద్యుక్తుడయ్యాడు. ఇంతలో ప్యూనొచ్చి ఓ చీటీ ఇచ్చాడు. అది చదివి "ఇవాళ్టికి మిగతా క్లాసులు కేన్సిల్" అన్చెప్పి వెళ్ళిపోయాడాయన.

నిట్టూరుస్తూ లేచాడు రవి.

"మా రూంకు వెళ్దాం రండి"

స్వామి ఆహ్వానాన్ని మన్నిస్తూ తలూపాడు రవి.

దార్లో హోటల్లో టీ తాగారు. టీ తాగుతూ స్వామి న్యూస్‌పేపర్ పూర్తిగా చదివేశాడు.

ఏ ఒకరిద్దరికో తప్ప పేపర్లురాని, లైబ్రరీలేని పల్లెలో పుట్టి పెరిగిన రవి అతడివంక ఆశ్చర్యంగా చూశాడు. పేపరంటే సినిమా ప్రకటనలే కాదన్పించింది. హైస్కూల్లో వార్తా పత్రికల గురించి చదివిన వ్యాసం గుర్తొచ్చి ఇక రోజూ లైబ్రరీకెళ్ళి పేపర్ చదువుకోవాలని నిర్ణయించుకున్నాడు.

స్వామి వుంటోన్న గది చిన్నదే అయినా ముచ్చటగా వుంది. ఒకపక్క మంచం, దాని మీద పొందికగా వున్న దుప్పటి, ఇంకోపక్క చిన్న టేబులూ దాని వెనుకనున్న అలమారలో వరుసగా పేర్చిన పుస్తకాలు, అద్దం దువ్వెన పౌడరుడబ్బా, ఇంకోపక్క కుర్చీ, గోడలకి కేలెండర్లు మొత్తానికి గది ఆకర్షణీయంగా వుంది. అత్తయ్యగారింట్లో తనుండే గది గుర్తొచ్చి చిన్నబోయాడు రవి.

"మీరిలా రూములోవుండి చదువుకునే కన్నా హాస్టల్లో వుండే ఖర్చు తక్కువవు తుంది కదండీ! మీవాళ్ళకి కాస్త తెరిపిగా వుంటుందికదా" అన్నాడు రవి.





"హాస్టల్లోజేరాలన్నదే నా ప్రయత్న మూనూ"

"అయితే ఇంకేం. మనిద్దరం కలిసే వుందాం"

"మీరెక్కడో బంధువులింట్లో వుంటున్నామన్నారుగా?"

"ప్రస్తుతానికుంటున్నానండీ! హాస్టల్ తెరవగానే వెళ్ళిపోతాను"

"హాస్టల్ తెరిచేసరికింకో పది-పది హేను రోజులు పట్టొచ్చు. కాని ఇప్పట్నుంచే సీటుకోసం ప్రయత్నించాలి. లేకపోతే దొరకదు"

''అదేమిటి? అందర్నీ చేర్చుకోరా?'' విస్మయంగా అడిగాడు.

''వూహూ... వెనుకబడినవారికనీ, వీరికనీ ఏవేవో కోటాలుంటాయి. మనం ఆర్థికంగా వెనుకబడిన కులాలకి చెందిన వాళ్ళం గనుక మనకి ఓ అయిదారు సీట్లుంటాయి. ఎన్ని ఉన్నా వుత్తర దక్షిణాలు తప్పవు!''

అర్థం తెలిశాక ప్రమాన్పడిపోయాడు రవి.

* * *

రవి తన గదిలోని సామానునీ, పుస్తకాలనీ ఓ పక్కకు చేర్చి బూజు తుడుస్తోంటే మేనత్త వచ్చింది.

"అదేం పని రవీ! ఇది మగాళ్ళు చేసే పనేనా? చాల్చాలు గానీ ఇలారా. నాతో చెబితే శుభ్రంచేద్దును గదా''

"ఏం లేదత్తా ... కొంచెం చిరాగ్గా వుంటేనూ..."

"నాతో చెప్పకూడదూ.... నేనేమైనా పరాయి దాన్నా ఏమిటి? ఆడవాళ్ళు సర్దితే ఎంత బావుంటుందో నీ కళ్ళతో నువ్వే చూద్దువుగాని" అంటూ ఆ పనిని భవానీకి పురమాయించింది.

ఆవిడ బియ్యంలో రాళ్ళేరుతోంటే పీట వాల్చుకుని కూర్చున్నాడు రవి. కాలేజీ విశేషాల గురించి అడిగినవన్నీ చెప్పాడు.

"ఎప్పుడు చెప్పిన పాఠాలప్పుడు శ్రద్ధగా చదువుకో. పరీక్షల ముందు చదువుకోవచ్చులే అని అశ్రద్ధ చేసి ఇబ్బందుల పాలవుతూంటారు చాలా మంది" అందామె అంతా విని.

తలూపేడు రవి.

"ఎవరైనా స్నేహితులయ్యారా లేదా?"

స్వామిగురించీ, అతని గది గురించీ చెప్పేడు.

ఇంతలో టీనీళ్ళు మరగటంతో ఇన్ని పాలు కలిపిచ్చిందతడికి. మరికాసేపటికి భవానీ రావడంతో "అయ్యిందా" అనడిగింది అన్నపూర్ణ. సిగ్గుగా తలూపింది భవాని.

రూమ్‌లోకెళ్ళిన రవి ఆశ్చర్యంలో మునిగిపోయాడు. ఏది ఎక్కడ వుండాలో అక్కడ, ఎలావుండాలో అలాగ అందంగా సర్ది వుంది గది.

"ఎలా వుంది రవీ!" అతడి వెనుకే వచ్చిన మేనత్త అడిగింది.

"చాలా బావుంది"

"నేన్చెప్పలేదూ...ఇటువంటివాటిల్లో ఆడవాళ్ళదే పైచెయ్యంటే-వాళ్ళలో మా భవానీది మరీ పైచెయ్యి. దాన్ని పెళ్లి చేసుకున్నావంటే సుఖపడతావు. ఏమంటా వయ్యా" నవ్వుతూ అడిగింది.

సిగ్గుగా నవ్వేడు.

"ఏం బాబూ మాట్లాడటంలేదు. నేనేం వూరికే చేసుకోమనడం లేదులే. మా తాహతుకొద్దీ కొద్దో గొప్పో కట్నం ఇస్తాంలే" అనెళ్ళిపోయింది నవ్వుకుంటూ.

ఏవేవో వూహలు వురికిరాగా తలొంచుకుని కూర్చునుండిపోయిన రవి "బావా బావా" అంటూ జయంత్ రావటంతో ఈ లోకంలోకొచ్చి పడ్డాడు.

"సినిమా కెళ్దామా బావా?" అడిగాడు జయంత్.

''మీ నాన్నేమంటారో మరి"

"కాలేజీ స్టూడెంటువి. అలా భయపడిపోతావేం బావా. సినిమాకెళ్ళటం తప్పా? చదువుతోబాటు వినోదం కావొద్దా?"

"ఏ సినిమాకిరా పెదబాబూ?" అన్నపూర్ణ అడిగింది లోపల్నుంచే.

"ఇంకా ఏం నిర్ణయించుకోలేదమ్మా. అసలింతకీ బావ వస్తాడో రాడోమరి. ఏం బావా?"

"వెళదాంలే"

"హమ్మయ్య! ఎంత సేపటికి బావగారి నోటినుండి ముత్యం వూడిపడిందీ" నవ్వేడు జయంత్.

రవి అవమానంగా ఫీలయ్యాడా నవ్వుకి.

''సినిమాకెళ్తే వెళ్ళేవు గానీ సిగరెట్లు కాల్చకండేం. పెదబాబు కాలుద్దామన్నా పువ్వొప్పుకోకు రవీ" మేనత్త అంది.

''అలాగే అత్తా'' అన్నాడు రవి ఆశ్చర్యపోతూనే.

కామేశ్వరీ, గోపీ కూడా వస్తామనడంతో జయంత్ విసుక్కున్నాడు. వాళ్ళు బుంగమూతి పెట్టడంతో మరోసారి తీసుకెళ్తానని రవి సర్దిచెప్పేడు.

టైమవుతోందని జయంత్ తొందర పెట్టడంతో గబగబా తెమిలి అతడి వెంట బయటికి నడిచాడు.

దార్లో జయంత్ స్నేహితుడు ఒకడు ''హాయ్...జయంత్'' అని పలకరించాడు. జయంత్‌లానే అతడిదీ హిప్పీక్రాపు. చొక్కా బొత్తాములు పెట్టుకోలేదు. మాట, కదలిక, చూపు కూడా నిర్లక్ష్యంగా వున్నాయి.

''హాయ్ కేపీ... పిక్చర్‌కొస్తావా?''

"ఏ పిక్చర్?"

"కేడీ నెంబర్ ఒన్"

''ఇప్పటికి మూడుసార్లు చూశాను''

''నే నూ మూడోసారి చూడబోతున్నాను"

''లెక్కలు హోమ్‌వర్క్ పూర్తి చేశావా? రేపే చూపించాలిగా"

"నేనా? చేయటమా ? మన పిలక పంతులు తలకిందుగా తపస్సుచేసినా ఆ పని నా వల్ల కాదు''

"మనమూ డిటోయేననుకో. కానీ హోమ్‌వర్క్ చెయ్యకపోతే క్లాసుకిరానివ్వనని వార్నింగిచ్చాడుగా ముసలి పీసుగు"

''వాడబ్బ సొమ్మేవిటి రానివ్వక పోవడానికి. ఫీజు కడుతున్నాం, వెళ్తాం... అంతే''

"ఏమనడంటావా?"

"ఏదో మొరుగుతాళ్ళే తిన్నగా వుండ్లేక. ఆడపిల్లల ముందు పోజు కొట్టాలని ఆ ముసలాడికి వుబలాటం"

''సరే వస్తాన్నా...బైబై"

''గుడ్ బై"

తనెరగని మరోలోకపు జీవుల్ని చూసినట్టు చూస్తూండిపోయాడు రవి అంతసేపూ.

తొమ్మిదో తరగతి చదువుతోన్న వాళ్ళు లెక్కల మాస్టారి గురించి అలా నిర్లక్ష్యంగా, నిర్లజ్జగా మాట్లాడుతోంటే వీళ్ళెందుకిలా తయారయ్యారో అర్థం కాలేదు రవికి.

సినిమాహాలు సమీపించగానే "బావా! కిళ్ళీ వేసుకుందాం" అన్నాడు జయంత్ హుషారుగా.





"వద్దొద్దు"

"సిగరెట్టు కూడా వద్దా!"

"వూహూ....నువ్వూ తాగొద్దు. మీ అమ్మ మరీ మరీ చెప్పింది కదా"

"అమ్మ లేదో చెప్పేరని నువ్వ అమ్మమ్మ కబుర్లు చెబుతావేంటి. ఎవరైనా చూస్తారని భయమా?" హేళనగా నవ్వుతూ అడిగాడు జయంత్.

"నాకిష్టం లేదు" ఎర్రబడ్డ మొహంతో అన్నాడు.

'నువ్వేం కాలేజీ స్టూడెంటువి' అన్నట్టు నిరసనగా చూసి వెళ్ళి కిళ్ళీ, సిగరెట్లూ తెచ్చుకున్నాడతడు.

అయిదు రూపాయల నోటిచ్చాడు రవి టిక్కెట్లు తీయమని. అతడెళ్ళి రెండు కుర్చీ టిక్కెట్లు తెచ్చాడు.

రవి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్. ఏ బెంచీ టిక్కెట్లో తెస్తాడనుకున్నాడు గాని తమ స్థాయినిమించి తెస్తాడని వూహించ లేదు. వెధవ సినిమా కోసం అయిదు రూపాయలు ఖర్చయిందన్న వూహ అతడి గుండెల్ని నలిపేసింది.

ఒంటిమీద సరైన బట్టకూడా లేకుండా పొలాల్లో పనిచేసే తండ్రి గుర్తొచ్చాడు....

కూరనారలకి డబ్బుల్లేక పచ్చళ్ళతో, చారునీళ్ళతో పిల్లలకి అన్నం వడ్డించలేక వడ్డించే తల్లి గుర్తొచ్చింది...

"ఇది తప్పుకాదు..నేరం!" గొణుక్కున్నాడు రవి.

అన్యమనస్కంగానే హాల్లోకి నడిచాడు.

న్యూస్‌రీల్ మొదలైంది. మరో సిగరెట్టు వెలిగించాడు జయంత్.

"సిగరెట్లు కాలిస్తే ఆరోగ్యం పాడవుతుంది జయంత్.మంచి అలవాట్లతో వృద్ధిలోకి రావాల్సిన మనమిలా దురలవాట్లు నేర్చుతుంటే ఎలా చెప్పు?" వుండబట్టలేక అన్నాడు.

"సిగరెట్లు కాలిస్తేనే కాదు – సినిమా కొచ్చినా ఆరోగ్యం చెడుతుంది. అసలు టౌన్లో వుండటమే అనారోగ్యకరం. ఆరోగ్యం చెడకూడదనుకుంటే మడిగట్టుకుని బుద్ధభగవానుళ్ళా పల్లెటూళ్ళో పడి వుండటం మంచిది"

అతడి మాటలు వాడి ఈటెల్లా వచ్చి సూటిగా తగిలాయి రవికి.

బాధగా జాలిగా చూస్తూండిపోయా డతడి వంక. అదేమీ పట్టించుకోని జయంత్ స్టైయిల్‌గా సిగరెట్టు కాలుస్తూ ముందు కూర్చున్న అమ్మాయికి పోజు కొట్ట సాగాడు.

* * *

హాస్టల్లో చేరగోరువారు పదిరోజుల్లో దరఖాస్తు చేయవలెనని నోటీసు అంటించారు బోర్డుకి.

వెంటనే అప్లికేషన్ తీసుకుని ఆదాయాన్నిబట్టి సీటిస్తారని తెలీడంతో అలాగే ఆదాయం చూపిస్తూ ఫారం నింపాడు రవి.

జువాలజీ హెడ్డాఫ్ ది డిపార్ట్‌మెంట్ సుందర్రావుగారు హాస్టల్ వార్డెన్. ఆయన్ని కలుసుకుంటే మంచిదని ఆయనింటికెళ్ళి అప్లికేషన్ ఇచ్చాడు.

అది తిరగేసి "క్లర్కుకివ్వు" అన్నారాయన – అతడి కులం గురించీ, గ్రామం గురించీ, ఆస్తిపాస్తుల గురించీ అడిగి తెలుసుకున్నాక.

"మీరెలాగైనా సీటిప్పించాల్సార్. లేకపోతే నా చదువు అన్యాయమై పోతుందండి" కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు రవి.

"చూడు మిస్టర్! రూల్స్ ప్రకారం

నీ కర్తవ్యత వుంటే తప్పకుండా ఇస్తాం. వాటిని తోసిరాజని నీకంటే హీనస్థితిలో వున్నవాడికి అన్యాయం చెయ్యం"

మరి మాట్లాడలేకపోయాడు రవి. ఆయన గురించి తను విన్నదానికీ,ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నదానికీ ఎక్కడా పొంతనలేదు. అంతా ఆయన పచ్చగడ్డే కాదు ఎండుగడ్డి కూడా మేసేస్తాడని చెప్పేరు. కానీ ఈయన ధోరణి చూస్తోంటే పరమ స్ట్రిక్టులా వున్నాడు. అయినా ఆశ చావక మళ్ళీ అభ్యర్థించాడు.

"నువ్వింన్ని సార్లడగక్కర్లేదు.అర్హత ప్రకారం నీకు రావల్సుండి రాకపోతే అడగాలి గానీ ఇలా దొడ్డి దారిని ఇమ్మనడం మంచిదికాదు. నీతికీ నిజాయితీకీ ముందు నిలబడి దేశాన్నుద్ధరించాల్సిన యువత ఇలా పతనమవ్వడం వల్లే దేశం అధోగతిపాలవుతోంది" అంటూనే కుర్చీలోంచి లేచారాయన. వస్తానని చెప్పి కాళ్ళీడ్చుకుంటూ వచ్చేశాడు రవి.

మర్నాడు హాస్టల్ గుమస్తా దగ్గరి కెళ్ళాడు. హాస్టల్‌కు ఆఫీసు రూమంటూ లేకపోవడంతో జువాలజీలాబ్‌లోనే ఓ పక్కన టేబులూ, కుర్చీ, బీరువాలతో గుమస్తా కాలక్షేపం చేస్తూంటాడు.

అతడికి అప్లికేషన్ ఇచ్చి "నాకు హాస్టల్లో సీటొచ్చేట్లు చూడండి" అన్నాడు దీనంగా.

అతడు తలూపి తన పన్లో పడ్డాడు.

కాస్సేపు నిరీక్షించినా అతడేమీ అనక పోయేసరికి వస్తానని చెప్పి వచ్చేశాడు.

లేబ్ మెట్లు దిగుతోంటే ఎదురైన కుర్రాడు "హాస్టల్ సీటుకి అప్లైచేశారా?" అనడిగాడు. అతడప్పుడప్పుడూ తన క్లాసులోని ఒకబ్బాయికోసం వస్తూండటంతో కాస్తంత ముఖపరిచయం వుంది.

"అవునండీ"

"అగ్గిపెట్టేమైనా ఇచ్చారా?"

"అగ్గిపెట్టె ఇవ్వడమేమిటండీ?"

నవ్వేడతడు. "అగ్గిపెట్టె అంటే ఆమ్యామ్యాకి మరో పేరు"

"ఇక్కడ కూడా లంచమాండీ?"

"ఆ మాటకొస్తే లంచాలే కాదు—ప్రభుత్వసొమ్ము మెక్కడంకూడా ఇక్కడే ఎక్కువ"

"ఎంతిచ్చుకుంటారండీ?" వణకుతోన్న కంఠంతో అడిగాడు.

"ఇచ్చేవాళ్ళుంటే ఎంతైనా పుచ్చుకుంటాడుగాని ఓ యాభై చదివించుకోండి గుమస్తాకి"

"గుమస్తాకాండీ? మరి వార్డెన్‌గారికి చెప్పకపోతే సీటు..."

"ఎప్పుడోగాని దగా చెయ్యేళ్ళేండి. ఇద్దరికీ బాగా కుదిరింది"

"థాంక్సండీ"

క్లాసుకెళ్ళాడన్నమాటే గాని రవి మనస్సు పాఠం మీదలేదు.

తనకి యస్సెస్సీలో ఎక్కువ మార్కులొచ్చాయి, పైగా ఆర్థికంగా వెనుకబడ్డ తరగతికి చెందినవాడు గనుక తప్పకుండా హాస్టల్లో సీటు వస్తుందనుకున్నాడు. తను కుటుంబానికి పెద్దగా భారం కాననీ, చదువుకి ఆటంకం వుండదనీ అనుకున్నాడు. తీరాచూస్తే నిబంధనలకీ, నడవడికకీ సంబంధం వున్నట్టే కన్పించడంలేదు!

తనకి సీటొస్తుందా? రాదా??

రాకపోతే???

అవర్ అయ్యింది. పుస్తకాలు తీసుకునిలేచాడు రవి.

"వెళ్ళిపోతున్నావా?" విస్మయంగా




అడిగాడు స్వామి.

"కొంచెం తలపోటుగా వుంది" అన్చెప్పి వేగంగా అడుగులేసుకుంటూ ఇంటికెళ్ళాడు.

గబగబా పెట్టెలోని చిల్లరా,కాగితాలూ తీసి లెక్కపెట్టేడు. ఇరవైరెండ్రూపాయల చిల్లరుంది. అంటే ఇంకా ఇరవై ఎనిమిది రూపాయలు కావాలి.

ఎలా?

తండ్రి ఇచ్చిన డబ్బుతో ముఖ్యమైన పుస్తకాలూ నోట్సులూ కొన్నాడు. ఇంకా రికార్డు పుస్తకాలూ, డిసెక్షన్ బాక్సూ, గ్లౌజ్లూ కొనాలి. దానికి తోడిదోఖర్చు. ఇంటికెళ్తే మాత్రం సమయానికుంటుందో లేదో. తను రావడం ఆలస్యమైతే సీటు మరొకళ్ళు తన్నుకుపోవచ్చు.

మరేం ఆలోచించకుండా మేనత్త నడిగాడు.

ఓ క్షణం ఆలోచించి ''చూస్తానుండు'' అన్చెప్పి పొరుగింటికెళ్ళి తెచిచ్చింది.

తన గురించామెని ఇబ్బంది పెట్టి నందుకు బాధగా అన్పించినా మొత్తానికి డబ్బు సమకూడినందుకు సంతోషించాడు రవి.

తిన్నగా కాలేజీకెళ్ళి గుమస్తా చేతిలో డబ్బు పెట్టాడు.

అతడి పేరడిగిఅప్లికేషన్ మీద టిక్కు పెట్టి ఓ పక్కగా పెట్టేశతడు.

''తప్పకుండా సీటివ్వాలండీ'' అన్నాడు.

తలూపేడతడు నిర్వికారంగా.

థాంక్స్ చెప్పి బయటపడ్డాడు.

లంచ్ టైమ్ కావడంతో క్లాసు రూములన్నీ ఖాళీగావున్నాయి. ఇంటికెళ్ళి టిఫిన్ చేసి రావాలన్పించలేదు. హాస్టల్లో సీటు వస్తుందన్న ధీమాయే కడుపు నింపేసింది.

సాయంత్రం కాలేజీ అవ్వగానే స్వామిని ఓ పక్కకి తీసుకెళ్ళి హాస్టల్ గుమస్తా గురించి వివరించి "నువ్వు కూడా యాభై రూపాయలివ్వు స్వామీ, తప్పకుండా సీటిస్తాడు" అని చెప్పేడు రవి.

"ఆ సంగతి నేనూ విన్నాను. కాని నాకిష్టం లేదు"

"అదేమిటి స్వామీ... మరి సీటు రావొద్దూ?"

"సీటు ముఖ్యమే. కాని దాని గురించి అడ్డదార్లు తొక్కడం నాకిష్టంలేదు" దృఢంగా అన్నాడు స్వామి.

నివ్వెరపోయాడు రవి.

ఆశయం మంచిదైతే చాలదు దానిని సాధించే మార్గంకూడా మంచిదైవుండాలని గాంధీగారన్నారని ఎక్కడో చదివిన మాటలు గుర్తొచ్చాయతడికి.

స్వామి ఎంతో వున్నతుడిగా కన్పించాడు. "స్వామీ!'' అన్నాడు అభినందనగా.

"నియమ నిబంధనలను అనుసరించి హాస్టల్లో సీటివ్వాలి. అలా ఇవ్వకుండా అవినీతికి పాల్పడటం సర్వ సాధారణ మైపోయింది. ఇక హాస్టల్ నిర్వహణ పూర్తిగా అవినీతిమయం అయిపోయింది. వార్డెన్‌గారికి కొందరు పెద్దలు రక్షా కవచంలా పనిచేస్తున్నందున తనకి అడ్డే లేదన్నట్టు ప్రవర్తిస్తున్నారాయన. నువ్వూ, నేనూ, మన్లాటి విద్యార్థులూ అంతా సంఘటితమైతే ఆ అవినీతికి తెరదించి నీతికి ప్రాణప్రతిష్ఠ చెయ్యడం తేలికైనపనే!"

అతడి కళ్ళల్లో మెరిసిన మెరుపులు రవిని విస్మితుణ్ని చేశాయి.

* * *

శివాలయం ముందున్న ఖాళీ స్థలంలో కొంతమంది యువకులూ, చిన్నపిల్లలూ

కూడా కవాతు చేస్తున్నారు.

అంతా నిక్కర్లు, బనీన్లూ ధరించి సుశిక్షితుల్లా కవాతుచేస్తోంటే ఆసక్తిగా చూస్తూ నిలబడ్డాడు రవి.

"హలో" అతడి క్లాస్‌మేట్ పలకరించాడు.

"హలో"

"వాళ్ళెవరో తెలుసా?"

"వూహూ"

"ఆరెస్సెస్ సభ్యులు"

వాళ్ళ గురించీ, వాళ్ల కార్యకలాపాల గురించీ వినివుండని రవి అలాగాఅన్నట్లు తలూపాడు.

"రండి ... మీకోగొప్ప వ్యక్తిని పరిచయంచేస్తాను" అంటూ తీసుకెళ్ళి శేషగిరికి పరిచయం చేశాడతను.

అతడు డిగ్రీస్టూడెంటనీ, విద్యార్థి నాయకుడు కూడాననీ ఇదివరకే విన్న రవి సంతోషంతో చేతులు కలిపాడు.

"మీకు విద్యార్థిసంఘాలు అంటే కాలేజీ యూనియన్స్ గాక కొన్ని ప్రిన్సిపుల్స్‌గల ఇతర సమాజాలూ, సమాఖ్యల గురించి తెలుసా?" అన్నాడాయన.

తల అడ్డంగా వూపాడు రవి.

"కాలేజీ యూనియన్లు కాలేజీ విషయాలకే పరిమితం. కానీ సమాజాలూ అవీ బయటి విషయాల గురించి కూడా చర్చిస్తాయి; కృషిచేస్తాయి. సమాజంలో మన పాత్రేమిటో, మనం అనుసరించాల్సిన విధానమేమిటో ఎలా వుంటే మనదేశం అన్నిటా అమెరికాలా ముందంజవేస్తుందో, అలాగే మన దేశం, మన సంస్కృతి ఎంత గొప్పవో వివరిస్తుంది. మనల్ని జాగృతం చేసి సంఘటితపరచి సవ్యమార్గంలో నడిపిస్తుంది. అంటే మనల్ని బాధ్యతగల పౌరులుగా తీర్చిదిద్దుతుందన్నమాట"

రవికా విషయాలేం తెలీవు.

"వాటి గురించి మనమీ రోడ్డుమీద చర్చిస్తే బావుండదు. ప్రభాకరంగారింట్లో ఈ రాత్రి ఎనిమిదింటికి సమావేశమవుతున్నాం. మీరు తప్పకుండా రావాలి. మీరేంభయపడొద్దు.మనం స్వదేశాభిమానం గల వాళ్ళమేగాని విదేశీ తొత్తులం కాదు. మన కాలేజీలో సగంమంది వరకూ మా సమాజంవాళ్ళే. అంతా ఇవాళొస్తారు కూడా. మీరూ రండి. రావడమే కాదు మన వాళ్ళెవరైనా వుంటే వాళ్ళందర్నీ కూడా తీసుకురావాలి"

అతడి మాటలు కాస్త గందరగోళంగా అన్పించినా తన అంగీకారం తెలిపాడు రవి.

ఒంటిగా వుంటే ఏమీ చేయలేక పోవచ్చుగాని సంఘటితమైతే ఏమైనా సాధించొచ్చు. పైగా ఎన్నో పరిచయాలూ కలుగుతాయి. ఎన్నెన్నో విషయాలు అనుభవంలో కొస్తాయి. సమస్యల పరిష్కార సాధనకి తనవంతు బాధ్యత నిర్వర్తించొచ్చు. రేపు తను డాక్టరై సరైన వైద్య సౌకర్యం వ్యాగ్యమైన మారుమూల పల్లెలో ప్రాక్టీసు ప్రారంభించినప్పుడు ఈ సంఘాలవీ ఎంతగానో వుపయోగిస్తాయ్, చేయూతనిస్తాయ్. అందుకే ఆ సమావేశానికెళ్ళాలనుకున్నాడతడు.

భోంచేసి బట్టలేసుకొంటూంటే అన్నపూర్ణ అడిగింది "ఎక్కడికి రవీ?"

"మీటింగుకి" గొప్పగా అన్నాడు.

విసుబోయిందామె.

"వస్తానత్తా" అన్చెప్పి బయటపడ్డాడు. అలావెళ్ళి ప్రభాకరంగారింటి ముందు ఆగిపోయాడు.





ఆ ఇంటిముందెవ్వరూ లేరు. లోపలా సందడి లేదు. అది ప్రభాకరంగారిల్లు కాదేమో అనుకోడానికి ఇంటిముందు వేలాడుతోన్న నేమ్ బోర్డు తీవ్రంగా అభ్యంతరపెడుతోంది.

బహుశా సమావేశం కేన్సిల్ చేశారేమో అన్న అనుమానం కలిగింది. కాస్సేపు ఊగిసలాడి ధైర్యంచేసి లోపలికెళ్ళాడు. ఓ గదిలో అయిదారుగురు విద్యార్థులు కన్పించారు. వారిలో శేషగిరీ వున్నాడు. రవిని చూడగానే ఆహ్వానించి మిగతా వాళ్ళకి పరిచయంచేశాడు.

మరో అరగంటకి ఇరవైమంది వరకూ పోగయ్యారు. సమావేశం ప్రారంభమయ్యింది. ప్రభాకరంగారు అధ్యక్షత వహించారు.

దైవప్రార్థన అయ్యాక శేషగిరి మాట్లాడాడు.

"ఇప్పుడీ సమావేశానికి కొందరు కొత్త మిత్రులు కూడా వచ్చారు గనుక మన సమాజం గురించీ, దాని ఆశయాల గురించీ ఇవాళ మాట్లాడుకుందాం. మన సంఘం దేశమంతా వ్యాపించివున్న మహోత్తమ సమాజం. దీన్ని మనం అన్ని విద్యా సంస్థల్లోనూ ఏకైక సంఘంగా తీర్చిదిద్దుకోవాలి. అందుకోసం మనమీవాళ ప్రతిజ్ఞ చేయాల్సివుంది. మన గౌరవాధ్యక్షులైన ప్రభాకరంగార్ని గురించి నేను ప్రత్యేకంగా ఏమీ చెప్పనక్కర్లేదు. ఈ వూళ్ళో ఆయన గురించి తెలీని పసిపాప కూడా వుండదు. ఆయన ప్రఖ్యాత రాజకీయ వేత్త. స్వంత లాభం కొంత మానుకుని హిందూ మతోద్ధరణకీ, ధర్మరాజ్య స్థాపనకీ అకుంఠిత దీక్షతో కృషిచేస్తున్న

మహనీయులాయన. గత రెండు ఎన్నిక ల్లోనూ యమ్మెల్యే పదవికి పోటీచేసినా మన దురదృష్టంకొద్దీ ఓడిపోయారు. ఈసారి తప్పక ఎన్నికవుతారని ఆశిస్తున్నాను''

తర్వాత ప్రభాకరంగారు మాట్లాడారు.

మన సంస్కృతీ వైభవం గురించీ, హిందూమత ఔన్నత్యం గురించీ, భారతీయత గురించీ, ప్రాచీన పురాణాల్లో వేదాలలో గల గొప్ప విషయాల గురించీ, ఆ గొప్పని గ్రహించి ముందడుగువేస్తోన్న విదేశీయుల గురించీ ప్రసంగించారు. విద్యార్థులు దైవభక్తి నలవర్చుకోవాలనీ ఆసనాలు వేస్తూ ఆధ్యాత్మిక చింతన పెంచుకోవాలనీ, కర్ర సాములాంటివి నేర్చుకుని స్వయం సేవకులుగా రూపొందాలనీ, అఖండ భారతస్థాపనే ధ్యేయంగా కృషిచెయ్యాలనీ చెప్పేరు రక్తం తాగే కమ్యూనిష్టుల్నీ, రష్యా చేతిలో కీలుబొమ్మ అయిన ఇందిరా కాంగ్రెస్‌నీ ఎదుర్కోవాలని విజ్ఞప్తి చేశారు.

ఆయన వుపన్యాసం వింటోంటే రవికి అదోలా అనిపించింది.

దేశంలో ఎన్నో మతాలుండగా ఒక మతాన్నే అత్యుత్తమంగా వర్ణించి చెప్పడం, చాతుర్వర్ణ వ్యవస్థని సమర్థించి ప్రోత్సహించిన గ్రంథాలని గొప్పగా పొగడటం, తాము తప్ప మిగతావాళ్ళంతా దేశద్రోహులూ, విదేశీ తొత్తులూ అంటూ నిందించడం అతడికి మింగుడుపడలేదు.

సమావేశం అయిన వెంటనే ముందు బయటికొచ్చేసినవాడు రవే.

ఇంకెప్పుడూ అలాటి సంస్థల సమావేశాలకెళ్ళకూడదనుకుంటూ నడుస్తోంటే చీకటి సందులోంచి వినవచ్చిన మాటలకి మంత్రించినట్లు ఆగిపోయాడు.

"ఇదిగో ... ఇప్పుడే చెబుతున్నాం. రేపు క్లాసు పరీక్షల్లో మాకు చూపెట్టక పోయావో నీ బుర్ర చేత రేపు రాత్రి రామ కీర్తన పాడిస్తాం జాగ్రత్త!''

సందేహంలేదు. అవి జయంత్ మాటలే.

గబుక్కున అటు వెళ్ళాడు.

జయంతూ, మరో కుర్రాడూ ఒక పొట్టి కుర్రాడి కాలర్ పట్టుకుని ఉన్నారు. వారి చేతుల్లో చిన్న చాకు కూడా వుంది. ఆ పొట్టి కుర్రాడు వణకిపోతూ సన్నగా ఏడుస్తున్నాడు.

ఇక సహించలేక ''జయంత్'' అని పిలిచాడు గట్టిగా రవి.

వులిక్కిపడి రవిని చూశారు వాళ్ళు.

''జాగ్రత్త. రేపు క్లాసులో చూపక పోయావో రేపు సాయంత్రం ఇక్కడే నీ పని పడతాం" గొంతు తగ్గించి హెచ్చరించి వదిలేశారు.

మొన్నటి సినిమాలో సరిగ్గా ఇటువంటి సన్నివేశమే చూసినట్లు గుర్తొచ్చింది రవికి. అందులో ఒకతనిలా బెదిరించే అన్ని పరీక్షలూ కాపీకొట్టి పాసవుతాడు. అంటే జయంత్ ఆ సినిమా చూసే....

ఆ సినిమా తీసినవాళ్ళమీదా, అందులోని ఆ ముక్కే గ్రహించిన జయంత్ మీదా కోపంవచ్చింది. 'అయ్యో' అని మూలిగిందతడి హృదయం.

"నువ్వా బావా... ఇలా వచ్చావేం? ఈ వీధంత మంచిది కాదు బావా. ఇక్కడంతా రౌడీ వెధవలు. త్వరగా నడు. నేనున్నాను గనుక ఫరవాలేదనుకో...'' ఏమీ ఎరగనట్టు చెప్పుకుపోతున్న వాడి మీద కోపం పెరిగింది రవికి.

'పండిత పుత్ర పరమ శుంఠ' అన్నట్లు వుత్తమ వుపాధ్యాయుడైన

మావయ్యకి ఇటువంటి సుపుత్రుడా? 'సుపుత్రా కొంపపీకరా' అన్నది నిజం చెయ్యడానికే ఉన్నట్లున్నాడు వీడు.

దీనికి కారణం ఎవరు?

ఇంట్లో బాగానే శ్రద్ధ తీసుకుంటారు మరి. వెధవ్వేషాలెయ్యనివ్వరు. అయినా ఇంట్లో బుద్ధిమంతుళ్ళా వుంటూ బయట ఇలా రౌడీలా తిరుగుతున్నాడంటే దానికి కారణం - బయటి పరిస్థితుల్లోని విష ప్రభావమా?

ఏమైనాసరే వాడి గురించి ఇంట్లో చెప్పేసి వాడు మరింతగా చెడిపోకుండా జులాయి లక్షణాలు మొగ్గలోనే తుంచెయ్యాలని దారి పొడవునా అనుకున్నాడు రవి. తీరా మేనత్త అమాయక మొఖం చూసేసరికి పెదవి విడివడలేదు.



2

నోటీసు బోర్డుముందు విద్యార్థులు గుమిగూడి వుండటంతో ఆత్రంగా అటు నడిచాడు రవి.

హాస్టల్లో సీటొచ్చినవారి లిస్ట్ పెట్టారు.

అదురుతోన్న గుండెల్తో చూశాడు. తన పేరుంది. మళ్ళీ మళ్ళీ చూశాడు. నిజంగానే తన పేరుంది. అతడి గుండెలు ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాయి. మొఖంలో వెర్రి సంబరం చోటుచేసుకుంది.

స్వామి గుర్తొచ్చి అతడి పేరు కోసం వెదికాడు.

అతడి మొఖం సల్లబడింది. స్వామి పేర్లేదు.

ఆనందశిఖరాగ్రం నుంచి విషాదపు అగాథంలోకి పడిపోయినట్లు విలవిల్లాడాడు.

ప్రపంచంలోని ప్రతిదీ - విద్యగాని, ఆరోగ్యంగాని, సుఖంగాని, వుద్యోగం గాని, వ్యాపారంగాని, అనుబంధంగాని ఆత్మీయతగాని అన్నీ డబ్బుతో ముడిపడి వున్నాయి. విడదీయలేనంతగా పెనవేసుకుపోయాయి. అసలీ రూపాయి బిళ్ళ అంచు మీద ప్రపంచం నడుస్తోంది! భూమి డబ్బున్నవాళ్ళ చుట్టూ తిరుగుతోంది.

క్లాసువైపు భారంగా అడుగులేశాడు.

"కంగ్రాచ్యులేషన్స్" స్వామి అన్నాడు.

"దేనికి?"

"హాస్టల్లో సీటొచ్చినందుకు"

"నీకు బాధగా లేదా?"

"బాధెందుకు? వస్తుందని ఎదురుచూస్తే గదా రాలేదని బాధపట్టానికి. ఈ హాస్టల్ వ్యవహారం గురించీ, వార్డెన్ గురించీ నాకు బాగా తెలుసు. అందుకే ఆశ పెట్టుకోలేదు"

"మరిప్పుడెలా?"

"ఓపికున్నంత వరకూ బండిని లాగటమే"

రవి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లడం చూసి "బ్రేవో మైడియర్ రవీ" అన్నాడు వీపు తడుతూ.

"అన్నట్టు మొన్న సమాజంవాళ్ళ మీటింగుకెళ్ళేవుట కదా" తిరిగి స్వామే అన్నాడు.

"అవునవును.. వెళ్ళడమూ అయ్యింది లెంపలేసుకోవడమూ అయ్యింది"

"ఏం?"

అక్కడి వుపన్యాసాల ధోరణీ,

ఆయావిషయాల్లో తన అభిప్రాయాలూ నిర్మొహమాటంగా చెప్పేడు రవి.

"గుడ్ ... అభ్యుదయ భావాలూ, శాస్త్రీయ దృక్పథమూగల విద్యార్థి సంఘం వేరే ఉంది. వారి మీటింగుంది వచ్చే వారంలో. నువ్వు కూడారా. నీ అభిప్రాయాలకి మరింత బలం చేకూరుతుందని హామీ ఇస్తున్నాను"

"అయితే తప్పక వస్తాను"

"జార్జిరెడ్డిని ఎరుగుదువనుకుంటాను"

"చూశాను కాని అతడి గురించేం విన్లేదు"

"మంచివాడూ, ఇంటెలిజెంటూనూ. సెకండ్ బియస్సీ చదువుతున్నాడు యూనివర్శిటీ ఫస్టో సెకండో రావొచ్చంటున్నారు. యస్సెస్సీలో టాప్ టెన్‌లో ఒకడు"

"అయితే....?"

"అతడే ఆ సంఘం జిల్లా శాఖకి ప్రెసిడెంటు"

"అటువంటివారిని కలుసుకోవడం, వారితో కలిసి పనిచెయ్యడం హాయిగానే ఉంటుంది"

ఇంతలో కెమిస్ట్రీ లెక్చరర్ జగన్ మోహన్‌గారు రావడంతో వారిసంభాషణకి అంతరాయం కలిగింది.

జగన్‌మోహన్‌గారి క్లాసంటే అందరికీ ఇష్టమే. ఆయన సరిగ్గా క్లాసులకి రారనీ, పాఠాలు సరిగ్గా చెప్పరనీ సీనియర్ స్టూడెంట్లు ఎందుకంటారో బొత్తిగా అర్థంగాక ఇదవుతుంటారు కూడా.

ఆయన దగ్గర మంచి సబ్జక్టు వుండటమే కాదు ప్రతి విద్యార్థికీ తేలిగ్గా అర్థం అయ్యేలా చెప్పగల పాండిత్యం కూడా వుంది. మధ్య మధ్య జోక్స్ వేస్తూ బోర్ అన్న మాటని దరిజేరనివ్వరు.

పాఠం వింటూ నోట్సు రాసుకున్నారు రవీ, స్వామి.

బెల్ మోగేసరికి అప్పుడే అవరై పోయిందా అని ఆశ్చర్యపడ్డారంతా.

కెమిస్ట్రీ ప్రాక్టికల్స్ కోసం లేబ్ కెళ్ళేరుగాని గ్యాస్ లేదు ఇవాళ ప్రాక్టికల్స్ కేన్సిలనడంతో వెనుదిరిగారిద్దరూ.

ఆ లేబ్‌లో అటెండరుగా పనిచేసే మస్తాన్ వాళ్ళవెనకే వచ్చి మాటలు కలిపాడు.

"మీ క్లాసులోని ప్రకాశరావు రావట్లేదేం" అనడిగాడతడు.

"ఏమో..తెలీదు" రవి జవాబిచ్చాడు.

"చాలా మంచాయన. మాకు కాఫీకి డబ్బులిస్తూంటాడు"

ఇద్దరూ విని వూరుకున్నారు.

"కాఫీ తాగుతాను. డబ్బులివ్వండి సారూ" అన్నాడు నవ్వుతూ.

విస్తుబోయిన రవి తేరుకుంటూ "మా దగ్గరేం లేవయ్యా" అన్నాడో లేదో గిరుక్కున వెనుదిరిగెళ్ళిపోయాడతడు.

"వాళ్ళంతేలే" అన్నాడు స్వామి.

"మనల్నడగటం ఏవిటి?"

"ప్రాక్టికల్స్‌లో వాళ్ళ సాయం కావల్సొస్తూంటుందిగా.దాన్నిలా కేష్ చేసుకుంటూంటారు"

రవి గుండెల మారుమూల గదుల్లో భయం చిన్నగా ఆవులించింది.

తను డబ్బులివ్వలేదని అతడు ప్రాక్టికల్స్‌లో సాయం చెయకపోతే? తను ప్రాక్టికల్స్ సరిగ్గా నేర్చుకోలేకపోతే? పరీక్షల్లో మార్కులెక్కువ రాకపోతే? మెడిసిన్లో సీటు...

'ఛా...ఇదేం ఆలోచన' అని వాటిని




తోసిపుచ్చేశాడు గాని అవతణ్ని తేలిగ్గా వదల్లేదు.

ఆమర్నాడు హాస్టల్లో ప్రవేశించడానిగ్గాను సామానంతా రవి సర్దేసుకొంటోంటే దిగులుగా చూశారు ఇంటిల్లిపాదీ.

"మేమంతా వుండగా దిక్కులేనట్లు ఎక్కడో వుండటం ఏం బావోలేదయ్యా" అంది మేనత్త.

భవానీ, కామేశ్వరిల కళ్ళల్లోని నీళ్ళు చూడటం ఇష్టంలేక మొఖం తిప్పేసుకున్నాడు రవి. గోపి "నువ్వెళ్ళొద్దు బావా" అంటూ చేతులు పట్టుకున్నాడు.

"తప్పు గోపీ! నేన స్తమానూ వస్తూంటానుగా. వూరుకోమరి''

"రోజూ రావాలి'' అన్నాడు గోపి.

"ఓ...తప్పకుండా"

''హాస్టల్లో వుంటే వున్నావుగాని ప్రతి ఆదివారం వస్తూండు రవీ" రిక్షా ఎక్కుతోంటే అన్నారు కుటుంబరావు గారు.

అలాగే అన్చెప్పి భవానికీ,కామేశ్వరికీ కళ్ళతోనే వీడ్కోలు చెప్పేడు. వాళ్ళ మొఖాలు కలువల్లా వికసించేయి.

సామానుతో హాస్టల్ రూమ్‌లో ప్రవేశించాడు రవి.

కొత్త ప్రదేశం...కొత్త వాతావరణం.. కొత్త స్నేహితులు...

అందుకో పక్కన సంతోషంగా వున్నా మరోపక్క బెరుగ్గా కూడా వుంది-ఎవరెటువంటివారో, ఏ పుట్టలో ఏముందోనని.

రూము ఒక మోస్తరుగా వుంది. అందులో మూడు మంచాలు పట్టేట్టులేవు గాని ముగ్గురుండాల్ట. వారిలో ఏ ఒక్కడు పైకి చదివినా మిగిలినవారి చదువు గోవింద!

రవికన్నా ముందే ప్రవేశించిన ఇద్దరికీ అతణ్ని పరిచయం చేసి వెళ్ళిపోయాడు హాస్టల్ గుమస్తా.

వారిలో ఒకరు అనంతం. పొట్టిగా వుంటాడు. షోడాసీసా అడుగుభాగాన్ని తగిలించుకున్నాడా అన్నట్టుంటాయి కళ్ళద్దాలు. అతడికి చదువుతప్ప వేరే ధ్యాసలేదు. పలకరిస్తే పలకడం, ప్రశ్నిస్తే జవాబివ్వడం తప్ప ఇంకొక మాట కూడా అదనంగా మాట్లాడడు. ఫైనల్ బియస్సీ చదువుతున్నాడు.

ఇంకో అతను ప్రకాష్. పొడుగ్గా కాస్త నల్లగా బలంగా వుంటాడు. సరదా మనిషి. ఫస్ట్ బి.ఏ చదువుతున్నాడు. సంగీతంలో ప్రవేశముంది. చాలా వాయిద్యాలు వాయించగలడు. పిల్లనగ్రోవిని మరీ బాగా పలికించగలడు.

రవితో మాటలు కలిపి నవ్వించి అతడి కొత్తదనం పోగొట్టాడు ప్రకాష్. రెండు గంటల్లోనే ఇద్దరూ బాగా కలిసిపోయారు.

చీకటిపడ్డాక ఏడు గంటల ప్రాంతాన కాలేజీ కేంటిన్‌కి వెళ్ళారు. హాస్టల్ విద్యార్థులకందరికీ అక్కడే భోజనం ఏర్పాటు చేశారు. రవికి భోజనం బాగానే వుందనిపించిందికాని ప్రకాష్ మాత్రం "వట్టి చెత్త!" అని విసుక్కున్నాడు. గత ఏడాది నుండి ఆ తిండి తింటున్నాడు మరి!

భోజనమయ్యాక రూమ్‌కొచ్చి కాస్సేపు హస్కేసుకున్నారు.

సినిమాకెళదామని ప్రతిపాదించాడు ప్రకాష్. అనంతం రానన్నాడు. రవి కాదన్లేక సరేనన్నాడు.

అదో క్రైమ్ థ్రిల్లర్. సెక్సూ,స్టంటూ, ద్వ్యాయెర్థపేరిట సాముగరిడీలూనూ. దానికి తోడు వెకిలి హాస్యం.

ఓరోజు రాత్రి జయంత్ చీకటి

సందులో ఓ కుర్రాణ్ణి బెదిరించడం గుర్తొచ్చింది రవికి.

ఇలాంటి సినిమాలే పిల్లలో నేర ప్రవృత్తి, అజ్ఞానం, జులాయితనం, వ్యభిచారం కలిగించి ప్రోత్సహించి వారిని పెడదోవ పట్టిస్తున్నాయనిపించింది.

అలాంటి సినిమాలు ఇక చస్తేచూడ కూడదనుకున్నాడు రవి. అప్పటిగ్గాని అతడి ఆత్మ ఘోష సద్దుమణగలేదు.

*        *        *

విద్యార్థిసంఘ సమావేశానికి రమ్మని స్వామితోబాటు ప్రకాష్ కూడా ఆహ్వానించాడు రవిని. అతడు కూడా ఆ సంఘ సభ్యుడేనట.

లాయర్ సత్యంగారింట్లో ఏర్పాటైన సమావేశానికి వెళ్ళారంతా. అప్పటికే చాలామంది వచ్చి వున్నారు. వారిలో హాస్టల్ స్టూడెంట్స్ కూడా హెచ్చు సంఖ్యలోనే వున్నారు. వార్డెన్ సుందర్రావుగారికి సంఘమంటే సింహ స్వప్నం. ఇందులో చేరొద్దని కట్టడి చేస్తూంటారు కూడా. అయినా అందరొచ్చినందుకెంతో ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగాయి రవికి.

స్వామి రవిని జార్జికి పరిచయం చేశాడు. చిరునవ్వుతో కరచాలనం చేశాడతడు.

అతడిలో ఓ ప్రత్యేకత గోచరించింది రవికి. సన్నగా పొడుగ్గా, నల్లని ఫ్రేము గల చతురస్రపు కళ్ళజోడుతో, తెల్లని లాల్చీ పైజమాలతో, చిన్న గెడ్డంతో వున్న అతణ్ణి, అతడి మొఖంలోని ఒక రకమైన కాంతినీ, ఆకర్షణశక్తినీ చూసి విస్మితుడయాడు.

సమావేశానికి పదిమంది వరకూ ఆడవాళ్ళొచ్చారు. వారిచొరవ చూసి కించిత్తు విస్తుబోయాడతడు.

అంతమంది విద్యార్థులమధ్య సరదాగా కలిసిపోవడం ఒక గొప్ప అనుభవమే కాదు ఆనందకరం, వుత్సాహకరంకూడా అనిపించిందతడికి. అసలు సంఘటితత్వంలోనే ఆ లక్షణం వుంది. అందుకే పిక్నిక్కుల్లో పాల్గొన్నా, వూరేగింపులో పాల్గొన్నా అంత వుత్సాహం, వుత్తేజం కలుగుతుంటాయి.

సమావేశం ప్రారంభమయ్యింది.

లాయర్ సత్యంగారు అధ్యక్షత వహించారు. అతిథిగా విజయవాడ నుంచి రాష్ట్ర సంఘాధ్యక్షుడు రవీంద్ర గారొచ్చారు.

జార్జి పరిచయవాక్యాలు చెప్పి విద్యార్థి సమస్యల గురించి మాట్లాడమన్నాడు.

ముందు స్వామి లేచాడు. కాస్త ఆవేశంగానే ప్రసంగం ప్రారంభించాడు.

"మన కాలేజీ హాస్టల్ని చూస్తోంటే అది హాస్టలా లేక వ్యాపార సంస్థా అనిపిస్తోంది. అందులో సీటు కావాలన్నా, మంచి రూము కావాలన్నా, కోరిన రూమ్మేటు కావాలన్నా-ఏం కావాలన్నా లంచం ఇవ్వాల్సిందే. ఇక అధ్వాన్నంగా వుండే ఆ గదుల్లో ముగ్గురూ నలుగురూ చొప్పున వుండాలి. కేంటీన్లో పెట్టే పందులకి వేసే తిండిలాంటి తిండి గురించి ఇక్కడున్న చాలామందికి తెలిసినసంగతే. ఇక వార్డెన్‌గారికి, ప్రిన్సిపాల్‌గారికి కులమతాభిమానం హెచ్చన్నది బహిరంగ రహస్యం. వాళ్ళాడని నాటకం, వెయ్యనివేషం లేదు. హాస్టల్లో ఎలక్షన్ పద్ధతి తీసేసి తమకిష్టమైనవారిని హాస్టల్ స్టూడెంట్స్ ప్రెసిడెంటుగా నామినేట్ చెయ్యడంతో మొదలవుతుంది వారి నాటకం. ఆ రబ్బర్

స్టాంప్ ! ప్రెసిడెంటుతో వాళ్ళు చేసే దోపిడి అంతా ఇంతాకాదు, కనుక మన సంఘం ఈ వ్యవహారాల గురించి గట్టిగా కలగ జేసుకుంటుందని ఆశిస్తున్నాను..."

చప్పట్లు కొట్టారంతా.

అనంతరం మాట్లాడటానికి ఓ అమ్మాయి లేచేసరికి రవి ఆశ్చర్యానికి అవధుల్లేకపోయాయ్.

"క్రితం సంవత్సరం వరకూ కాలేజీలో స్టాఫ్ రూమ్‌కోపక్క తడికకట్టి అదే లేడీస్ వెయిటింగ్ రూమన్నారు. కాని మన సంఘం పూనుకునేసరికి మాకో వెయిటింగ్ రూమూ, టాయ్‌లెట్ రూమూ ఏర్పాటుచేశారు. అందుకు విద్యార్థినులు కృతజ్ఞులే. పోతే కొందరు విద్యార్థుల ప్రవర్తన గురించి చెప్పడానికి సిగ్గుపడు తున్నాను. తోటి విద్యార్థినుల్ని అక్క చెల్లెళ్ళుగా భావించి కలిసి చదువుకొని, కలిసి తమనెదుర్కొంటోన్న అనేక సమస్యల్ని ఛేదించడానికి బదులు వెకిలి చేష్టలకీ, అసభ్య చేష్టలకీ, అశ్లీల కామెంట్స్‌కీ దిగుతున్నారంటే యువతరం పక్కదార్లు తొక్కుతోందని అనుకో వాల్సివస్తోంది. ఇది మన సంఘసభ్యుల్ని దృష్టిలో పెట్టుకుననడంలేదు. వారి క్రమ శిక్షణ గురించి మనకందరికీ తెలుసు. మన సంఘ సభ్యులు కానివాళ్ళు చాలా మందున్నారు. వారిలో నేనిందాక చెప్పిన వాళ్ళున్నారు. వాళ్ళని అమాయకులనండీ, అజ్ఞానులనండీ, ఏమైనా అనండీ కాని వాళ్ళందర్నీ మార్చి వారి బాధ్యతల్ని గుర్తుచేసి కార్యోన్ముఖుల్ని చెయ్యాల్సిన బాధ్యత మనమీదుంది. అలాగే ఈమధ్య అభివృద్ధి నిరోధక, స్వార్థ మతరాజకీయాల వెపు కొందరైనా ఆకర్షింపబడి దిగజారి పోతున్నారంటే ఈ విషయాల్ని మనం



చాలా సీరియస్‌గా తీసుకోవాల్సి వుంటుంది. అందుకోసం మన సంఘం తన కార్యక్రమాలని మరింత విస్తృతం చేసి విద్యార్థుల్లో వేస్తోన్న వెర్రితలల్ని నిర్మూలించి శాస్త్రీయ దృక్పథం కలిగిస్తుందని ఆశిస్తున్నాను."

ఆమె వుపన్యాసమూ, వుపన్యాస ధోరణీ కూడా రవిని ఆకట్టుకున్నాయి. వుత్సాహం పట్టలేక "చాలా బాగా మాట్లాడారండీ" అన్నాడు ప్రభావతితో. అంతధైర్యం ఎలా వచ్చిందో అతడికే తెలీదు.

"థాంక్స్! మీరుకూడా వెళ్ళి మాట్లాడండి"

"నేనాండీ?"

"మీరే... లేవండి"

అతడి బుర్రలో లైబ్రరీ మెదిలింది. గబుక్కున లేచేశాడు. కాని తనవంకే ఆసక్తిగా చూస్తోన్న అందర్నీ చూసేసరికి కాళ్ళూ చేతులూ వణికాయ్. నోటి తడారిపోయింది.

"భయం ఎందుకు బాబూ! అంతా మనవాళ్ళేగా. నిర్భయంగా చెప్పు" వెన్ను తట్టారు లాయర్ సత్యంగారు.

మాట్లాడండి అంటూ కళ్ళతో ధైర్యం చెప్పింది ప్రభావతి.

జారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

"లైబ్రరీల గురించి మనందరికీ తెలుసు. హైస్కూలు నుండి ఇప్పటి వరకూ గ్రంథాలయాలూ, వాటి ప్రయోజనాలూ అంటూ వ్యాసాలు రాస్తూనే వున్నాం. కాని మన కాలేజీలో లైబ్రరీ వున్నా రీడింగురూము లేదు. అందువల్ల ఎన్నో మేగజైన్లు ఎవరూ చూడకుండానే మూలన పడుతున్నాయి. రీడింగురూముని క్లాసురూముగా వాడుతున్నందున రీడింగురూము లేకపోయిందని తెలిసింది. ఇక లైబ్రరీ ఏం వుపయోగపడుతుంది?

ఇంకోసంగతేమిటంటే మన ప్రిన్సిపాల్‌గారు యమ్. కామ్. గనుక కాబోలు అన్నీ కామర్స్ బుక్సే తెప్పిస్తున్నారు. మన కాలేజీలో యమ్. కామ్. కోర్సు పెట్టడానికి కృషి చేస్తూంటటం కూడా అందుకు ఓ కారణమని లైబ్రరీ గుమస్తా చెప్పాడు. అది తప్పని నేననను గాని వాటితోబాటు మిగతా సబ్జెక్టుల పుస్తకాలు కూడా తెప్పించాలికదా! మొన్న నేను మా బైపీ బుక్స్ కోసం వెళితే మరీ పాతవి, అవైనా కొద్దికాపీలు మాత్రం వున్నాయి. అటువంటప్పుడు లేటెస్ట్ ఇన్ఫర్మేషన్ మాకు తెలిసేఅవకాశంఏమాత్రంవుండదు. కనుక మన సంఘం కలగజేసుకుని అన్ని సబ్జెక్టుల గ్రంథాలూ తెప్పించేట్లు చూడాలి"

అతడెళ్ళబోతోంటే పీపుతట్టి "గుడ్" అన్నాడు జార్జి. స్వామీ, ప్రభావతీ, ప్రకాషూ కూడా అభినందించేసరికి తనమీద తనకి బాగా నమ్మిక ఏర్పడింది రవికి. తనూ వుపన్యసించగలనన్న ధీమా కలిగింది.

తర్వాతెవరూ మాట్లాడటానికి ముందుకి రానందున జార్జి కోరికపై రవీంద్ర లేచి నిలబడ్డాడు.

"ఒక్కసారి దేశాన్ని పరికించి చూడండి. కారు మేఘాలు కమ్మినట్టుగా వుంది దేశం. ఎందుచేత? అశాంతి! ఆందోళన! ఆకలి మంటలు! హత్యలు! ఆత్మహత్యలు! నిరుద్యోగం! దారిద్ర్యం! అధిక ధరలు! రోగాలు! లంచగొండితనాలు! రాజకీయ కుంభకోణాలు...

స్వాతంత్ర్యం వచ్చి మూడున్నర దశాబ్దాలవుతోన్నా దేశంలోని సగం జనాభా దారిద్ర్య రేఖకి దిగువనే వున్నారంటే, దేశ సంపదంతా పందకన్నా తక్కువ కుటుంబాల చేతుల్లో వుండంటే దానికి కారణమేమిటి?

పెట్టుబడిదారీ విధానం! భూస్వామ్య సంస్కృతి! వారెక్కిన పల్లకీలు మోసే ప్రభుత్వ విధానాలు!

ఉత్పత్తిచేసేవాడికి వుత్పత్తిలో భాగం లేకుండాపోతోంది. వస్తూత్పత్తికి కారణ మైన శ్రమశక్తి విలువ తగ్గిపోతోంటే యజమానులకు లాభాల రేఖ పైపైకి పోతోంది. పొలాన్ని దున్ని రక్తం చిందించి పండించేవాడికడుపు వెన్నుకంటు తోంటే భూస్వాములు బొజ్జలు నవరించు కుంటూ భుక్తాయాసం తీర్చుకుంటున్నారు.

ఇంతటి వైరుధ్యానికి కారణం మన దోపిడీవ్యవస్థ. ఈ వ్యవస్థ మారాలంటే, దోపిడీ రూపుమాసి పోవాలంటే కార్మిక కర్షక మేధావి విద్యార్థులు ఐక్యమై పోరాడాలి. అప్పుడే వర్గరహిత సమ సమాజం స్థాపించగలం. ఆనాడే ఇందాక చెప్పిన సమస్యల సుడిగుండాల నుంచి బయటపడగలదు దేశం.

అంచేత మనం ఈ దశనుండీ కూడా చైతన్యంతో శాస్త్రీయ దృక్పథంతో మన సమస్యలపై ధ్వజం ఎత్తాలి. శ్రామిక శక్తులో చేతులుకలిపి ముందుకి సాగాలి.

ఇక మన సమస్యలేమిటో నేను ప్రత్యేకంగా వివరించ నక్కర్లేదు. కాలేజీలో సీటు కావాలంటే, ఫీజు కట్టా లంటే, హాస్టల్లో జాయినవ్వాలంటే, పుస్తకాలు కొనుక్కోవాలంటే, హోటల్లో భోంచెయ్యాలంటే, ప్రతిదీ విషమ సమస్య గానే వుంది. వాటి నెదుర్కోడానికి ఓ సమిష్టి రంగంకావాలి. దానికి సరైన వేదికే మన విద్యార్థిసంఘం. మన సమస్యల్నెదుర్కొంటూనే విద్యార్థుల్లో శాస్త్రీయమైన ప్రగతి పథమైన దృక్పథాన్ని కలిగించి సమాజపు మౌలిక మార్పుకోసం కృషిచెయ్యడానికి తీర్చిదిద్దటం మన సంఘ లక్ష్యం.

వీటన్నిటి గురించీ మన సంఘం రాజీ లేకుండా పోరాడుతుందని మనవిచేస్తు న్నాను. అదే సమయంలో ఈ దోపిడీ వ్యవస్థలో సమస్యల్లేకుండా పోవడ మంటూ వుండదని మనం గుర్తించాలి. సమ సమాజంలో తప్ప అన్ని రంగాల ప్రజలకీ న్యాయం జరగదని మనం గ్రహించి అందుకోసం మనం అవిరళ కృషి చేయాల్సొంటుంది" అంటూ ఓ అరగంటసేపు వివిధ సమస్యల్ని విపరిం చాడు ఆయన.

తర్వాత లాయర్ సత్యంగారు, జాన్ని ప్రసంగించారు.

ఆతర్వాత కొన్ని తక్షణ కార్యక్ర మాలు నిర్ణయించుకున్నారు. సంస్థ కార్య వర్గానికి కొందరి పేర్లతోబాటు రవి పేరూ సూచించాడు స్వామి. కాని రవి ఇష్టపడక స్వామే అందుకు తగినవాడని చెప్పేడు.

"ఎన్నాళ్ళు చదువుతానో నాకే తెలీదని ఇదివరకే చెప్పేనుగా. హాస్టల్ సీటు రాలేదు గనుక ఇంకా అనుమానాస్పద మైంది" అన్నాడు స్వామి.

"పోనీ ప్రకాష్ అయితే ..." అన్నాడు.

పక్కనేవున్న ప్రకాష్ "నేను మంచి కార్యకర్తని గాని నాయకుణ్ని కాదు" అన్నాడు నవ్వుతూ.

కార్యవర్గ సభ్యుడిగా రవిని కూడా ఎన్నుకున్నారు.

# 3



రవిని చూసి తల్లీ, తండ్రీ, తమ్ముళ్ళూ, చెల్లెలూ అందరూ సంబరపడిపోయారు. చదువుకి పట్నంవెళ్ళాక దాదాపు నెల రోజుల తర్వాత ఇదే రావటం మరి.

"ఏంరా అలా చిక్కిపోయావ్.... అక్కడంతా సౌఖ్యంగా వుంటోందికదా" ఆప్యాయత రంగరించి అడిగింది తల్లి.

"బాగానే వుంటోందమ్మా. నువ్వేమిటిలా నీరసంగా వున్నావ్?"

"ఏంలేదురా... మొన్న కాస్త ఒళ్ళు వెచ్చబడిందంతే. అత్తయ్యా వాళ్ళింటికి వెళ్తున్నావా?"

"ముందు వాడికి ఏ కాఫీనీళ్ళన్నా ఇవ్వే" రామయ్యగారన్నారు.

"నా మతిమండ మర్చేపోయాను. ఎప్పుడనగా ఇంత ముద్ద మింగాడో బిడ్డ" అంటూ కూతుర్ని పిలిచి పొయ్యిమీద కాఫీనీళ్ళు పెట్టమంది.

"హాస్టల్లో ఇబ్బందిగా లేదుకదా? నీతో వున్న కుర్రాళ్ళు మంచివాళ్ళే కదా?"

"ఆఁ"

"లెక్కేమైనా కావాలా?"

"కొంచెం కావాలి. హాస్టల్ సీటుకీ, ఖర్చులకీ అత్తయ్య దగ్గర యాభై రూపాయలు తీసుకున్నాను. డిసెక్షన్ బాక్సూ, కొన్ని పుస్తకాలూ కొనాలి. నూటయాభై రూపాయలైనా కావాలి"

"ఇంకో వందో నూటయాభయ్యో ఇస్తే రెండు జతల బట్టలు కుట్టించుకుంటాడు బిడ్డ. వాడికున్నవే రెండు జతలాయే. వాటితో ఆ పట్నంలో ఏం ఇబ్బంది పడుతున్నాడో ఏమో"

"బట్టల సంగతి తర్వాత చూద్దాంలే. ముందు మిగతావాటికి లెక్కదొరికితే..." అంటూ బయటికెళ్ళిపోయారు రామయ్యగారు.

'అప్పుకో చేబదులుకో' అనుకుంటూ నిట్టూర్చాడు రవి.

కాఫీ ఇచ్చి ఇంటికబుర్లు చెప్పి, మేనత్త కబుర్లూ, కాలేజీ కబుర్లూ అడిగి చెప్పించుకుంది శాంతమ్మ.

"అన్నట్టోరే అబ్బాయ్... శివయ్య మాస్టారబ్బాయి వచ్చేట్ట. వెళ్ళొస్తావా?" అంది ఆఖర్న.

"ఓసారలా వెళ్ళొస్తానమ్మా"

"పెందలకాడే వచ్చెయ్యరా. అప్పుడే చీకటిపడుతోంది కూడానూ. పోనీ యాఖంగా భోంచేసి వెళ్ళకూడదుట్రా"

"ఇప్పుడే వచ్చేస్తానమ్మా"

దారిలో కనిపించి కుశల ప్రశ్నలేసిన వూరివాళ్ళకి జవాబిస్తూ శివయ్య మాస్టారింటికి వెళ్ళాడు రవి.

ఆయన అరుగుమీద పడక్కుర్చీలో కూర్చుని పదిమంది కుర్రాళ్ళకి ప్రైవేటు చెబుతున్నారు. రవిని చూసి "ఏవోయ్ ఎప్పుడొచ్చావ్?" అని పలకరించారు.

"ఇంతక్రితమేనండీ"

"ఎలా వుంది కాలేజీ?"

"బాగానే వుందండీ"

"హాస్టల్లో చేరావటగా.మాలా మండీతో కలిసుండాలి కాబోలు"

ఆయన ధోరణి తెలిసినవాడవటంతో ఆ మాటలు దాటేస్తూ "శివాజీ లేడాండీ"




అనడిగాడు.

"ఇప్పుడే అలా కాలువగట్టు కెళ్ళాడు. వచ్చేస్తాళ్ళే. ఆ స్టూలు లాక్కుని కూర్చో"

రవి గొంతువిని మాస్టారి భార్య వచ్చింది పమిటకొంగుతో చేతులు తుడుచుకుంటూ. "బాగున్నావా బాబూ"

''బాగానే వున్నానండీ.శివాజీ వచ్చేడని తెలిసీ....."

."నిన్ననే వచ్చేడు. ఈ ఏడాదితో చదువైపోతుంది. ఏ వుజ్జోగమో ... వుజ్జోగం త్వరగా వస్తే ఆ మూడుముళ్ళూ వేయించి నిశ్చింతగా కన్ను మూద్దామని వుంది. ఆ భగవంతుడేం రాసిపెట్టాడో ఏమో"

"ఏదో వుద్యోగం ఏమిటే...జిల్లా కలెక్టరు అవుతాడే నాకొడుకూ. వాడి ముందు తాశీల్దార్లూ గీశీల్దార్లూ వంగి వంగి దండాలెట్టాల్సిందే. ఆ దర్జా ఆ హోదా ఆ నౌకర్లూ చాకర్లూ..."

"అలా జరగాలిగాని ఏడుకొండల వాడికి నిలువుదోపిడీ ఇవ్వనూ?!"

"జరక్క ఎక్కడికి పోతుందే పిచ్చి మొహమా. వాడు ఇంటర్లూ, బియ్యేలూ చదవటంలేదు యమ్మెస్సీ చదువుతున్నాడు తెల్సా? గోల్డ్ మెడల్ కూడా వస్తుందే ఏమిటనుకున్నావో" అన్చెప్పి ముక్కు పొడుండబ్బా తెరిచారు మాస్టారు.

శివాజీమీద తల్లిదండ్రులెన్ని ఆశలు పెట్టుకున్నారో, ఇంకెన్ని కలలు కంటున్నారో, తెలిసినవాడు గనుక రవి శ్రోతగా వుండిపోయాడు.

ఇంతలో ఓ కుర్రాడేదో అడగడంతో "ఈ..చదువు. అప్పుడు హిరణ్యకశిపుడు భూమిని చాపలా చుట్టి చంకన పెట్టుకుని ఏం చేశాడూ?" అని గట్టిగా అడిగేసరికి బిక్కముఖం పెట్టాడువాడు.

"పశువులు మేపుకోక మీకెందుకురా చదువులూ వెళ్ళు..వెళ్ళి చదివి తగలడు"

ముక్కు నిండా పొడుంపట్టించి ఏకధాటిగా నాలుగుతుమ్ములు తుమ్మేకగాని ఆయన కోపం తగ్గలేదు.

''భూమి – ఉపగ్రహం పాఠం చెప్పరాండీ'' ఇంకో కుర్రాడు అడిగాడు

''చెబుతాను ఎందుకు చెప్పనూ. మీతో అరిచి అరిచి, వాగి వాగి డెబ్బై ఏళ్ళకి చావాల్సినవాణ్ని యాభై ఏళ్ళకే ఛస్తాను''

''అవేం మాటలండీ శుక్రవారం పూట'' మంగళసూత్రం కళ్ళకద్దు కుందాయన భార్య.

''మీ కాలేజీ లెక్చరర్ల పని హాయోయ్. రోజుకి రెండు గంటలో, మూడు గంటలో ఏదో చెబుతారు. స్కూటర్లెక్కి టింగు రంగా అంటూ వెళ్ళిపోతారు. మేమూ వున్నాం ఎందుకూ...వాగుడు యంత్రాల్లా వాగుతూంకాల్సిందే రోజుకి పన్నెండు గంటలూ" రవితో అని తిరిగి ఆ కుర్రాడితో అన్నారు మాస్టారు ''గ్లోబు నెప్పుడైనా చూసేవుట్రా?''

తల అడ్డంగా తిప్పాడు వాడు.

''చూశావుటోయ్ రవీ. రెండో తరగతి నుంచే తెలుగూ, ఇంగ్లీషూ, గణితం, సామాన్య శాస్త్రం, సాంఘిక శాస్త్రం అంటూ నూరిపోసెయ్యాలిగాని ఒక్క పరికరమూ, ఒక్క చార్టూ స్కూళ్ళకి సప్లయిచెయ్యరు. ఇదోయ్ ప్రభుత్వం పనిచేస్తోన్న తీరు'' అంటూ ఓవ్యాఖ్యానం రవి మీదకి విసిరి ఆ అబ్బాయితో అన్నారు. "భూమి గుండ్రంగా బంతిలా వుంటుంది. ఊ...ఎలావుంటుందీ?"

"బంతిలాగానండి"

"అవును కానండీ...ఇందాక హిరణ్య కశిపుడో, ఎవరో భూమిని చాపలా చుట్టేశాడన్నారు. ఇప్పుడు భూమి గుండ్రంగా వుందంటారేమిటండీ'' మాస్టారి భార్య సందేహం వెలిబుచ్చింది.

"తెలుగువాచకంలో భూమి బల్ల పరుపుగా వుంటుంది. సైన్సులో భూమి గుండ్రంగా వుంటుంది. ఎందుకంటే అది మా ఖర్మ.ఎవడో రాసేస్తాడు. దాన్ని గవర్నమెంటు అచ్చేసేసి మా మొహాన కొడుతుంది. మేం దాన్నే చెప్పిచావాలి'' అన్చెప్పి ఇంకో కుర్రాణ్ని "లెక్క చేశావుట్రా? ఇలా పట్రారా వెధవా" అని అరిచారు.

ఆ కుర్రాడు పుస్తకం పట్టుకొచ్చాడు. అది చూసి "ఇంకా చెయ్యలేదేవిట్రా!చెయ్యి. పది లీటర్ల పాలల్లో రెండులీటర్ల నీళ్ళు కలిపితే పదిరూపాయలు లాభం. మరి ఇరవై అయిదు రూపాయలు లాభం రావాలంటే ఎన్ని లీటర్ల నీళ్ళు కలపాలి. ఊ....చెయ్యి" అన్నారు.

"బాగానేవుంది. లాభాలకోసం పాలని నీళ్ళు చెయ్యమంటారా? మాయదారి లెక్కలూ...మాయదారి చదువులూనూ" అంటూ లోపలికెళ్ళిపోయిందావిడ.

"ఇదే కాదే...ఇలాటివి సవాలక్ష వున్నాయ్! ఏంచేస్తాం కళ్ళు మూసుకుని అదే వాగాలిగాని ఇదేమిటని అడక్కూడదు. అడిగినా విన్పించుకునే నాధుడేడీ?''

శివాజీ రాకతో ఆయన వాక్ ప్రవాహానికి ఆనకట్ట పడింది.

"ఇంత చీకటి పడేవరకూ వున్నా వేంరా అబ్బాయ్...పురుగూ పుట్రా వుండదూ'' ఆప్యాయంగా కొడుకుని చూస్తూ అన్నారు మాస్టారు.

"చిన్నప్పట్నుంచీ కాలువ గట్లంట పొలాల గట్లంట తిరిగినవాణ్నే కదా" నవ్వేడు.

"అప్పుడు వేరు, ఇప్పుడు వేరు. పెద్ద

 

చదువు చదువుతూ పెద్ద ఆఫీసరవ్వబోతున్నప్పుడు దానికి తగ్గట్టుగా వుండొద్దూ? సరిసరే...రవి వచ్చాడు చూడు"

"ఏం రవీ...ఎంతసేపయ్యిందొచ్చి? లోపలికిరా గదిలో కూర్చుందాం"

జవాబుగా నవ్వి గదిలోకి నడిచాడు రవి అతని వెంట.

''కూర్చో. కాలేజీలో చేరావుటగా. మీ ఫాదర్ వద్దన్నా వినకుండా చేరావని కూడా చెప్పేరు. డిగ్రీ అయినా లేకపోతే ఈరోజుల్లో జాబ్స్ రావడం కష్టం. అన్నట్టు బైపీ తీసుకున్నావుటగా? నాలిగ్గీసుకోవడాని క్కూడా పనికిరాదా గ్రూపు. బి.కాం. అయితే బాంకులో ఘరానాగా జాబ్ వచ్చునుగదా?"

"ఆ గ్రూపు నాకిష్టం. అందుకే అది తీసుకున్నాను''

ఆ మసక వెలుతుర్లో అతడి మొహంలోని భావాలేం కన్పించక ఓ నిమిషం మౌనం వహించాడు శివాజీ.

''మీ యూనివర్శిటీ ఎడ్యుకేషన్ గురించి చెప్పండి"

"యూనివర్శిటీలంటే ఎలిమెంటరీ స్కూళ్ళనుకో. ఇక్కడి మాష్టారు పిల్లల్ని ఫెయిల్ చెయ్యొచ్చు, పాస్ చెయ్యొచ్చు. అంతా వాళ్ళిష్టం. అలాగే అక్కడి ప్రొఫెసర్లూ, హెడ్డాఫ్ ది డిపార్టుమెంట్లూ ఇవ్వాలనుకుంటే క్లాస్ ఇవ్వొచ్చు. లేకపోతేలేదు. బాగా చదవటం, రాయటం ఒక్కటే గీటురాయి కావక్కడ. అంతా ప్రొఫెసర్ల ఇష్టారాజ్యమనుకో. ఆ త్తెసరు మార్కుల్లో పాసైనవాణ్ని రీవేల్యూయేషన్ పెట్టించి ఫస్ట్ క్లాసివ్వగలరు. సైన్సు గ్రూపైతే ప్రాక్టికల్స్‌లో మార్కులు వేయించి క్లాసు కట్టబెట్టగలరు. అలాగే గోల్డ్ మెడల్స్ ఇప్పించగలరు. అంతేకాదు గోల్డ్ మెడల్ వస్తుందనుకున్న వాడికి ఆ త్తెసరు మార్కులిచ్చి రీసెర్చికి సీటు రాకుండానూ చెయ్యగల శక్తివంతులు వాళ్ళు. అందుకే స్టూడెంట్లు పోటీపడి మరీ ప్రొఫెసర్లని కాకా పడుతూంటారు"

"అంత ఘోరంగా వుంటుందా?"

"ఆ స్థాయికెళ్ళే స్టూడెంట్లు తక్కువ గనుక దాన్ని గురించి బయటి ప్రపంచానికి తెలిసింది తక్కువే. నిజానికి ఇక్కడున్న కేస్ట్ ఫీలింగ్సూ, ఫేవరిజమ్‌లాంటివి ఇంకెక్కడా వుండవు"

అపనమ్మకంగా చూశాడు రవి.

"వాళ్ళకున్నంత ఫీలింగు ఇంకెవరికీ వుండదు. కులాన్నీ, కుల సంఘాల్నీ వాళ్ళు బాగా ప్రోత్సహిస్తూంటారుకూడా. ఓచోట బ్రాహ్మిన్ ఫీలింగైతే, మరోచోట రెడ్డి, నాయుడు ఫీలింగ్. అన్ని యూనివర్శిటీల్లోనూ ఇంచుమించు ఇదే పరిస్థితి"

"గురుదేవులే అలావుంటే ఇక విద్యార్థులేం బాగుపడేట్లు?"

"లాస్టియర్ ఓ యావరేజ్ స్టూడెంటుకి గోల్డ్ మెడలిప్పించి అల్లుణ్ని చేసుకుని ఫారన్ స్టడీకి పంపాడో ప్రొఫెసర్. దానినిబట్టి నువ్వే వూహించుకో"

"చాలా దారుణం"

"ఆ గొడవకేంగాని మీ కాలేజీ ఎలా వుంది? ఇదివరకన్నా పాలిటిక్స్ పెరిగాయిటకదా?"

"ప్రిన్సిపాల్‌ని సమర్థించేవాళ్ళూ, వ్యతిరేకించేవాళ్లూ అంటూ రెండు గ్రూపులున్నాయి లెక్చరర్స్‌లోనూ, విద్యార్థుల్లోనూ కూడా"

"ఒరే అబ్బాయ్...కాళ్లు కడుక్కుంటూ వుంటూ భోజనం వడ్డిస్తాను" శివాజీ తల్లి గుమ్మంలోకొచ్చి అంది.

"నే వస్తానింక" లేచాడు రవి.

ఎలా చదివితే ఎక్కువ మార్కులు వస్తాయో, సబ్జక్టు బాగా తెలుస్తుందో శివాజీనడిగి సలహాలు తీసుకుందామని వచ్చాడు తను. కానతడు చెప్పిన విషయాలకి మనస్సు వికలమవడంతో అవేం అడగలేకపోయాడు. ఆవాళంతా యూనివర్శిటీ స్థాయిలోని కులతత్వం గురించే ఆలోచిస్తూండిపోయాడతను.

* * *

కెమిస్ట్రీ లెక్చరర్ జగన్‌మోహన్‌గారి క్లాసు జరుగుతోంది. అంతా వుత్సాహంగా కూర్చున్నారు నోట్సులూ, పెన్నులూ తెరచి.

కాని, అలవాటుకి భిన్నంగా ఆరోజు తాపీగా అటెడెన్స్ తీసుకున్నారాయన. మధ్యమధ్య కొందరి ఇంటిపేర్ల గురించీ, వూళ్ళ గురించీ అడిగి జోక్స్ వేశారు. ఏయే సబ్జక్టులు ఎంతవరకూ అయ్యాయో అడిగి తెలుసుకున్నారు. అలా కబుర్లు చెప్పి పాఠం మొదలుపెట్టేసరికి అర గంటపైనే అయ్యింది.

కెమిస్ట్రీ పాఠం నాలుగు ముక్కల్లో ఏదో చెప్పారు. ఏం చెప్పేరో ఒక్కరికీ అర్థం కాలేదు. ఎంతో చక్కని నోట్సు రాసుకునే విద్యార్థులు కూడా ఒక్క ముక్కా రాసుకోలేకపోయారు.

విజ్ఞాన వాహినిలా ప్రవహించే ఆయన ఉపన్యాసం ఎండి బీటలుపడిన నదిలా అయిపోయిందేమా అనుకుంటూండగానే బెల్ మోగింది.

లెక్చరరు వెళ్లిపోయారు.

ముఖాముఖాలు చూసుకున్నారంతా.

'ఆయనకి ఈవాళేమయ్యింది?' అందరి ముఖాల్లోనూ ఇదే ప్రశ్న.

రవికి చాలా కంగారుగా వుంది. ఇక ఎప్పుడూ పాఠం ఇలాగే చెబితే కెమిస్ట్రీలో తనకొచ్చేవి అత్తెసరు మార్కులే.

రూమ్‌కి వెళ్ళివెళ్ళగానే అనంతంతో ఈ సంగతి చెప్పేడు రవి.

"ఆయనే కాదు చాలా మంది లెక్చరర్స్ అంతే"

"తామెంత బాగా చెప్పగలరో రుచి చూపించడానికి మొదట్లో బాగా చెబుతారు. తర్వాతేమీ చెప్పరు. సరిగ్గా క్లాసులకి రారు కూడా. క్లాసుల్లో సరిగ్గా చెప్పనప్పుడే కదా ప్రైవేట్లకొచ్చేది!"

"అంటే ప్రైవేట్లకోసమా ఇదంతా?"

"ఆశ్చర్యపడకు చిట్టినాన్నా. ప్రైవేట్లనలా తీసిపారెయ్యకు మరి. ప్రైవేట్లు ఈ రోజుల్లో గృహ పరిశ్రమలు! ప్రతి లెక్చరరూ రోజూ రెండు-మూడు బేచీలకి ట్యూషన్లు చెబుతూంటారు. క్లాసు రూములకన్నా ట్యూషన్ రూములు సోఫాలూ, కుర్చీలూ, ఫాన్లతో బ్రహ్మాండంగా వుంటాయ్" ప్రకాష్ నవ్వేడు.

"మరి ప్రైవేట్లు చెప్పించుకోలేనివాళ్ళ సంగతి?"

"ఇంతే సంగతులు. శ్రీమతే రామానుజాయన్నమహా హరి గోవింద గోవింద శివ గోవింద గోవింద..." అని ప్రకాష్ పాటందుకున్నాడు. "మనంతట మనం కష్టపడి చదువుకోవాల్సిందే నాలాగా" అన్నాడు అనంతం అందుకుని.

రవి గుండెలు బరువెక్కాయ్.

* * *

ఆదివారం.

రికార్డు వర్కయ్యేసరికి పదిగంటలు అయ్యింది. వెళ్ళి చాన్నాళ్ళయ్యిందను కుంటూ మేనత్త ఇంటికెళ్ళాడు రవి.

"వారం వారం వస్తానని ఇన్నాళ్ళకా











రావడం?" నిష్టూరమాడిందామె.

"ఖాళీ వుండటంలేదత్తా. మా సైన్సు వాళ్ళకి చచ్చేంత రికార్డు వర్కుంటుంది" అని ఆగి "ఏం చేస్తున్నారత్తా" అన్నాడు పిల్లలకోసం చూస్తూ.

భవానీ అతణ్ని చూసి చాటుకి తప్పుకున్నా ఆమె మొఖంలో వెలిగిన ఆనంద దీపాన్నతడు గమనించక పోలేదు. మరెవరు చెప్పేరోగాని పక్కింట్లో ఆడుకొంటోన్న కామేశ్వరీ, గోపీ వచ్చి చెరోపక్కన కూర్చున్నారు అతడి చేతులు పట్టుకుని.

"బతుకునీడ్చడమే ఓ విశేషం. అంతకంటే ఏముంటాయి చెప్పు? ఆ గొడవకేంగాని హాస్టల్లో అంతా బావుంటోందా? ఈమధ్య ఇంటికెళ్ళేవా? అన్నయ్యా,వదినా,పిల్లలూ కులాసానా?"

"పదిహేనోరోజుల క్రితం వెళ్ళాను. మామూలు గొడవలే"

"అంతేలే... ఈ కలికాలంలో సుఖ పడేదిపెట్టిపుట్టిన మారాజులే"నిట్టూర్చింది ఆవిడ.

ఇదివరకులేని, కన్పించని నీలి నీడలు ఇప్పుడామె మొఖంలో తారట్లాడటం చూసి చాలా ఇదయ్యేడు రవి. పెద్ద కొడుకు భవిష్యత్తు గురించిన ఆందోళనో లేక ఇంటి ఆర్థిక పరిస్థితివల్ల కలిగిన విరక్తీ విషాదమూనో అర్థంకాలేదతడికి.

"మావయ్యేడి అత్తా?"

"ఇంతక్రితమే అలా ఆసుపత్రికేసి వెళ్ళారు. ఈమధ్య మీ మావయ్యకి ఒంట్లో బావోటంలేదయ్యా.నీరసం, కాళ్ళు లాగటం అంటారు. డాక్టర్లేమో అనారోగ్యం ఏంకాదు బలమైన తిండి తినాలి అంటారు. బలమైన తిండితినేట్టున్నాయా రోజులు?!"

ఆమె బాధకి కారణం బోధపడింది.

"కొన్నాళ్ళు రెస్ట్ తీసుకుంటే తగ్గిపో వచ్చుతా"

"నేనూ అదే చెబుతున్నాను. వింటూరా ఏమన్నానా. నేనూ, నా బడీ లేకపోతే లోకం తల్లకిందులై పోతుందన్నట్టు మాట్లాడతారు"

"మన ఆరోగ్యం కూడా చూసుకో వాలికదా" అన్నాడు ఓదార్పుగా. మరి కాస్సేపు వుండి భోంచేసి వచ్చేశాడు.

మెయిన్‌రోడ్ కార్నర్‌లో అద్దెకి పుస్తకాలిచ్చే బడ్డీనానుకుని ఏదో పుస్తకం తిరగేస్తోన్న జయంత్ "ఏయ్.. బావా" అని పిలిచాడు.

అతణ్ని చూసి ఉలిక్కిపడ్డాడు రవి.

నల్ల కళ్ళజోడూ, బొమ్మల చొక్కా, హిప్పీ క్రాఫూ, నోట్లో వెలుగుతోన్న సిగరెట్టూ, చేతిలో సెక్సు పుస్తకం...

ఒక్కక్షణమండి చిరాగ్గా చూశాడు.

"పిలుస్తోంటే అక్కడే నిలబడి పోయావేం బావా" అంటూ తనే సమీపించి అన్నాడు – "లేటెస్ట్ సెక్స్ డిటెక్టివ్ బుక్స్ కావాలంటే చెప్పు బావా. ఈ షాపువాడు మన దోస్తులే....ఇప్పిస్తాను"

"మంచి మార్గాన నడవాలనుకునే వాళ్ళు చదవాల్సిన పుస్తకాలు కావివి"

"గొప్ప జోకు పేల్చావు బావా. మీ కాలేజీవాళ్ళు చాలామంది చదువు తున్నారే, వాళ్ళంతా చెడిపోతున్నారన్న మాట"

"వాళ్ళంతాగాకపోయినా వాళ్ళలోని బలహీనులు తప్పకుండా పతనమవుతారు. దౌర్జన్యం, దొంగతనం, వ్యభిచారంవగైరా పనులకి బీజాలు నాటేవి ఇలాంటి పుస్తకాలే" అనేసి జవాబుకోసం ఎదురు చూడకుండా ముందుకి నడిచాడు.

జయంత్ నిర్లక్ష్యంగా ఏదో అన్నాడు గాని అదతడికి విన్పించలేదు. దారిలో కలిసి విష్ చేశాడు స్వామి.

"మన కాలేజీలో రీడింగురూము ఏర్పాటు చేశారు తెలుసుకదా'' స్వామి అన్నాడు.

''ఎవరో అన్నారుగాని నేనటు వెళ్ళలేదు. అందులో పెట్టిన క్లాస్‌ని ఎక్కడికి మార్చారట?''

''బోటనీ లేబ్‌లోని రూమ్‌కిమార్చారు. మన సంఘం మహజరు సమర్పిస్తే ప్రిన్సిపాల్‌కి నిద్రపట్టదు" అన్నాడు నవ్వుతూ.

* * *

కాలేజీలో లాస్టవర్ జరుగుతోంది.

సహజంగానే జరుగుతున్న క్లాసులు తక్కువ. వాటిల్లో వున్న విద్యార్థులూ తక్కువే. కొందరేమో గేమ్స్ ఆట్టానికీ, కొందరు లైబ్రరీకీ, కొందరు ఇళ్ళకీ పోతున్నారు. కాలేజీఆవరణలో వున్న పూడలుదిగిన మర్రిచెట్టు కింద నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు కొందరు.

తన రూమ్ కిటికీలోంచి చూసిన ప్రిన్సిపాల్ గారికి ఓ చెట్టుకింద బాబు కన్పించాడు. ఎర్రచొక్కా తొడుక్కున్న అతణ్ని చూసేసరికి కోపం వచ్చింది. గబగబా మెట్లుదిగి కింది అంతస్తు కొచ్చారు.

''బాబూ...కమ్ హియర్''

ఆవరణలోని విద్యార్థులంతా విస్తు బోయి చూశారు బుసలు కొడుతోన్న ప్రిన్సిపాల్‌ని. ఆయన కోపానిక్కారణం ఏమిటో, అతణ్నెందుకు పిలుస్తున్నారో బోధపళ్ళేదెవరికీ.

బాబు మెల్లగా ఆయన దగ్గరికెళ్ళేడు.

"క్లాసెగ్గొట్టి ఇక్కడున్నావేంరా




ఇడియట్" చెళ్ళున అతడి దవడమీద కొట్టారు. ఆ దెబ్బకి వెనకడుగేసిన బాబు కాలుజారి మెట్లమీద పడిపోయాడు. అయినా వూరుకోక పిచ్చి కోపంతో వూగిపోతూ అతడి చొక్కాపట్టుకుని లేపనెత్తి మరీ కొడుతూ "చంపేస్తా్రనా. నిన్నూ నాశనం చేసేస్తా్రనా. ఇడియట్... రాస్కెల్..." అన్నారాయన.

ఆయనకంత కోపం, ద్వేషం ఎందుకో అర్థంగాక అయోమయంగా చూస్తూండిపోయారంతా స్థాణువుల్లై. బాబు రీడింగ్ రూంకోసం పోరాడినవాడని మాత్రం తెలుసు వారికి.

ఇంతలో పరుగునొచ్చి "ప్రిన్సిపాల్ గారూ" అని గర్జించాడు జార్జి.

ఒగురుస్తూనే మింగేసేట్లు చూశారాయన. కానతడి వెనుక పోగవుతోన్న కుర్రాళ్ళని చూసేసరికి కలవరం కలిగింది. "నీకిక్కడేం పని? గో టు యువర్ క్లాసెస్" బింకంగా అని వెనుదిరగబోయారు.

"మీరు చేసిన పనేమిటి?"

"దటీజ్ నన్నాఫ్ యువర్ బిజినెస్. ఆయామ్ ది హెడ్డాఫ్ ది ఇన్స్టిట్యూషన్. మైండిట్"

"ఆగండి! ఒక్కడుగు ముందుకేసినా మర్యాద దక్కదు. అతడేం నేరంచేశాడని మీకెన్ని హక్కులున్నాయని పశువుని కొట్టినట్లు కొట్టారో అందరి ముందూ చెప్పిగాని కదల్టానికి వీల్లేదు"

"ఏం చేస్తారు?"

"ఘెరావో చేస్తాం"

"ఊ....వాణ్ణి అడుగు"

"మేమ్మీకు మర్యాద నేర్పాల్సిరావడం శోచనీయం" అని ప్రిన్సిపాల్తో అని "ఏం జరిగిందసలు?" అని బాబునడిగాడు జార్జి.

"ఆ చెట్టుకింద నిలబడి మాట్లాడుకొంటోంటే పిలిచి కొట్టారు"

"చూడు...దొంగరాస్కెల్. క్లాసు ఎగ్గొట్టి కబుర్లేసుకూర్చుంటావురా? ఇది కాలేజీ అనుకున్నావా కిళ్ళీ కొట్టనుకున్నావా?"

"మాకిప్పుడు క్లాస్లేదండీ. లాస్టవర్ కేన్సిలయ్యింది" కొంచెం గట్టిగానే అన్నాడు బాబు. ప్రిన్సిపాల్ మొఖం ఎర్రబడింది.

"చెప్పండి సార్ మీ సంజాయిషీ ఏమిటో. అతడితోబాటు ఇంకా చాలా మంది వున్నా అతణ్ణే ఎందుకు పిలిచి కొట్టారో చెప్పండి"

"దిసీజ్ టూమచ్ మిస్టర్ జార్జ్! హద్దు మీరితే నీ మీదకూడా చర్య తీసుకోవాల్సుంటుంది" క్లాసుల్లోంచి విద్యార్థులూ, లెక్చరర్లూ బయటకొచ్చి చూస్తోంటే ఏం చెయ్యాలో తోచక అన్నారు ప్రిన్సిపాల్.

"తప్పకుండా తీసుకోండ్సార్. ఒక విద్యార్థి తప్పుచేశాడో లేదో కనుక్కోకుండా మేన్హేండిల్ చేసే హక్కు, అధికారం మీకెవరిచ్చారో తేల్చుకుంటాం" అంటూ కాగితంమీద గబగబా రెండు మాటలు గిలికి "ఇదిగోనండి సమ్మె నోటీసు. రేపు సాయంత్రంలోగా మీరు అందరెదుటా బాబుకి క్షమాపణ చెప్పకపోతే ఎల్లుండినుంచి సమ్మె చేస్తాం" అన్నాడు.

ప్రిన్సిపాల్గారి మొహంలో రక్తపు బొట్టనేది లేకుండాపోయింది.

అప్పుడే బోటనీ లేబ్ నుంచొచ్చిన రవి జరిగింది తెలుసుకుని "ఒక వున్నత స్థానంలో మార్గదర్శక స్థితిలో వున్న

ఆయనిలా ప్రవర్తించడం పశుత్వం తప్ప ఏంకాదు'' అన్నాడు ఆవేశంగా.

''లైబ్రరీ రీడింగ్ రూమ్ ఏర్పాటుకి మన సంఘం ఒత్తిడి తెచ్చి ఒప్పించిం దన్న కక్షతో ఈ చర్యకి తలపడ్డారు" అన్నాడు స్వామి.

ఇంచుమించు విద్యార్థులందరికీ అలాటి అభిప్రాయమే కలిగింది.

లెక్చరర్స్‌లో కూడా భిన్నస్వరాలు విన్పించాయ్. ప్రిన్సిపాల్ అనుకూల వర్గంవారు ''ప్ర తీ దాం ట్లో నూ తగుదునమ్మా అని వేలుపెడుతున్నందుకు వాళ్ళకా శాస్తి జరగాల్సిందే. కాని డోసు కాస్త ఎక్కువే" అని వ్యాఖ్యానిస్తే "ప్రిన్సిపాల్‌గారు చాలా తొందరపడి అమానుషంగా ప్రవర్తించారు'' అన్నారు మరో వర్గంవారు.

ఆ మర్నాడు "ప్రిన్సిపాల్ అకృత్యం" పేరిట ఓ కరపత్రం కాలేజీలోనూ, వూళ్ళోనూ పంచబడింది. అన్నిచోట్లా ఆ సంఘటన గురించే చర్చించసాగారంతా.

ఇదంతా సంఘం ఆధ్వర్యంలో జరుగుతూండటం, దానికెక్కువ మంది విద్యార్థుల మద్దత్తు లభించడం శేషగిరికీ అతడి ఆధ్వర్యంలోని సమాజానికీ, గంగవెర్రులెత్తింది. పైగా తమ సమాజానికి ప్రథమ సపోర్టరూ, సలహా దాయుడూ అయిన ప్రిన్సిపాల్ మీదకి వారి బాణం గురిపెట్టడంతో ఎలాగైనా దాన్ని అణచెయ్యాలనుకున్నారు. కానీ ఎలా ఆ పని చెయ్యాలో తోచలేదు. ఇంతలో కబురు రావడంతో ప్రిన్సిపాల్‌గారింటికి వెళ్లాడు.

అతడెళ్ళేసరికి ప్రిన్సిపాల్, హాస్టల్ వార్డెన్ సుందర్రావు, రాజకీయ నా... కుడు ప్రభాకరం కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

శేషగిరిని కూర్చోమని చెప్పి అన్నారు ప్రభాకరంగారు "జరుగుతోన్న రాద్ధాంతం చూస్తున్నావుగా. దీని వెనుక నున్న వుద్దేశ్యమేమిటో తెలుసా? ప్రిన్సి పాల్‌గారు మన పార్టీ సపోర్టరుగనుక ఆయన్నీ, మన సమాజాన్నీ దెబ్బతియ్యా లనే. లేకపోతే మాస్టారు పిల్లల్ని సరైన దారిలో పెట్టడానిగ్గాను రెండు దెబ్బలేస్తే దాన్నింత ఘోరంగా చిత్రించి కోతి పుండుని బ్రహ్మరాక్షసిని చేస్తారాచెప్పు? మీరంతా వెంటనే పూనుకొని వాళ్ళ ఆట కట్టించాలి"

సుందర్రావుగారు ఆయన్ని గట్టిగా బలపరిచారు. జార్జంటే ఆయనకి సింహ స్వప్నం. ఇంతవరకూ హాస్టల్ వ్యవహారం గురించి రిపోర్టులవరకే ఎదిగిన అతడిహ ప్రత్యక్ష చర్యకి దిగితే తన ఆదాయం గోవిందా అవుతుందని ఆయన భయం!

"ఇప్పుడెలాగో సర్దుకుంటుందను కోండి. కాని ఆ జార్జిగాడు మహా డేంజరస్ ఫెలో. వాళ్లకేదోలా వుద్వాసన చెబితేగాని మనం హాయిగా ఉండలేం"

"వాడే పోతే వాడి సంఘాన్ని క్షణంలో నాశనం చేసెయ్యమా?" ప్రగల్భం పలికాడు శేషగిరి.

కాని ప్రిన్సిపాల్‌గారికి అదేం పట్టడంలేదు.

అసలే రీడింగు రూము ఏర్పాటు గొడవవల్ల అవమానభారంతో చితికి పోతోంటే ఎర్ర చొక్కా తొడుక్కొని స్టయిల్‌గా నిలబడి కబుర్లు చెబుతూ కన్పించాడాబాబుగాడు. తనకి చటుక్కున కోపం రావడంతో ఆ వేడిలో ఏదేదో

చేసేశాడు. అదింత రాద్ధాంతమవుతుందని ఆ క్షణంలో గ్రహించలేకపోయాడు. ఇప్పుడెలా? వార్త పేపర్లకెక్కితే? అసెంబ్లీలో లేవదీస్తే? ఎంత సిగ్గు... ఎంత అప్రతిష్ట - అని వాపోతున్నారాయన.

శేషగిరికి కర్తవ్య బోధచేసి, ప్రిన్సిపాల్‌కి ధైర్యంచెప్పి వెళ్ళిపోయారు సుందర్రావు, ప్రభాకరం.

కాని ఆ రాత్రి ప్రిన్సిపాల్ కంటి మీదకి కునుకురాలేదు.

మర్నాడు యాంత్రికంగా కాలేజీకి వెళ్ళారన్నమాటేగాని తన రూమ్‌దాటి బయటికడుగెయ్యలేదు. కనీసం బయటికి తొంగిచూళ్ళేదు. క్లాసు తీసుకోలేదు. గుమస్తాలతో మాట్లాడలేదు. ఒక్క ఫైలూ చూడలేదు. తీవ్రంగా ఆలోచిస్తూండిపోయారంతే.

విద్యార్థులిచ్చిన సమ్మె నోటీసు పేపర్‌వెయిట్ కింద ఫేన్‌గాలికి రెపరెపలాడుతూ ఆయన్ని మరింత కంగారు పెడుతోంది.

తన చర్యని ఖండిస్తూ కొందరు లెక్చరర్లు వ్యాఖ్యానాలూ, విమర్శలూ చేశారనీ, చేస్తున్నారనీ తెలిసినప్పట్నించీ ఆయన ధైర్యం సడలిపోతోంది. తప్పు చేశానన్న భావం నమిలేస్తోంది.

లంచ్ అవర్లో నమ్మకస్తుడైన ప్యూన్ని పిలిచి పరిస్థితి కనుక్కుని రమ్మన్నారు ప్రిన్సిపాల్‌గారు.

పది నిమిషాలకే తిరిగొచ్చాడతడు. సమ్మెకి అందరూ సపోర్టిస్తున్నారనీ, పేపర్లకీ, ప్రభుత్వానికీ రిపోర్టులు పంపాలని కేంటీన్లో అనుకొంటున్నారనీ చెప్పేడు.

అదే జరిగితే తనకెవ్వరి సానుభూతీ

సాయమూ లభించకపోవడమేగాక అంతా తనని దోషిలా బోనులో నిలబెడతారన్న వూహ కలిగి కాలూ చెయ్యీ ఆడటం మానేశాయి.

మరింకొక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా జార్జిని రమ్మని కబురం పారు వెంటనే. కొందరు విద్యార్థుల్తో వచ్చాడతడు. వారిలో రవి వున్నాడు.

"అయామ్ వెరీసారీ ఫర్ ద ఇన్సిడెంట్ మిస్టర్ జార్జ్"

ఆశ్చర్యపోయారంతా. ఆయనింత తేలిగ్గా దిగివచ్చేస్తారనెవరూ అనుకోలేదు.

"సారీసర్...క్షమాపణ చెప్పాల్సింది బాబుకి-అదీ అందరిముందు" వినయంగా చెప్పేడు జార్జి.

"అతనికి చెబుతాను. కానీ అందరిముందు చెప్పమనొద్దు. విద్యార్థుల ముందు ఒక ప్రిన్సిపాల్ క్షమాపణ కోరడం మీకు గౌరవప్రదం కాదు. ఎట్లీస్ట ప్లీజ్ రెస్పెక్ట్ ద చెయిర్" లేచి తన కుర్చీ చూపుతూ అన్నాడు.

కొందరు విద్యార్థులు అదేం కుదరదు అన్నారుగాని జార్జి నచ్చచెప్పడంతో వూరుకుండిపోయారు.

బాబు రాగానే "సారీ మిస్టర్..." అనేసి తల తిప్పేసుకున్నాడాయన.

అంతా నిష్క్రమించారు మెల్లగా. జార్జికీ,బాబుకీ, సంఘానికీ జిందాబాద్లు చెబుతూ నినాదాలు చేసి చెదిరిపోయారు విద్యార్థులు.

ప్రిన్సిపాల్గారు తన రూమ్ కిటికీ ముందు నిలబడి వాళ్ళని ముఖ్యంగా జార్జిని మాడ్చేసేలా చూస్తూండటం ఎవరూ గమనించలేదు.





జరిగిన అవమానానికి చావుదెబ్బ తిన్న పెద్దపులిలా ప్రతీకారేచ్ఛతో వూగిపోసాగారాయన.

* * *

ఆ సంఘటనతో రవి చాలా వుత్తేజితుడయ్యాడు. జార్జిని హాస్టల్కి ఆహ్వానించి సమావేశం ఏర్పాటు చేశాడు. వార్డెన్కి, ప్రిన్సిపాల్కి భయపడి కొందరు వెనుకంజ వేసినా సంఘ ప్రభావం ఇంచుమించు అందరి మీదా అంతో ఇంతో పడింది. హాస్టల్ స్టూడెంట్స్ ప్రెసిడెంట్ ఎలక్షన్లో సంఘం అభ్యర్థి గెలిస్తే తమకెన్నో సౌకర్యాలు కలుగుతాయని ఆశించసాగారంతా.

హాస్టల్లో విస్తరిస్తోన్న సంఘకార్యక్రమాలు తెలిసి వార్డెన్ సుందర్రావు గంగవెర్రులెత్తాడు. తీగలాగితే డొంకంతా కదుల్తుందని తెలుసు. అందుకే కొందరు ముఖ్యుల్ని లొంగదీసుకోవాలనుకున్నారు.

జువాలజీ ప్రాక్టికల్స్ జరుగుతూండగా రవికి కబురొచ్చిందాయన దగ్గర్నుంచి.

"నీ పేరు రవి కదూ?"

"అవున్సార్"

"నువ్వు చురుకైనవాడివీ, తెలివైనవాడివీ అని విన్నాను. నీకు సంఘాలూ, రాజకీయాలూ ఎందుకోయ్. పనీపాటా లేని పోకిరీ గుంపులో చేరి చదువు నెందుకు పాడుచేసుకుంటావ్? వృద్ధిలోకి రావాలనుకుంటే అలాటివాటికి ఎంత దూరంగా వుంటే అంత మంచిది"

రవి బదులివ్వలేదు.

"నువ్వు వాళ్ళతో తెగతెంపులు చేసుకొని ఒబీడియంట్ స్టూడెంట్లా వుంటే నీకెన్నో సౌకర్యాలు కల్పిస్తాను. హాస్టల్లో మంచి రూమ్ ఇస్తాను. కేంటీన్లో స్పెషల్ మీల్స్ పెట్టిస్తాను. ప్రాక్టికల్ ఎగ్జామ్స్లో సెంట్ పర్సెంట్ మార్కులు

వేయిస్తాను"

"సారీ సర్"

అదిరిపడి చూశారాయన. ఆ చూపుల్లో వాడి వేడి వున్నాయ్.

"నువ్వు జూనియర్ ఇంటర్ స్టూడెంటువి కదూ? పిల్లకాకికి ఉండేలు దెబ్బ తెలీదు. నీకూ నా సంగతి తెలీదు. మర్యాదగా బుద్ధిమంతుళ్ళా వుంటావా వుండు. లేదా హాస్టల్నుంచీ,కాలేజీ నుంచి కూడా సస్పెండ్ చేయిస్తాను జాగ్రత్త. మళ్ళీ ఏ కాలేజీలోనూ చేరలేక వుద్యోగం రాక చిప్ప చేతబట్టి అడుక్కుతినేలా చేస్తానేమనుకున్నావో" అంత కంతకూ రెచ్చిపోతూ అన్నారు.

మౌనంగా విని కించిత్తు జాలిగా చూశాడు రవి.

అతడికి భయం కలగలేదు. తనిప్పుడు ఒంటరివాడు కాదని అతడికి తెలుసు తన వెనుక సమిష్టి శక్తి వుందనీ తెలుసు అందుకే తనని చూసి భయపడుతోన్న వ్యక్తి బెదిరింపులకి కొంచెం కూడా బెదరకుండా వెనుదిరిగి వచ్చేశాడు.

మరి వారం తిరక్కుండా శేషగిరి హాస్టల్ స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంటుగా ఎన్నికైనట్టు నోటీసు అంటించడంచూసి నమ్మలేకపోయారంతా.

హాస్టల్ స్టూడెంట్సెవరికీ తెలీకుండా, ఎలాటి ప్రకటనా చెయ్యకుండా ఎలక్షన్లెలా జరిగినట్టు?

కొందరెళ్ళి అదే అడిగారు సుంద్రరావు గారిని.

"ఎలక్షన్ గురించి నామినేషన్లు దాఖలు చేసుకోమని మేమైతే నోటీసు పెట్టాం. మరెవరైనా చింపేశారేమో తెలీదు. వచ్చిన ఓట్లద్వారా ఎన్నిక నిర్వహించాం" తను నిమిత్తమాత్రుడన్నట్లు అన్నారు.

అసలా ఎన్నికల్లో ఎవరు పాల్గొన్నారని గట్టిగా అడిగేసరికి "ప్రెసిడెంట్ పదవికి నామినేషన్ వేసింది ఒక్క శేషగిరే. అందువల్ల ఏకగ్రీవంగా ఎన్నికైనట్లు ప్రకటించడం జరిగింది" అన్నారదే నోటితో.

"ఇల్లలగ్గానే పండుగకాదు. మోసాలతో ఎన్నాళ్లు పాలిస్తారో మేమూ చూస్తాం" అనేసి వచ్చేశారు.

క్రితం సంవత్సరం కాలేజీ యూనియన్ ఎలక్షన్ ప్రకటించినా సంఘంది పైచేయి అవుతూండటం గమనించి ఎన్నికలు రద్దుచేసేశారు ప్రిన్సిపాల్ గారు. విద్యార్థులమధ్య కొట్లాటలు నివారించడానికే ఆ చర్య తీసుకున్నట్టు చెప్పి సమర్థించుకున్నారు. ఈ ఏడాదీ అదే పాట పాడుతూండటంతో అందరి దృష్టీ హాస్టల్ స్టూడెంట్స్ యూనియన్ నాయకత్వం మీదేవుంది. అదిలా ముగిసేసరికి అందర్లోనూ అసంతృప్తి చోటుచేసుకుంది.

"ఇంకెందుకీ బూటకపు ఎన్నికలు" అని మండిపడసాగారంతా.

* * *

వరుసగా మూడ్రోజులు స్వామి కాలేజీకి రాకపోయేసరికి కారణమేమిటో అంతుబట్టలేదు రవికి. ఇంటికెళ్ళేడేమోలే అని మరి రెండ్రోజులు చూశాడు గాని అతడు రాకపోయేసరికి వుండబట్టలేక అతడి రూమ్కెళ్ళాడు.

"స్వామి లేడాండీ?" స్వామి రూమ్మేట్ని నడిగాడు.

"మీకు తెలీదాండీ?"

"ఏమిటి?"

"స్వామివాళ్ళ నాన్నగారు ఫాక్టరీలో యాక్సిడెంటై చనిపోయారు"

"మైగాడ్.... నిజమా?!"

"చాలా ఘోరం జరిగిపోయిందండీ. స్వామిగాక ఇంకా చిన్నపిల్లలు కూడా వున్నారండీ. వాళ్ళ బతుకులెలా తెల్లవారతాయో ఏమో" బాధగా అన్నాడు.

"మరి స్వామి చదువు....?"

"ఆగిపోయినట్లేనండీ"

గుండెల్నెవరో నలిపేస్తున్నట్లు విలవిల్లాడాడు రవి.

* * *

ఫణికుమార్‌నెవరూ పేరుపెట్టి పిలవరు. అతణ్ని ఎరగనివాళ్ళంటూ లేకపోయినా ఆ పేరు చెప్పి అడిగితే ఒక్కరూ అతణ్ని చూపలేరు. రోమియో అన్న నిక్‌నేమ్ అతనికి ఎప్పుడెవరు పెట్టారోగాని అదే అతడి అసలు పేరై కూర్చుంది.

అతడు సెకండ్ బి.ఏ. చదువుతున్నాడు కాని క్లాసులో ఎప్పుడూ వుండడు. అలా అని కాలేజీకి రాకపోవటమూ వుండదు. ప్రతిరోజూ వస్తాడు. పూల రంగళ్ళా గాడీ కలర్స్, పెద్ద పెద్ద డిజైన్లుగల దుస్తులు ధరించి పుష్పవాహనంలాంటి సైకిల్ మీద ఒకే ఒక్క పుస్తకంతో వస్తాడు. వచ్చి కాలేజీ గేటు ముందే సెక్యూరిటీ గార్డులా నిలబడిపోతాడు.

కాలేజీకొచ్చే అమ్మాయిల్ని నవ్వుమొహంతో ఆహ్వానించి కేంటీన్లో కాఫీ తాగి బుద్ధిపుడితే క్లాసుకి లేకపోతే ఇంటికి వెళ్ళిపోతాడు. మళ్ళీ నాలుగ్గంటలకి గేటు దగ్గర డ్యూటీకొచ్చేసి ఇంటిముఖం పట్టిన అమ్మాయిలకి వీడ్కోలు చెబుతాడు. కొందర్ని కొంత దూరం సాగనంపుతాడు. మరికొందరి వెనుక సైకిల్ మీద ఫాలో అవుతాడు. వారికి బోర్ కొట్టకుండా ఈల పాటో, కూని రాగాల పాటో పాడతాడు.





మధ్య మధ్య ఏవో కామెంట్స్ విసిరి మహదానందపడిపోతూంటాడు. ఆ అమ్మాయిల ఇళ్ళు అల్లంత దూరంలో వుండగా ఆగిపోయి వాళ్ళు ఇంట్లోకి వెళ్ళే వరకూ చూస్తూ నిలబడి ఆనక వుస్సు రంటూ వెనుదిరిగి వుమన్స్ కాలేజీవైపో, సినిమాహాలు దగ్గరికో వెళ్ళి మళ్ళీ పోజు కార్యక్రమంలో పడతాడు.

రోజుకో డ్రెస్ మార్చే అతణ్ని చూసి కొందరు హేళనగా నవ్వుకుం టూంటే, ఆడపిల్లలు మాత్రం అతణ్ని గొంగళిపురుగులా చూస్తూంటారు. అతడి న్యూసెన్స్ భరించలేక కొందరు ప్రిన్సిపాల్ కి రిపోర్టు చెయ్యడమూ,ఆయన మందలించడమూ వాటిని దులిపేసుకుని మళ్ళీ ఎప్పట్లా తయారవ్వడమూ కూడా జరిగిపోయాయి. దాంతో చాలా మంది వాణ్ని పట్టించుకోకుండా వుండటమే మంచిదన్న అభిప్రాయానికొచ్చేశారు. కాని కొత్తగా చేరిన ఆడపిల్లలకి మాత్రం అతడంటే వణుకూ, దడా.

ఈసారి సీనియర్ ఇంటర్ చదువు తోన్న ప్రభావతి వెంటబడ్డాడతడు– ''నిలువవే వాలు కనులదానా వయారీ హంస నడకదానా'' అంటూ పాడుతూ.

ఆమె అదేమీ పట్టించుకోకుండా నడవ సాగింది.

దానిని అలుసుగా తీసుకుని అతడు స్వరం పెంచి మరీ పాడసాగాడు రక రకాల పాటల పల్లవులు. మధ్య మధ్య సైకిల్ దిగీ, దిగకుండానూ కూడా కమల హాసన్ లా డాన్స్ చెయ్యసాగాడు రోడ్డు మీదే.

అంతా వింతగానూ, నవ్వుతూనూ తమిద్దరి వంకా చూస్తోంటే అవమానంగా వుందామెకి.

ఎర్రబడ్డ మొఖంతో అసహ్యంగా చూస్తూ "నీకు అక్కా చెల్లెళ్ళూ లేరా మిస్టర్" అంది రోషంగా.

"వున్నారు. కాని నువ్వు అక్కాకాదు, చెల్లెలివీకాదు" వెకిలిగా నవ్వేడు.

అతణ్ని అనవసరంగా రెచ్చగొట్టి నందుకిదైపోతుంటే కాస్త దూరంలో రవీ, ప్రకాషూ కన్పించారు ప్రభావతికి. ''రవిగారూ...'' అంటూ పిలిచింది.

వాళ్ళామెనీ, రోమియోనీ చూసి గబగబా వచ్చారు.

రోమియో సైకిలాగింది. నోటికి తాళం పడింది. అమాయకుళ్ళా దిక్కులుచూస్తూ నిలబడ్డాడు.

''ఓహో..రోమియోగారా!గాడిదేమైనా దొరుకుద్దేమో చూద్దామా?'' ప్రకాష్ అన్నాడు.

"మంగలొద్దా?'' రవి వంతపాడాడు.

"అవశ్యం. సున్నం కూడా కావాల్సిందే''

"మరి డప్పులో?''

"అవి లేకపోతే సందడేంవుంటుంది?"

"వాటి సంగతి తర్వాత చూద్దాం గానె ముందతడి షర్టు ఎవరిదో కనుక్కోండి. మా అన్నయ్యదేమోనని నా అనుమానం. కాలర్ వెనుకనున్న గుర్తు చూసినా, డ్రైక్లీనర్స్‌వాణ్నడిగినా తెలుస్తుంది" మెల్లగా అంది ప్రభావతి.

"నీ షర్టు కొంచెం తియ్యి మిస్టర్'' రవి అన్నాడు. ప్రకాష్ వెళ్ళి అతడి సైకిల్ హేండిల్ మీద చెయ్యేశాడు.

వాళ్ళని చూసి నీరుకారిపోయిన రోమియో వాళ్ళ మాటలకి ముచ్చెమటల్తో వణకసాగాడు. ప్రభావతి తను తొడుగు కున్న షర్టు తన అన్నయ్యదనేసరికి ఇక ప్రాణాలు పైకేపోయాయ్. ఎంచే

తంటే తను తొడుగుతోన్న బట్టలన్నీ తనవికాదు. డ్రైక్లీనర్స్‌వాళ్ళ దగ్గర రోజు అద్దెకి తీసుకున్న ఇతరుల దుస్తులు. షర్ట్‌మీది గుర్తులు చూస్తే తన భండారం బయటపడిపోతుందని తెలుసు. అందుకే అటూ ఇటూ చూసి గబుక్కున తప్పించుకుని దూసుకెళ్ళిపోయాడు రోమియో ఫణికుమార్.

ముగ్గురూ పగలబడి నవ్వారు.

"ఇంతకీ ఆ షర్ట్ మీ అన్నయ్య గారిదేనా?" ప్రకాష్ అడిగాడు.

"కాదండీ...కాని అదతడిది కాదని తెలుసు. ఎలాగంటే షర్ట్ భుజాలు దిగింది. పొట్టదగ్గర పట్టేసింది. స్వంత చొక్కా అయితే సాధారణంగా అలా వుండదు''

"భలే తెలివైనవారే! రేపట్నుంచి పోజులు తగ్గిస్తాళ్ళెండి. ఇహ అద్దె బట్టలు తొడుక్కోడానికి ధైర్యం చాలదులెండి" రవితో శృతి కలిపారంతా.



4

స్వామి రూమ్మేట్ దగ్గర చిరునామా తీసుకొని బయల్దేరాడు రవి.

స్వామీ వాళ్ళూరు వెళ్ళి అతణ్ని పలకరించి ఓదార్చి ధైర్యంచెప్పి రావాలని అతడి తండ్రి చనిపోయినట్టు తెలిసినప్పట్నుంచీ ప్రయత్నిస్తే సంక్రాంతి సెలవులిచ్చేక గాని పడలేదు.

స్వామి వాళ్ళిల్లు షుగర్ ఫాక్టరీకి దగ్గర్లోనే. మొదటి షిఫ్ట్ వాళ్ళొచ్చే వేళయ్యిందని తెలుసుకుని గేటుదగ్గర నిలబడ్డాడు.

కాస్సేపటికి ఫాక్టరీ కూత వేసింది. మరికొన్ని నిమిషాలకి బిలబిలమంటూ బయటికొచ్చారు యూనిఫాంలో వున్న కార్మికులు. వారిలో వున్న స్వామిని గుర్తించి పిలిచాడు.

మెరుస్తోన్న కళ్ళతో వచ్చి రవి చేతులు నొక్కుతూ "బావున్నావా రవీ" అన్నాడు సాదరంగా నవ్వుతూ.

అతడి కళ్ళల్లో కన్నీటి పొర కదిలింది.

రవి కళ్ళనుండి కన్నీరు జారింది.

''అదేవిటి రవీ! ఛా ... కళ్ళు తుడుచుకో. ఇంటికెళ్దాం పద''

ఈ రెండు నెలల్లోనే అతడు అయిదారేళ్ళ పెద్దవాడైపోయినట్లు కన్పిస్తున్నాడనుకుంటూ అడుగులువేశాడు రవి.

పట్నానికి దూరంగా వుందా ఫాక్టరీ. దానికి దగ్గర్లోనే చిన చిన్న ఇళ్ళూ గుడిసెలూ చాలా వున్నాయి. తనలాంటి చిన్న తరహా కార్మికులంతా వాటిల్లోనే వుంటున్నారని చెప్పేడు స్వామి.

ఆ ఇళ్ళన్నీ ఒక కాలనీ రూపంలో వున్నా శుభ్రంగా మాత్రం లేవు. చెత్తా చెదారం పేరుకుని తీరూతెన్నూ లేకుండా వున్నాయి. ఓ పక్కనుండి పారే కాలువ నీరే వాళ్ళకి శరణ్యం. ఫాక్టరీనుంచి వచ్చే కుళ్ళు నీరుకూడా మరో పక్కనుండి కాలువలా ప్రవహిస్తూ కావల్సినంత దుర్గంధాన్ని పంచుతూ వుంది.

స్వామివాళ్ళింటికెళ్ళేసరికి చీకటి పడింది.

లోపల బుడ్డి దీపపు గుడ్డి వెలుగులో ఒకావిడ విస్తరాకులు కుడుతోంది. ఆవిడ




స్వామి తల్లి అని ఆమె ధరించిన తెల్లని బట్టలే చెబుతున్నాయి. భర్త పోయినపుడు ఏర్పడ్డ కన్నీటి చారికలు ఇంకాఆరనన్నా లేదు. అయినా కడుపుకింత సంపాదించు కోడానికి దుఃఖాన్నీ, కష్టాన్నీ కడుపులో దాచుకోక తప్పడంలేదు!

ఓ మంచం ఆరుబయట వేసి కూర్చో మని చెప్పి కాఫీ తెచ్చిచ్చి స్నానం చేసొస్తానని చెప్పి కాలువవైపెళ్ళాడు స్వామి.

అన్ని ఇళ్ళల్లోనూ సందడి అప్పుడే లిసోంది. కొంపరప్పుడే తాగినట్టున్నారు ఏదేదో పేలుతున్నారు. ఎక్కడో ఎవరో దెబ్బలాడుకుంటున్నారు. పిల్లలు ఏడుస్తున్నారు. గిన్నెలూ, కుండలూ పోట్లాడు కొంటోంటే తల్లులెవరో శపిస్తున్నారు. ఫాక్టరీ పొగ ఆ ఇళ్ళపైన నల్లని మేఘాల్లా తిరుగుతున్నాయి. కుళ్ళు కాలువ దుర్గంధం ముక్కుపుటాలకి పరీక్షపెడు తూనే వుంది. ఎవరో ముసలాయన పది నిమిషాల్నుండి ఖళ్ళు ఖళ్ళుమని దగ్గుతూనే వున్నాడు విరామరహితంగా....

స్వామి వచ్చేవరకూ ఆలోచిస్తూనే వున్నాడు రవి.

ఇద్దరూ భోంచేసి వచ్చి కూర్చున్నారు.

"వూఁ...చెప్పురవీ! మన సంఘం ఎలా వుంది? జార్జి ఏంచేస్తున్నాడు? కాలేజీలో ఇంకేమైనా మార్పులొచ్చాయా? క్లాసులెలా జరుగుతున్నాయ్?"

రవి నోరు పెగల్లేదు. తల దించుకున్నాడు. స్వామి రెట్టించేసరికి "ఆ గొడవకేంగాని మీ ఫాదర్‌కి అసలెలా యాక్సిడెంట్ జరిగింది? ఫాక్టరీ వాళ్ళు నష్టపరిహారమేమీ ఇవ్వలేదా?"

"వూహూ. టెక్నికల్‌గా ఆ ప్రమాదానికి తమకేం బాధ్యత లేదన్నారు. రిటైరైనప్పుడిచ్చే గ్రాట్యుటీ వగైరాలూ ఇన్సూరెన్సు సొమ్మూ వచ్చింది. ఫాక్టరీలో ప్రమాదంజరిగి మరణించినందున నాకు వుద్యోగం ఇచ్చారు"

కొంచెంసేపు మౌనంగా వుండి పోయారు ఇద్దరూ.

కాలేజీ విషయాలవీ మాట్లాడుకుని పడుకున్నారు.

ఒక రాత్రికాడ మెలుకువ వచ్చింది రవికి. పక్కన స్వామి లేడు. లోపల్నుంచి ఏవో మాటలు వినవచ్చాయ్.

"...ఇంతవరకూ కుట్టింది చాల్లేగాని ఇక పడుకోమ్మా." అంటున్నాడు స్వామి.

"ఇంత పసి వయస్సులో కుటుంబ భారం నీమీదపడితే చూస్తూ ఎలా ఊరుకోనురా"

"అలా మాట్లాడొద్దమ్మా ... నువ్వూ లేకపోతే మేం దిక్కులేని పక్షులైపోతాం"

"హుఁ...నువింకా ఏదో చదివి మంచి వుద్యోగానికెళతావని నేనూ, మీ నాన్నా ఎన్ని కలలుగన్నాంరా...ఎంత మురిసిపోయాం! కానీ ఆ మాయదారి దేవుడు మా కలల్ని కాళ్ళతో తొక్కేసి నిన్నీ మురికి కూపంలోకి తోసేస్రా. మీ నాన్నలాగే నువ్వూ అవే బట్టలేసుకుని, అదే కారేజీ పట్టుకుని, అదే ఫాక్టరీకెళుతోంటే ఏదో భూతం నోట్లోకెళుతున్నట్లుగా వుందిరా బాబూ"

"అలాగనకమ్మా ... ఎప్పటికీ కాలం ఇలాగే ఉండిపోదు. ఇంక పడుకోమ్మా"

"ఆదమరచి నిద్రపోతోన్న ఆ పసికూనల్ని చూస్తోంటే కంటిమీదకి కునుకు ఎలా వస్తుందిరా నాకు''

''నా ఎముకల్ని ముక్కలు చేసుకునైనా వాళ్ళ భవిష్యత్తు తీర్చిదిద్దుతానమ్మా"

"అందుకేరా నా బాధ. నీ సుఖాన్నీ,





నీ బతుకునీ వాళ్ళకోసం ధారబోస్తావు. అందులో నీకు తృప్తి వుందేమోగాని కన్న తల్లిని నాకెలా వుంటుందిరా"

"విస్తర్లు కుడుతూ నాకు సాయపడుతూనే వున్నావుకదమ్మా. మనకీ మంచి రోజులు వస్తాయమ్మా. ఇంక పడుకోమ్మా"

నిట్టూర్పిన శబ్దం.

"నాకు నిద్రపడితేకదుట్రా పడుకోడానికీ. నేను పడుకుంటేగాని. నువ్వు పడుకోవు. సరే నే పడుకుంటానుగాని నువ్వెళ్ళి పడుకోరాబాబూ...మళ్ళీ ఫాక్టరీ కూతేస్తుంది"

స్వామి వచ్చి రవి పక్కనే పడుకున్నాడు. రవికి చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు!

ఇంతలో దద్దరిల్లేలా ఫాక్టరీ కూత వెయ్యడంతో వులిక్కిపడి లేచాడు రవి. అప్పటికే స్వామి యూనిఫాం తొడుక్కుని కేరేజీ సిద్ధం చేసుకుంటున్నాడు.

"లేచి మొహం కడుక్కో రవీ కాఫీ తాగుదువు గానీ"

మొఖం కడుక్కుని కాఫీ తాగుతోండే టైమైపోయిందంటూ శలవు తీసుకునెళ్ళిపోయాడు స్వామి.

వాళ్ళమ్మగార్తో చెప్పి తిరుగు మొహం పట్టాడు రవి.

"రేపటితో శలవులైపోతాయినాన్నా! ఎల్లుండి కాలేజీకెళ్ళాలి" అన్నాడు రవి భోజనాలయ్యాక – ఇంటిల్లిపాదీ హాల్లో చేరి కష్టం సుఖం చెప్పుకొంటోంటే.

"అప్పుడే శలవులైపోయాయా?" రామయ్యగారన్నారు.

"అయిపోయాయి. టెర్మ్ ఫీజూ, పరీక్ష ఫీజూ కట్టాలి. దాదాపు రెండు వందలు కావాలి"

ఆయన మాట్లాడలేదు. దీర్ఘంగా

ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయారు.

"నీకు తెలీందేవుందిరా అబ్బాయ్. చేలు దోమ పోటుకి పాడై పోయాయి. వచ్చిన పంట కూలి ఖర్చులకి చాల్లేదు. ఎక్కడదప్పులక్కడే వున్నాయి. దాళ్వాకి పెట్టుబడి ఎలాగా అని ఇదైపోతున్నారు మీ నాన్న" శాంతమ్మ అంది.

కొడుకు మొఖం బాధతో అవనత మవడంచూసి "నువ్వేం బెంగెట్టుకోకురా పిచ్చినాన్నా. ఎలావోలా సర్దుబాటు చేస్తార్లే. దాళ్వా పంట సరిగ్గా పండితే కష్టాలన్నీ తీరిపోయినట్లే" అంది.

ఆశ మనిషిని ముందుకి నడిపిస్తుంది. భవిష్యత్తుపై మరిన్ని ఆశలు కల్పిస్తుంది మరి!

రవిమాత్రం ఆవిశ్యా సరిపెట్టుకోలేక పోయాడు.

ఎండనక వాననక పొలాల్లో పనిచేసే రైతు ప్రకృతి వైపరీత్యానికో మరోదానికో మరోదానికో ప్రతిఏటా దెబ్బతినాల్సిందేనా? రోజురోజుకి కృంగిపోవాల్సిందేనా? రాజనాలు పండించేవాడు భోజనానికేలేని పరిస్థితిలో మగ్గాల్సిందేనా? దీనికంతం లేదా?

తమ ఆర్థిక పరిస్థితి ఇప్పుడే ఇలా వుందే రేపు తను మెడిసిన్లో చేరితే? అడుగడుగునా ఆర్థిక ఇబ్బందులకు గురవుతూంటే చదువుమీద ఏకాగ్రత కుదుర్తుందా?

కలతనిద్ర పోయాడా రాత్రి.

రామయ్యగారు అప్పుకోసం చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఇంట్లోని బంగారమంతా మార్వాడీ దగ్గరే వుంది. వ్యవసాయ పెట్టుబళ్ళకోసం నగల్ని తాకట్టుపెట్టడం, పంటవొచ్చేక వదిలించుకోవడం, మళ్ళీ సీజన్లో మళ్ళీ పెట్టుకోవడం రైతు కుటుంబాల్లో మామూలే. కానీసారి సార్వాపంట దెబ్బతినడంతో బంగారాన్ని వదిలించలేకపోయారు.

ఇక ఇంట్లో మిగిలిన తాకట్టుపెట్టుకునే వస్తువు శాంతమ్మ తాళిబొట్టు మాత్రమే.

పసుపుకొమ్ము కట్టుకుని అదే ఇచ్చిందావిడ.

అది అందుకుంటోంటే రవి కళ్ళలో కన్నీటి అల భళ్ళున పగిలింది!

* * *

ప్రభావతీ. ఆమె అక్క శారదా హాలులో కెళ్ళడం టీస్టాల్ దగ్గర నిలబడి టీ తాగుతోన్న రోమియో చూశాడు.

అవాళామె గపీ, ప్రకాష్‌లతో కలిసి తననవమానించేక రోమియో ఆడపిల్లల వెంటబడటం కొంచెం తగ్గించాడు. కాస్త లోకువగా కన్పించిన అమ్మాయిల వెంట మాత్రమే పడుతున్నాడు.

ఇక ప్రభావతిని పూర్తిగా తప్పించుకుని తిరుగుతున్నాడన్నమాటే గాని ఆమె అంటే పీకల్దాకా కోపం వుందతడికి. ఎప్పుడో అప్పుడు ఆమె నవమానించి అంతకంతా బదులు తీర్చుకోవాలని సమయంకోసం ఎదురు చూస్తున్నాడు.

కసి తీర్చుకోడానికిదే మంచి సమయం అన్పించింది. ఈ అవకాశాన్ని చేజారిస్తే—పరీక్షల కింకెంతో వ్యవధి లేనందున మళ్ళీ చిక్కదన్పించింది.

టీ తాగేక సిగరెట్టు వెలిగించాడు.

సినిమా హాలుపైనున్న లైటు ఆరింది. అంటే సినిమా మొదలయ్యిందన్న మాట.

సిగరెట్టు పడేసి టిక్కెట్టు తీసుకుని లోపలికి నడిచాడు. గుమ్మందాటి కళ్ళు చీకటి కలవాటుపడే వరకూ నిలబడ్డాడు.

ప్రభావతి వాళ్ళు కూర్చున్న కుర్చీల వెనుక వరుసలో కుర్చీలు ఖాళీగా వుండటం చూసి మహదానందపడ్డాడు.

మెల్లగా పిల్లిలా వెళ్ళి సరిగ్గా ప్రభావతి కూర్చున్న కుర్చీ వెనుకనున్న కుర్చీలో కూలబడ్డాడు. సినిమా చూడ్డంలో నిమగ్నమైన ఆమె అతణ్ని గమనించలేదు.

కుర్చీలో కిందకి జరిగి కూర్చుని తన కాళ్ళని ప్రభావతి కాళ్ళకితాకించాడు.

ఆమె వెనుదిరిగి చూసి "ఏ మిస్టర్" అని కసిరింది.

తన మొఖం ఆమెక్కన్పించకుండా తలదించేసుకున్నాడు.

మరికొన్ని నిమిషాల తర్వాత మళ్ళీ కాళ్ళు తాకించసాగాడు.

తిన్నగా కూర్చోలేకపోయిందామె. లేచి "నీకు బుద్ధిలేదా?" అంది గట్టిగా. అతణ్ని గుర్తుపట్టేసరికి ఆమె ఒళ్ళుమండి పోయింది. "ఈసారి అలాటి వెధవ్వేషాలేశావంటే పోలీస్ కంప్లెయింట్ ఇస్తాను జాగ్రత్త"

నిర్లక్ష్యంగా నవ్వేడతడు.

''వూరుకోవే.అంతా ఇదేచూస్తున్నారే'' కంగారుపడుతూ అందామె అక్క.

ఇక తనజోలికి రాడులేఅనుకుందామె. కాని కుక్కతోక వంకర ఎన్ని చేసినా పోదని వెంటనే గ్రహించక తప్పలేదు. అతడు మరింత తెగించి తనకాళ్ళని ఆమె లంగాలోకి పెట్టి మరీ కాళ్ళని తాకసాగాడు.

విసురుగా లేచి బయటికి నడిచింది ప్రభావతి.

తిన్నగా మేనేజర్ రూమ్‌లోకెళ్ళి అతడ్తో చెప్పింది. ఆవూరికి కొత్తగా వచ్చిన యస్సై అప్పుడక్కడే వున్నాడు.

"ఈ న్యూసెన్స్ ఈ వూళ్ళో కూడా వుందా? వాడిపని నేను పడతాను. మీరు నిశ్చింతగా సినిమా చూడండి" అన్చెప్పేడు.

ప్రభావతి హాల్లోకెళ్ళి కూర్చుని సినిమా చూడసాగింది.

ఆమె బయటికెందుకెళ్ళిందో తెలీక ఇదై పోతున్న రోమియో ఆమె ఒంటరిగా తిరిగొచ్చేసరికి హాయిగా గాలి పీల్చుకుని మళ్ళీ తన కార్యక్రమంలో పడ్డాడు

కేవలం కాళ్ళుతాకించి ఏడ్పించడమే అతడి వుద్దేశం కాదు. ఇంకా ఘోరమైన అవమానంపాలు చెయ్యాలి. అంటే ఆమె జడ కత్తిరించడమో, జాకెట్టు కత్తిరించడమో చెయ్యాలి. అందుగ్గాను బ్లేడు ముక్కరెడీగా పెట్టుక్కూర్చున్నాడు.

ఇంతలో తన పక్కనో కొత్త వ్యక్తి వచ్చి కూర్చోవడంఅతడు గమనించలేదు. కాళ్ళతో ప్రభావతి లంగాని లాగుతూనే బ్లేడు రెడీ చేసుకున్నాడో లేదో గబుక్కన అతని చేయిపట్టుకుని బూటు కాలితో అతడి కాళ్ళని తొక్కాడు పక్కన కూర్చున్న వ్యక్తి.

వూహించని పరిణామానికి అదిరిపోయి కెవ్వుమన్నాడు రోమియో.

ఆవ్యక్తి గబగబా రెండు వుతికి బయటికి లాక్కుపోయాడతణ్ని.

అందరూ ఆశ్చర్యంగా చూశారు. అతడు యస్సై అని తెలిసి మరీ ఆశ్చర్య పడ్డారు. ఆ పిమ్మట తగిన శాస్తి చేసి నందుకెంతో ఆనందించారు.

యస్సై రోమియోని స్టేషన్‌కి తీసికెళ్ళి నాలుగు ఉతికి మర్నాడు వదిలేశాడు.

అక్కడక్కడా రక్తపు మరకల్తో నడవలేని పరిస్థితిలో రిక్షాలో ఇంటికెళ్ళిన రోమియో మళ్ళీ ఎన్నడూ ఆడపిల్లల వంక కన్నెత్తి చూసిన పాపాన పోలేదు.




* * *

విద్యార్థులకి పరీక్షల జ్వరం వచ్చేసింది. పరీక్షలకింక నెలరోజుల వ్యవధి కూడా లేదుమరి!

చాలా క్లాసులకి కోర్సులు పూర్తవ్వ లేదు. అవి ఇంపార్టెంటు కాదని కొందరంటే, ఛాయిస్‌లో పోతాయిలే అన్నారు మరికొందరు లెక్చరర్లు. ఇంకొందరు ప్రైవేటు క్లాసులు పెట్టి అయ్యిందన్పించి చేతులు కడిగేసుకున్నారు.

ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చెయ్యడంతో పరీక్ష పరీక్ష అని భయపడుతూ నోట్సులూ, గైడ్లూ నమలకుండా మింగేస్తున్నారంతా.

రవీ, మరికొందరూ గోదావరి ఒడ్డు నున్న తోటల్లోకెళ్ళి శ్రద్ధగా చదువు కుంటున్నారు. ఇంచుమించు కాలేజీ స్టూడెంట్లంతా రాత్రుళ్ళ శారదా టాకీసు దగ్గరి భాషా టీ స్టాల్లో వేడివేడి టీ తాగి వెళ్ళి మరీ చదివేస్తున్నారు. కళ్ళు మూసుకుని కంఠస్తం చేస్తున్నారు.

ఎప్పటికప్పుడు శ్రద్ధగా చదువుకునే రవిలాంటి విద్యార్థులకూడా పరీక్షలంటే కంగారుగా అలజడిగా వుంటోంది. ఇన్నాళ్ళూ బాగా చదివుండొచ్చుగాక. కాని వారి ప్రతిభకది గీటురాయి కానే కాదు. చదివినా చదవకపోయినా పరీక్షల్లో బాగా రాసినవాణ్ణే తెలివైన వాడంటుంది పరీక్షా పద్ధతి. ఏ కారణం చేతనైనా అప్పుడు సరిగ్గా రాయలేకపోతే వాళ్ళు తెలివిహీనులకిందే లెక్క!

అందుకే అవంటే అందరికీ భయం!

రవి హాల్‌టిక్కెట్ తీసుకోడానికెళ్తే ప్రభావతి కన్పించింది. ఆమె ఎంతో చిక్కినట్లన్పిస్తేనూ అదే అన్నాడు "రాత్రీ పగలూ చదివేస్తున్నారేవిటి అంతలా చిక్కిపోయారు"

"అదేంకాదండీ. కాని నా భవిష్యత్తుని నిర్దేశించే పరీక్ష ఇదేకదా. ఫస్టియర్లో బోటనీ, కెమిస్ట్రి పేపర్లు కఠినంగా ఇవ్వడంతో ఎక్కువ మార్కులురాలేదు. ఇప్పుడు బాగా పికప్ చెయ్యాలి. కనీసం ఫస్ట్‌క్లాసైనా వస్తే మెడిసిన్‌కి ట్రైచెయ్యొచ్చని ఆశ" అంది సీనియర్ ఇంటర్ చదువుతోన్న ఆమె.

"అదీ నిజమేననుకోండి. కాని మన ఆరోగ్యం కూడా చూసుకోవాలిగా"

"ఏం ఆరోగ్యం లెండి. అసలు సరిగ్గా నిద్రే పట్టడం లేదు. పరీక్షలయ్యేవరకూ తిన్నగా అన్నం కూడా తిన్లేం" అని నవ్వి, "మీ చదువెలావుంది? ఫీల్డ్ స్టడీ కెళ్తున్నార్టగా" అంది.

"ప్రశాంతంగా వుంటుందనలా తోటల్లోకెళ్ళి చదువుకుంటున్నామండీ"

"విష్‌యూ గుడ్‌లక్"

"థాంక్యూ. సేమ్‌టూయూ"

* * *

పరీక్షలు మొదలయ్యాయి.

మొదటిరోజు పరీక్ష చాలా సంతృప్తికరంగా రాశాడు రవి. పరీక్ష హాల్లోంచి బయటికొచ్చాడో లేదో ఎలా రాశావంటూ అడిగాడో క్లాస్‌మేట్.

"బాగారాశాను. నువ్వు?"

"నేను దున్నేశాను. నేను కంఠస్త పట్టిందే పది ప్రశ్నలు. అందులో ఆరొచ్చాయి. ఆరూ గైడ్లో ఎలావుందో అలా పేపర్ మీద దించిపారేశాను" గర్వంగా అన్నాడతడు.

నిరుత్తరుడయ్యాడు రవి.

తను పుస్తకమంతా చదివి అడిగిన ఆరు ప్రశ్నలకి జవాబురాశాడు

అతడు కొన్నే చదివినా అన్నే రాశాడు. నిజానికి తనకన్నా అతడే బాగా రాసి వుండొచ్చు చదివింది కొద్దేగనుక. మరి తన కష్టమంతా బూడిదలో పోసిన పన్నీరేనా?

దార్లో ప్రకాష్ కలిశాడు. ఎవరెలా రాసిందీ కనుక్కుంటూ కాలేజీ గేటు దాటుతోంటే గేటు ముందు కాలరెగరేసి సైకిళ్ళ మీద కూర్చుని పోజులు కొడుతున్న శేషగిరీ అతడి మిత్ర బృందమూ అన్నారు వాళ్ళవంక వ్యంగ్యంగా చూస్తూ "కొందరు పాపాత్ములు రాత్రీ పగలూ కష్టపడి చదివి పాసవుతారు. మన్లాటి పుణ్యాత్ములు కించిత్తు శ్రమ పడకుండా క్లాసుతో పాసైపోతూంటాం"

"కాపీరాయుళ్లు!" గొణిగాడు ప్రకాష్.

"కాలేజీల్లో కూడా కాపీలా?"

చిత్రంగా చూశాడు రవి వంక.

"మరేమనుకున్నావ్? కాపీలూ, మాల్ ప్రాక్టీసూ వగైరాలిక్కడే ఎక్కువ. ఈ పోజులరాయుళ్ళంతా కష్టపడి చదివి పాసవుతున్నారనుకున్నావా? అదేంకాదు చిట్టితండ్రీ. వీళ్ళు పబ్లిక్ కాపీయిష్టులు. వీళ్ళని బలపరిచే లెక్చరర్లున్నారు. వాళ్లు వీళ్ళని కాపాడుతుంటారు. కొరుకుడుపడని లెక్చరర్ల కోసం సాయుధులై వస్తూంటారుకూడా. కొందరు లెక్చరర్ల ఇంటికెళ్ళి మరీ ఒదిరించి వస్తారు. అంచేతెవరూ వీళ్ల జోలికి రారు. ఇంకో రకం కాపీయింగు వుంది. దానిని లెక్చరర్ల హెల్ప్ అంటారు. ట్యూషన్లు పెట్టుకున్న స్టూడెంట్లకి వాళ్ళ వాళ్ళ లెక్చరర్లు స్లిప్‌లందిస్తూంటారు. మీ సైన్స్ సబ్జక్టుల్లో అయితే ప్రాక్టికల్స్‌కొచ్చే ఎక్స్‌టర్నల్ ఎగ్జామినర్స్‌ని కాకా

పట్టి హెచ్చు మార్కులేయిస్తుంటారు. అలా అన్నివిధాలా సాయపడేవాళ్ళ దగ్గరికే ఎక్కువగా ట్యూషన్స్ కెళ్తూం టారు"

"ఉన్నత విద్యలో ఇలాటివి జరగడం చాలా ఘోరం"

"ఇంతేకాదు. పరీక్షలయ్యాక ఆన్సర్ షీట్లు తగిలించడాలూ, యూనివర్శిటీకెళ్ళి మార్కులేయించడాలూలాటి సర్కస్ ఫీట్లు చాలా వున్నాయి"

"వీటివల్ల నిజంగా నష్టపోయేది బాగా చదివే విద్యార్థులే"

"అవునంతేమరి. ఎవరివి నిజంగా మార్కులో, ఎవరివి అబద్ధం మార్కులో ఎవరికీ తెలీదుకదా. ఇలాటి కారణం వల్లే ఇదివరకో యూనివర్శిటీ గ్రాడ్యుయేట్లు మా ఉద్యోగాల కనర్హులంటూ ప్రకటిం చిందో సంస్థ"

ఆదేరోజు పేపర్లో 'ఏలూర్లో యస్సెస్సీ పరీక్షలు రాస్తోన్న నకిలీ అభ్యర్థులు' అన్న శీర్షికకింద దొంగ హాల్‌టిక్కెట్లతో తెనాలి కేంద్రంగా పనిచేస్తోన్న ఓ ముఠా అసలు అభ్యర్థులొక్కొక్కరి దగ్గిరా సుమారు మూడేసివేలు తీసుకుని నకిలీ అభ్యర్థులచేత పరీక్షరాయిస్తూండగా పట్టు బడ్డారంటూ ఓ వార్త ప్రచురించారు.

అది చదివిన విద్యార్థులంతా 'ఔరా!' అని ముక్కుమీద వేలుంచుకోకుండా వుండలేకపోయారు!

* * *

పరీక్షల ఘట్టం ముగిసింది. గుండెల మీంచి పెద్ద బరువు తొలగినట్లు రిలీఫ్‌గా వుంది.

వరుసగా రెండ్రోజులు నిద్ర పోతే గాని అలసట తీరలేదు రవికీ, ప్రకాష్‌కీ.

హాస్టల్ ఖాళీచేసి వెళ్తూ "నెక్స్ట్ఇయర్ కలుద్దాం" అన్చెప్పేడు ప్రకాష్. రవి కూడా సామాను సర్దేసుకుని మేనత్త ఇంటికెళ్ళాడు చెప్పి వద్దామని.

"పరీక్షలు బాగా రాశావా రవీ" కుటుంబరావుగారడిగారు. తలూపాడు.

"మేం మీ పిల్లల్లా మొద్దులంకాదు అత్తెసరు మార్కుల్తో పాసవ్వడానికి. మా రవికి ఫస్ట్‌క్లాసొచ్చి తీరుతుంది" అంది అత్తయ్య నవ్వుతూ.

"హాస్టల్ ఖాళీ చేసెయ్యాలి కాబోలు. రెండ్రోజులు మా ఇంట్లో వుండెళ్ళు రవీ"

"ఇంటికెళ్ళి చాన్నాళ్ళయ్యిందీ మావయ్యా. అయినా మళ్ళీ రెండు నెలల్లో వచ్చేస్తానుగా"

"అదీ నిజమేలే. పోనీ భోంచేసెళ్ళు"

కాదనలేకపోయాడు.

భోంచేసి హాస్టల్‌వైపెళ్ళోంటే ఒకింట్లోంచి ఎవరో పిలిచినట్టన్పించి అటు చూశాడు.

గేటులో నిలబడి చేతులూపుతోన్న ప్రభావతిని వెంటనే పోల్చుకోలేక పోయాడు. చిక్కిశల్యమైందామె. ప్రేత కళ ఆవరించినట్లుగా పీక్కుపోయిందామె మొఖం!

"అదేవిటలా అయిపోయారు?" ఆందోళనగా అడిగాడు.

నవ్వింది గుండెల్ని పిండేలా.

"రండి వెళ్దురుగాని. పరీక్షలు బాగా రాశారా?"

"రాశానండీ. మీరు?"

అటుతిరిగి కళ్ళుతుడుచుకుంది పైట కొంగుతో.

"ఎగ్జామ్స్ రాయలేదండీ" దాదాపు ఏడ్చేస్తూ అంది.

"ఏమండీ?"

"టైఫాయిడ్ వచ్చింది"

"మైగాడ్!" డీలాపడిపోయాడు.

"మీరంటూనే వున్నారు ఆరోగ్యం జాగ్రత్తని. ఏమిటో పిచ్చి. ఎక్కువగా చదవకుండా వుండలేకపోయాను. సరిగ్గా పరీక్షలు మొదలయ్యేసరికి జ్వరం వచ్చేసింది. అలాగే వచ్చి రెండు పేపర్లు రాశాను. ఆ తర్వాత..."

"అయ్యో!" ఇంకేమనాలో, ఎలా ఓదార్చాలో తెలీలేదు.

ఎంత తెలివైనదైతేనేం,ఎంతచదివితేనేం పరీక్షకి హాజరవ్వకపోతే ఫెయిలైనట్టే లెక్క! ఒక్క ఏడాది వృధా అయిపోతుంది...

"కనీసం ఎగ్జామ్‌కి అటెండవ్వగలిగితే బాగుండేదండీ. ఎలా లేదన్నా యాభై శాతం మార్కులొచ్చేవి. మెడిసెన్ ఎంట్రటన్స్‌కి కూర్చోడానికి ఎలిజిబిలిటీ వచ్చేది. ఇప్పుడు...ఇన్నాళ్ళూ చదివిందంతా వేస్ట్. ఒన్ఇయర్ గేప్"

మళ్ళీ కన్నీటికెరటం పగిలిందామె కళ్ళల్లో.

గుండెల్లో గునపాలు గుచ్చుకున్నంత బాధగా వుంది రవికి. ఆమెనెలా ఓదార్చాలో తెలిక ఏదేదోచెప్పి వచ్చేశాడు.

ఒకవేళ వచ్చే ఏడాది పరీక్షల్లో తనకీ అలాగే జరిగితే?

ఆ వూహకే కంపించిపోయాడు రవి.

* * *

మే నెల.

ఎండలకీ, మల్లెలకీ, పెళ్ళిళ్ళకీ సీజన్.

రవి వాళ్ల అమ్మమ్మగారి వూళ్ళోని బంధువులింట పెళ్ళికెళ్ళమన్నారతణ్ణి. చిన్నప్పుడు కొన్నాళ్ళక్కడ పెరిగిన వాడవడంతో వుత్సాహంగా బయల్దేరాడు.

భీమవరం దగ్గరుందావూరు. వూరికి కొత్తగా కాలేజీ, సినిమాహాలూ అవీ రావడంతో పల్లెవాసన వొదిలి పట్నంరంగులూ హంగులూ పులుముకుంటోందావూరు.

పెళ్ళి ఆడంబరంగానే చేశారు. కాని రవికి బాధవేసింది. అప్పులుచేసి మిథ్యా విలువలకీ, లేనిపోని గొప్పలకీ తయారవుతున్నంతకాలం మధ్యతరగతివాళ్లు ఆర్థికంగా నిలదొక్కుకోలేరన్పించిందతడికి.

చిన్ననాటి నేస్తాలతో కలిసి తోటల్లో తిరిగాడు. ఎన్నెన్నో కబుర్లు చెప్పేడు' చెప్పించుకున్నాడు.

అమ్మమ్మగారి వూరునుంచొచ్చిన రవికి "శివయ్య మేస్టారబ్బాయి కలెక్టరవుతాడంట" అని చెప్పేరు వూళ్ళోవాళ్ళు గొప్పగా.

శివాజీ వచ్చేడు కాబోలనుకుని మేస్టారింటికేసి నడిచాడు రవి. దారిలోనే ఎదురయ్యారాయన.

"శివాజీ వచ్చేడా మాస్టారూ?"

"వచ్చాడోయ్! పరీక్షలు చాలా బాగా రాశాట్ట. యూనివర్శిటీ రాంక్ కూడా రావొచ్చనుకుంటున్నాం."

"తప్పకుండా వస్తుందండీ. శివాజీ చాలా ఇంటెలిజెంట్"

"అవునవును. అన్నట్టు ఐ.ఏ.యస్. పరీక్షకెళుతున్నాడోయ్. మొన్ననే అప్లై చేశాడు. వాడి తెలివితేటల్ని బట్టి చూసినా, జాతకరీత్యా చూసినా కలెక్టరవడం ఖాయం. అయినా మానవప్రయత్నం చేయాలి కదాని ఓ పనిమీద వెళ్తున్నాను. ఇప్పుడే వస్తాను...నడుస్తూండు. శివాజీ ఇంట్లోనే వున్నాళ్ళే" అనేసి పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ వెళ్ళిపోయారు మాస్టారు.

"సువ్వా రవీ! రా రా. ఎగ్జామ్ బాగా రాశావా?'' చదువుతోన్న పుస్తకం పక్కనబెట్టి ఆహ్వానించాడు శివాజీ.

''బాగానే రాశాను మీరూ బాగా రాశార్టగా మాస్టారు చెప్పేరు. ఐ.ఏ.యస్. కెళుతున్నారగా. చాలా సంతోషంగా వుంది. మీరు తప్పకుండా సెలక్టవుతారు"

"చాలా టఫ్‌గా వుంటుందన్నారు ఇదివరకు రాసినవాళ్లు. అందుకని అన్ని రకాల పుస్తకాలూ ఇప్పట్నుంచే చదివేస్తున్నాను. కానీ కోచింగ్ తీసుకుంటే మంచిదనిపిస్తోంది."

"అయితే తప్పకుండా కోచింగ్ తీసుకోండి"

"చాలా ఖర్చవుతుంది ఫీజులకీ వాటికీ. దగ్గర దగ్గర మూడ్నాలుగువేలు కావాలి ఢిల్లీలోనో, మద్రాసులోనో కోచింగ్ తీసుకోడానికి."

అదీ ఇదీ మాట్లాడుతోంటే మాస్టారొచ్చి వుస్సూరంటూ కూలబడ్డారు వాలు కుర్చీలో.

మంచినీళ్లు తెచ్చిస్తూ - "వెళ్లిన పనేమయ్యిందండీ. కాయా, పండా?" అనడిగిందాయన భార్య.

"పుర్రచెయ్యి చూపించేడు" అన్నారు కందగడ్డలా మొఖం పెట్టుకుని.

"ఎవరు మాస్టారూ?" రవి అడిగాడు.

"ఇంకెవరూ సింహాచలంగారు. మా వాడి చదువుకోసం ఆయనదగ్గర అప్పుడప్పుడూ చేసిన అప్పు నాలుగువేలవరకూ వుంటుందిలే. అది కక్కితే మళ్లీ అప్పిస్తాడట. లేకపోతే ఇవ్వలేడుట. వూరొదిలి పారిపోతాననుకుంటున్నాడు కాబోలు. మా వాడు రేపు కలెక్టరయితే రెండునెలల జీతమంత వుండదు ఆయన అప్పూ వడ్డీ కలిసి. ఏవిటో...ఊరికే ఇచ్చేస్తున్నట్టు నీలుగుతున్నాడు" అక్కసుగా అన్నారు.

నిట్టూర్చిందాయన భార్య. "సెంటు భూమిలేని మనల్ని నమ్మి ఆమాత్రం అప్పు ఇవ్వడమే ఘనం మరి."

"చాలుచాల్లే-పెద్ద చెప్పొచ్చావ్. నేను గట్టిగా తలచుకుంటే ఆ అప్పో లెక్కా?"

"అలా అనే ఇంత చేశారు" లోపలికెళ్లిపోయిందావిడ.

"ఇదయ్యా వరస. బంగారపు పళ్లెనికయినా గోడవార కావాలని సామెత. ఎంత తెలివయినవాడికయినా కోచింగుంటే మరి తిరుగుండదని చూస్తే డబ్బు సర్దుబాటయ్యే పరిస్థితి కనిపించడంలేదు. ఇందుకేనోయ్ వున్నవాళ్లు తప్ప మిగతావాళ్లు పెద్ద ఉద్యోగాలకెళ్ళలేకపోతున్నారు"

"పోనీలే. ఇంటికాడ ప్రిపేరవుతానులే" శివాజీ అన్నాడు.

"నువ్వేం అధైర్యపడకురా. తల తాకట్టు పెట్టయినాసరే డబ్బు సమకూరుస్తాను" అని ఆలోచనలో పడ్డారు మాస్టారు - తన తల తాకట్టు పెట్టుకునేవాళ్ళెవరా అని.



## 5

కాలేజీలు తెరిచారు.

రవి ఫీజుకట్టి సీనియర్ ఇంటరులో చేరాడు.

హాస్టల్లో సీటివ్వరేమోనని భయపడ్డాడుగాని ఎలాటి అభ్యంతరమూ పెట్టకుండా ఇచ్చారు.

ఈసారి రూమ్మేట్స్‌లో డేవిడ్ తన క్లాస్‌మేటే. రెండోవాడు కాంతారావు. ఫైనల్ బి.కాం. వెలగబెడుతున్న అతడికి సినిమా పిచ్చి జాస్తి. రిలీజయిన ప్రతి సినిమా చూడటమే కాదు ఎప్పటికయినా ఎలాగయినా సినిమా నటుడవ్వాలన్నది అతడి ఆకాంక్ష.

ప్రకాష్ తన రూమ్‌కి నాలుగురూములవతలి రూమ్‌లో వుండటంతో ఇద్దరి స్నేహం మరింత గట్టిబడింది.

ఇంతలో కొత్తగా కాలేజీలో చేరుతున్న విద్యార్థుల్నుంచి డొనేషన్లు వసూలు చేస్తున్నారన్న వార్త దావానలంలా వ్యాపించింది.

కాలేజీల్లో ప్రవేశానికి పోటీ ఎక్కువవడంతో ప్రతిచోటా కూడా ఆ అవకాశాన్నుపయోగించుకోవాలన్న స్వార్థం ప్రైవేటు కాలేజీల మేనేజిమెంట్లలో బాగా చోటుచేసుకుంది. కొత్తభవనాల నిర్మాణానికా సొమ్ము వినియోగిస్తామని చెబుతూండటంతో ప్రభుత్వం కూడా వాటిని చూసీ చూడనట్టూరుకొంటోంది. నిజానికి చాలా కాలేజీల వెనుకనున్న అదృశ్యహస్తాలు అధికార పార్టీ నాయకులవే!

ఇంతలో ఇంటర్మీడియట్ పరీక్షా ఫలితాలొచ్చాయి.

ఆ కాలేజీలో మొత్తం మూడువందల మంది ఆ పరీక్షకు హాజరవ్వగా 23 మంది ఫస్ట్‌క్లాసులోనూ, 61 మంది సెకండ్‌క్లాసులోనూ, 102 మంది థర్డ్‌క్లాసులోనూ పాసయ్యారు.

కాలేజీకి ఫస్ట్ వస్తాడనుకున్న నరేంద్ర అనే అబ్బాయి పాసవ్వకపోయేసరికంతా విస్తుబోయారు. ఇలా ఎలా జరిగిందో




ఎవరి వూహకీ అందలేదు.

ఎంతో తెలివైనవాడని ఇంటా బయటా ప్రశంసలందే నరేంద్ర పేపర్ చూసి తట్టుకోలేకపోయాడు. కన్నీళ్ళు పొంగి పొరలివచ్చాయ్.

ఒకటో తరగతి నుంచీ కూడా క్లాసు కెల్లా ఫస్టున పాసవుతూ వచ్చేడతడు. ఒకరి జోలికి పోకుండా తనేమిటో, తన చదువేమిటో అన్నట్టుండే అతన్నంతా పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు అంటూ మెచ్చుకునేవారు. అతడి తెలివితేటల్ని చూసి మాస్టర్లూ, లెక్చరర్లూ కూడా అభిమానవర్షం కురిపించేవారు. ఇరుగు పొరుగువారి ప్రశంసలు విని మురిసి పోతూండేవారతడి తల్లిదండ్రులు.

ఎలా లెక్కవేసినా 75శాతం మార్కు లకి తక్కువ రాకూడదు. అటువంటిది మొత్తం పరీక్షే ఫెయిలయ్యేసరికా పసివాడి లేతగుండె భరించలేకపోయింది.

ఇంటికెళ్ళి తల్లిదండ్రులకీ, బంధు మిత్రులకీ మొఖం చూపించడానికి పిరికి తనం అడ్డొచ్చింది. తన గురించంతా చులకనగా హేళనగా మాట్లాడతారనీ, నవ్వుతారనీ అన్పించింది. ఆ నవ్వుల్ని భరించగల శక్తీ, ధైర్యం బొత్తిగా లేవు. అందుకే వెనకా ముందూ ఆలోచించ కుండా గోదావరి వైపు నడిచాడు.

మూడోరోజున గోదావరి దిగువన ఒడ్డుకి చేరిన శవాన్ని చూసి గుండెలు పగిలేలా రోదించారతడి తల్లిదండ్రులు. పుచ్చి చేపలు కొరకగా అసహ్యంగా తయారైన శవాన్ని చూసి మంచి బాలు డన్న మాటకి అర్థంగా భాసిల్లిన నరేంద్రని తలచి వికలిత మనస్కులై కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు జనం.

మరికొన్ని రోజులకి ఇంటర్మీడియట్ బోర్డువారి మహత్మ్యాలు బయటపడ్డాయ్.

పరీక్ష రాయనివాళ్ళు రాసినట్లూ, రాసినవాళ్ళు రాయనట్లూ పేర్లు మార్చీ, సబ్జక్టులు మార్చీ, రకరకాల మార్కులిచ్చీ, నెంబర్లు తారుమారు చేసీ ఎన్నెన్నో అవకతవకలు జరిగినట్లు వార్తలమీద వార్తలు రాసాగాయి.

కంప్యూటర్ లోపమని అధికారులు తప్పుకోజూసినా ఇటు ప్రజలూ, అటు ప్రభుత్వమూ కూడా వూరుకోలేదు. విద్యార్థుల జీవితాలతో ఆటలాడుకుంటారా అంటూ ఆడిపోశారంతా. కడకి ఏ ఫలితాలని నమ్మాలో, ఏ మార్కుల లిస్టుని నమ్మాలో తెలీని అయోమయ పరిస్థితి ఏర్పడింది.

అవన్నీ సవరించి లెంపలేసుకునేసరికి సమయం మించిపోయి నరేంద్రలాంటి ఎందరో పసివాళ్ళ ఎన్నో అఘాయిత్యా లకు పాల్పడ్డారు.

మార్చిన మార్కుల లిస్టు ప్రకారం నరేంద్రకి 82 శాతంమార్కులొచ్చాయని తెలిసి గుండె చెరువుకాని విద్యార్థిగాని, లెక్చరర్ గాని లేరు!

* * *

"నేను కెమిస్ట్రీకి, జువాలజీకీ, బోటనీకీ, పిజిక్స్ కీ, ఇంగ్లీషుకీ ప్రైవేట్లు పెట్టేశాను. క్లాసుకటెండ్ అయినా, అవ్వకపోయినా ఒక్కటే" నిర్లక్ష్యంగా తలెగరేస్తూ రవితో చెప్పేడతడి క్లాస్మేట్ చక్రవర్తి.

"బాపురే. ఒక్క తెలుగుకి తప్ప అన్నిటికీ ట్యూషన్లేనన్నమాట. ఇంక చదువుకోడానికేం తీరికుంటుందండీ"

"నేను 25 శాతం మార్కులకి చదివితే చాలు. మరో 25 శాతం లెక్చరర్లే తెచ్చిపెడతారు. సెకండ్ క్లాస్ ఖాయం"

నవ్వేడతను విజయగర్వంతో.

అతడి భావం అర్థమవడంతో మరేం ప్రశ్నించలేదు రవి.

"మీ ప్రైవేటు నోట్సులోసారి నా కిస్తారా?" ఆశగా అడిగాడు వాళ్ళ సంభాషణ విన్న మరో విద్యార్థి.

"నోట్సులు డిసెంబరు నెలనుంచిగాని చెప్పరు. అప్పుడైనా ఇతరులకిస్తే లెక్చరర్లు కోప్పడతారు"

"అవును మరి. లేకపోతే వాళ్ళబిజినెస్ దెబ్బతినదూ?"

రవి మాటలకి అయోమయంగా చూసెళ్ళిపోయాడు చక్రవర్తి.

"బాగా డబ్బున్న వారబ్బాయి కాబోలు!"

"మీకు తెలీదా? వాళ్ళ ఫాదర్‌కి రెండు రైసుమిల్లులూ, లారీలూ అవీ చాలా వున్నాయి. దొంగనోట్లు అచ్చేసి పైకొచ్చారంటారు" ఆఖరి మాటలు రహస్యంగా చెప్పాడా కుర్రాడు.

"ఆయనే కాదు-చాలామంది ధనికులు అలా పైకొచ్చినవాళ్ళే. అలాటివారి కడుపున బంగారు చెంచా నోట్లో పెట్టుకుని మరీ పుట్టిన చక్రవర్తిలాంటి వాళ్ళకి ఎలాటి డిగ్రీలైనా తేలిగ్గా నడిచొస్తాయ్"

అయోమయంగా రవి వంక చూసి మౌనంగా వుండిపోయాడు.

లెక్చరర్ రాకకోసం కాస్సేపు చూసి వెళ్ళిపోసాగారు క్లాసువాళ్ళంతా.

"ఏమిటోనండీ-ఒక్కరోజూ క్లాసులు సరిగ్గా జరగవు కదా. ఇలా అయితే వాళ్ళేం చెబుతారు, మనమేం చదువుతామండీ?" అన్నాడు ఓ విద్యార్థి ఎంతో బాధగా.

"రానురాను లెక్చరర్స్‌లో క్రమశిక్షణ తగ్గిపోతోంది. విద్యార్థులకాదర్శంగా మెలగాల్సినవాళ్లు బాధ్యతారహితంగానూ, స్వార్థపూరితంగానూ ప్రవర్తిస్తున్నారు. ఈ విషయం గురించి కూడా విద్యార్థులు ఆందోళనచెయ్యక తప్పదేమో"

అదిరిపోయాడా కుర్రాడు. ఆందోళన, సమ్మె మొదలైన పదాలు చెవినపడితే చాలు ముచ్చెమటలు పోస్తాయతనికి. భయం భయంగా రవిని చూస్తూ గబగబా వెళ్ళిపోయాడు పరిగెత్తినట్టు!

నవ్వుకుంటూ క్లాసులోంచి బయటి కొచ్చాడు రవి.

కాస్త దూరంలో జయంత్ కన్పించడంతో తన కోసం వచ్చాడేమోనని ఆగాడు.

ఆడపిల్లలున్న చోటుకల్లా వెళ్ళి పోజులుకొడుతూ లేడీస్ వెయిటింగ్ రూమ్‌ని చుట్టి మరీ వచ్చాడు జయంత్.

టెన్త్‌క్లాసబ్బాయి కాలేజీ అమ్మాయిలకి పోజుకొడుతున్నాడు!

ఔరా కాలమహిమ!

"నువ్విక్కడున్నావా బావా! నీ కోసం కాలేజీ అంతా వెదుకుతున్నాను"

"నేనాడపిల్లననుకున్నావా లేడీస్ వెయిటింగ్‌రూమ్‌లో వుండటానికి?"

"అహ... అదికాదు బావా! కాలేజీ గరల్స్‌కి ఫాషన్లెక్కువంటారుగా అని చూస్తున్నా"

"గొప్ప పనే చేశావులే. చదువు పెరిగే కొద్దీ బుద్ధి వికసిస్తోంది" ఇహ చూస్తూ ఊరుకుంటే లాభంలేదని చురక అంటించాడు.

"నీలాటి పప్పుసుద్దలకి చెప్తేం తెలుస్తుందిలే" విసురుగా అన్నాడు జయంత్-కళ్ళమీద పడుతోన్న జుట్టుని పక్కకి విదిలిస్తూ.

అవాక్కయ్యాడు రవి. వాడి దృష్టిలో





తను ఏమీ తెలీని దద్దమ్మ!

"ఇది హైస్కూలుకాదు నీఇష్టమొచ్చినట్టు మాట్లాట్టానికి. ఇంతకీ ఇదెందుకొచ్చినట్టు?" కాస్త కోపంగానే అన్నాడు.

"అమ్మ నిన్ను అర్జంటుగా తీసుకు రమ్మంది" బుంగమూతి పెట్టాడు.

"నడు...వెళ్దాం."

ఇద్దరూ ఇంటికెళ్ళేసరికి ఇంట్లో అయిదారుగురు ఆడవాళ్లున్నారు. వాళ్ళని తప్పించుకుని లోపలికెళ్లాడు.

ఒక మూల తాటాకుచాపమీద కొత్తగా పైట వేసుకుని కూచ్చునుంది భవానీ. రవిని చూసి సిగ్గుతో తల దించేసుకుంది.

వ్యక్తురాలయ్యిందన్న మాట అనుకున్నాడతడు.

"వచ్చేవా రవీ.... ఈమధ్యసలు బొత్తిగా నల్లపూసైపోయావేమయ్యా. అలా కూర్చో" మేనత్త అంది ఆప్యాయంగా.

"ఎవరు అన్నపూర్ణా" ఒకావిడడిగింది రెప్పవెయ్యకుండా రవినే చూస్తూ.

"మా అన్నయ్యగారబ్బాయి. ఇక్కడే కాలేజీలో చదువుతున్నాడు"

"మేనల్లుడన్నమాట. మేనల్లుడేవిటి అల్లుడే. ఈడూ జోడూ బాగా కుదుపుతుంది కూడానూ"

చచ్చేంత సిగ్గేసింది రవికి, ఈ ఆడవాళ్ళకి బొత్తిగా సిగ్గుండదేవిటి అనుకున్నాడు. మొహం తిప్పేసుకునేసరికి ఎర్రగా కందిన మొహంతో బిక్కుబిక్కుమని చూస్తున్న కామేశ్వరి కనిపించింది.

రవికీ, జయంత్‌కి పీటవాల్చి పిండి వంటలు పెట్టింది. ఇంతలో కుటుంబరావు గారొచ్చారు "ఏం రవీ... అసలు మొఖం చూపించడవే మానేశావేమిటి...?"

"వస్తూనే వున్నాను మావయ్యా! నువ్వే కన్పించటంలేదు."

"మీ మావయ్యకసలు తీరుబడివుంటే కదా. బడి అయితే ప్రయివేట్లూ, ప్రయివేట్లయితే బడినూ" నవ్వుతూ అందావిడ.

"ప్రయివేట్ల వల్ల నాలుగురాళ్ళొస్తున్నాయి గనుకే ఈ కరువురోజుల్లో ఏదో ఇలాగ బండి లాక్కొస్తున్నాం"

"ఆరోగ్యం సంగతికూడా చూసుకోవద్దూ?"

"అన్నీ చూసుకుంటూ కూచ్చుంటే గడవడానికి మనమేవన్నా జమిందారులమా? అసలే ఖర్చులకి తట్టుకోలేక పోతున్నామని ఇదైపోతోంటే ఇప్పుడింకో ఖర్చు తెచ్చిపెట్టేవు నెత్తిమీదకి"

"అయ్యో-అవేం మాటలండీ.ఎవరైనా వింటే నవ్విపోరూ?" బుగ్గలు నొక్కుకుంది అన్నపూర్ణ.

"ఎవరో నవ్వుతారని మోయలేని బరువు మొయ్యమంటే ఎలాగే? నవ్విన నాపచేనే పండుద్దని సామెత కూడా వుంది"

"శుభమా అంటూ మనింట్లో తొలి శుభకార్యం చేసుకోబోతోంటే పెడసరపు మాటలేవిటండీ!"

"అయినా ఈరోజుల్లో కూడా ఇలాటి వాటికింత ఆడంబరం చెయ్యటం, ఖర్చులకి పోవటం మంచిపనికాదత్తా" మెల్లగా చెప్పేడు రవి.

"హుఁ. సరిపోయింది... మావకి తగ్గ అల్లుడూ. అల్లుడికితగ్గ మావానూ"

"అవునోయ్. రవి అన్నదే నిజమే. అనవసర సాంప్రదాయాలూ, అర్థంలేని ఆచారాలూ వదిలెయ్యాల్సిందే. అందుకోసం ముందు మీ ఆడవాళ్ళు మారాలి"

"మనం ఒక్కళ్ళమే చేస్తున్నట్టు మాట్లాడతారేవండీ. నలుగురితో

నారాయణా కులంతో గోవిందా అన్నారు. దేశమంతా ఇలాటివాటికి వేడుకలు చేస్తున్నప్పుడు మనం మానేస్తే నలుగురూ నవ్వరూ? ఖర్చుకి చూసుకున్నారనీ,పిసినిగొట్టువాళ్ళనీ,సాంప్రదాయమంటే గౌరవం లేదనీ ఆడిపోసుకోరూ? రేపు పిల్లలకి సంబంధాలెక్కొద్దూ? అన్నీ తెలిసికూడా ఏమీ తెలీనట్టు మాట్లాడతారేం?!''

''చూడు అన్నపూర్ణా ఒక పద్ధతిని తోసిరాజని మంచిపనైనాసరే చేపట్టినప్పుడు కొన్ని విమర్శలూ నిష్ఠూరాలూ ఎదుర్కోకతప్పదు. అవి వస్తాయని జడిసి పాత బాటనేనడిస్తే ఇక కొత్తదారెప్పుడు పడుతుంది? ముందు మార్పు మీ ఆడవాళ్ళనుంచి రావాలి. మీరు మారితే దేశం మారినట్టే''

''పొద్దుటే వుపన్యాసం మొదలెట్టినందుకైనా మారతాం లెండిగాని రవిని సాయమిచ్చి పెదబాబుని మా అన్నయ్యగారింటికి వంపుదామనుకుంటున్నాను''

''మళ్ళీ రవెందుకే బావుండదు. పైగా కాలేజీ స్టూడెంటుని ఇలాటివాటి కోసం పంపడం సిగ్గుచేటు. ఆ బడుద్దాయి నొక్కణ్ణీ వెళ్ళమను కనీసం ఆ పనైనా చెయ్యలేడా?''

''వెళ్ళనంటున్నాడు''

''ఏరా వెళ్ళవా?''

''నేనేదో సరదాకంటే అదీ చెప్పాలేంటి? నాకేం భయంలేదు. నేనొక్కణ్ణీ వెళ్ళగలను'' జయంత్ అన్నాడు తలొంచుకుని.

తేలిగ్గా నిట్టూర్చాడు రవి.

మరి కాస్సేపుండి వచ్చేశాడు.

మేనల్లుడే అల్లుడంటూ ఇవాళా ఆడవాళ్ళనటమేకాదు రేపు బంధువర్గం కూడా అదే మాటంటుంది. కాని భవానీని చేసుకుంటే కామేశ్వరి బాధపడుతుంది. భవానీని కాదంటే ఆ అమ్మాయి కూడా నొచ్చుకుంటుంది.

కామేశ్వరి చెంగునదూకేజలపాతమైతే, భవానీ నిశ్చల నది.

ఆ ఇద్దరి లక్షణాలూ తనకిష్టమే.

అవి రెండూ కలిసిన, చదువుకున్న, తన ఆశయాన్ని గౌరవించి చేదోడు వాదోడుగానిలిచే స్త్రీమూర్తి తన భార్యగా లభిస్తే మరీ బావుణ్ణు!

ఛా-తనేవిటిలా ఆలోచిస్తున్నాడు? ముందు తన ఆశయం నెరవేరడం ముఖ్యం. ఆ ఆశయసాధనకింకా ఎన్నో అడ్డంకులు అధిగమించాలి. కీకారణ్యం లోంచి బాట వేసుకోవాలి.

ఆ తర్వాతే పెళ్ళీ వగైరాలు.

వడివడిగా నడిచాడు హాస్టల్ వైపు.



6

విద్యార్థులంతా సాయంత్రం నాలుగున్నర గంటలకి ఆడిటోరియంలో హాజరవ్వాలని ప్రిన్సిపాల్‌గారు నోటీసు పంపారన్ని క్లాసులకీ.

వురుములేని పిడుగేమైవుంటుందో ఎవరి వూహకీ అందలేదు.

రకరకాలుగా వూహిస్తూ వ్యాఖ్యానిస్తూ చాలామంది విద్యార్థులూ, లెక్చరర్లూకూడా ఆడిటోరియంలో సమావేశమయ్యారు.

సరిగ్గా అయిదుగంటలకి ప్రిన్సిపాల్ గారొచ్చి తిన్నగావెళ్ళి స్టేజిఎక్కి మైకు

ముందు నిలబడ్డారు. సభికుల్నోసారి కలయజూసి గొంతు సవరించు కున్నారు.

"ఇవాళో ముఖ్యవిషయం ప్రకటిద్దా మని మిమ్మల్ని సమావేశపరచడం జరిగింది. ఎందరో విద్యార్థులు మారు మూల పల్లెల్నుంచి కూడా ఇక్కడికొస్తు న్నారు. ఎందుకు? విద్యార్జనకోసం. అంతే తప్ప రాజకీయాలకోసంకాదు. విద్యార్థుల్ని అటువేపు ప్రోత్సహించడానికి కొందరు ప్రయత్నించినందున ప్రశాంత వాతా వరణాన్ని కలుషితం చెయ్యడం ఇష్టం లేక గతరెండేళ్ళనుండీ స్టూడెంట్ యూని యన్ ఎన్నికలు జరిపించలేదు. ఇప్పుడా పరిస్థితి అదుపులోకొచ్చిందని భావించిన దృష్ట్యా మళ్ళీ ఎన్నికలు పునరుద్ధరించ బోతున్నాను"

కరతాళధ్వనులు మిన్నుముట్టాయ్

"కాని ఒక్కమాట. ఎన్నికలు ఓట్ల పద్ధతి ద్వారా నిర్వహిస్తే మళ్ళీ సంఘ విద్రోహ శక్తులు విజృంభిస్తాయిగనుక ఆ పద్ధతిని మార్చి బుద్ధిమంతులూ, మన సంస్కృతియెడ అభిమానమూగల కొందరు విద్యార్థుల్ని నాయకులుగా నేనే ఎన్నికచేస్తున్నాను. ఈ పద్ధతి చక్కని ఫలితాల్నిస్తుందని ఆశిస్తూ ఆ లీడర్స్‌కి మీ సహాయ సహకారాలందివ్వాలని కోరుతున్నాను. ఈ లీడర్స్ కూడా తమ బాధ్యతల్ని సక్రమంగా వివాదాల కతీతంగా నిర్వహిస్తారని ఆశిస్తున్నాను. వారి పేర్లివి. ప్రెశిడెంట్ వై. శేషగిరి, వైస్ ప్రెశిడెంట్స్ యస్సార్కె శర్మ అండ్ కుమారి జి. పుష్ప" అంటూ లిస్టుచదివి వారందర్నీ ప్రమాణస్వీకారం చెయ్యాల్సిందిగా కోరారు ప్రిన్సిపాల్.

కొందరు తప్పట్లు కొట్టారు. మిగతా వాళ్ళంతా కలో నిజమో తేల్చుకోలేక సంభీభూతులయ్యారు. ఆ యన పేర్కొన్న లీడర్లంతా శేషగిరి సమాజం వాళ్లూ, చైర్మన్‌గారబ్బాయి అతడి అను చరులూనూ!

శేషగిరీ, వీర్రాజూ తదితరులంతా స్టేజి ఎక్కారు.

చాలామంది ముఖ్యంగా వారి వ్యతిరేక సంఘ సభ్యులు ఆవేశంతో కేకలు పెట్టారు; నినాదాలు చేశారు. "షేమ్ షేమ్", "ప్రిన్సిపాల్ నిరంకుశత్వం నశిం చాలి" "శేషగిరి డౌన్‌డౌన్" లాంటి నినాదాలతో ఆడిటోరియం ప్రతిధ్వనిం చింది.

ఆదే సమయంలో మరికొన్ని సన్న గొంతులు "యస్సీ యస్టీలకూ్కడా స్థానం ఇవ్వాలి. రిజర్వేషన్ సిస్టమ్ అమలుపరచాలి" అంటూ నినదించాయ్.. కొందరుద్రేకాన్ని అదుపులో పెట్టుకోలేక కుర్చీల్ని తన్ని పారేశారు.

గొడవయ్యేటట్టుందని లెక్చరర్లూ, కొందరు విద్యార్థులూ చల్లగా జారు కున్నారు.

"ఫ్రెండ్స్! ఆవేశానికి లోనుకావద్దు. ముందు ప్రిన్సిపాల్‌గారి చర్యకి నిరసనగా వాకౌట్ చేద్దాం. తర్వాత మన కార్య క్రమం నిర్ణయించుకుందాం" అన్న జార్జి విజ్ఞప్తి మేరకు పొలోమంటూ బయటికి నడిచారు నినాదాలు చేస్తూనే.

ఆడిటోరియం మూప్పాతిక భాగం ఖాళీ అయిపోయింది!

విద్యార్థి సంఘ కార్యవర్గం అత్యవసర సమావేశం జరిపి ప్రిన్సిపాల్‌గారి చర్యను ఖండిస్తూ తీర్మానం ఆమోదిం చారు. మర్నాడు ప్రిన్సిపాల్‌ని కలిసి తీర్మానం ప్రతినిచ్చి తమ నిరసన




తెలియజేయాలనీ, ఆయన జవాబుని బట్టి తర్వాత కార్యక్రమం నిర్ణయించుకోవాలనీ నిశ్చయించారు.

మర్నాడు జార్జి, రవి, బాబు తదితరులు వెళ్ళి ప్రిన్సిపాల్‌కి మెమోరాండం ఇచ్చారు.

"వాటీజ్ దిస్?"

"మీ చర్యని ఖండిస్తూ మా సంఘం చేసిన తీర్మానం"

"ఓ ఐసీ. ఇది ప్రజాస్వామ్య విరుద్ధమంటారు. వెల్. మరి గవర్నర్ల, సుప్రీంకోర్టు న్యాయమూర్తుల నియామకాన్నేమంటారు? ఆఖరికి ముఖ్యమంత్రుల్ని కూడా నియమిస్తున్నారప్పు ఎన్నుకోవడంలేదు కదా? అవన్నీ ప్రజాస్వామ్యాని కనుగుణంగానే వున్నాయా?"

"వాటినే ఎందుకు వుదాహరణగా తీసుకోవాలి?"

"అవే ఎందుకు తీసుకోకూడదు? చూడు మిస్టర్ జార్జ్. నేనీ కాలేజీ ప్రిన్సిపాల్‌ని. ఏవిషయంలో ఎలా ప్రవర్తించాలో, ఎలా ప్రవర్తిస్తే కాలేజీ, అందులోని విద్యార్థులూ అభివృద్ధిలోకొస్తారో నాకు తెలుసు. ఐనో మైద్యూటీ. యూ కెన్‌గో"

"మామీద మా లీడర్లుగా మీరు వుద్దినవారి గురించీ, వుద్దిన పద్ధతి గురించీ తెలుసుకునే హక్కు మాకు లేదంటారా చెప్పండి? వాళ్ళు రేపు బాధ్యతా రహితంగా విద్యార్థుల ప్రయోజనాలకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అందువల్ల నష్టపోయేది మేము కాదంటారా చెప్పండి"

"కావొచ్చు"

"అలా జరక్కుండా మీరు బాధ్యత వహిస్తారా చెప్పండి?"

ఇరుకున పడ్డట్టు ఇబ్బందిగా చూశాడాయన. అతికష్టంమీద తలూపారు.

"మీరు మాట తప్పరని ఆశిస్తున్నాం" అని విసురుగా వెళ్ళిపోయారు అందరూ. వాళ్లు తన గుండెలమీంచి నడిచెళ్తున్నట్టు అన్పించింది ప్రిన్సిపాల్‌గారికి!

* * *

ఫస్టియర్ రిజల్ట్స్ వచ్చాయి.

రవి అన్ని సబ్జక్టులూ పాసయ్యాడు. 63 శాతం మార్కులొచ్చాయి. కానతడికి తృప్తికలగలేదు. కనీసం మొత్తంమీద 75 శాతం అయినా రావాలన్నది అతడి పట్టుదల.

కాని లెక్చరర్ల ధోరణి అతడికి ప్రోత్సాహకరంగా లేదు. వాళ్ళుచెప్పే పాఠాలకన్నా గైడ్లలోనే ఎక్కువ అంశాలు కన్పిస్తున్నాయి. అంచేత ఎక్కువగా లైబ్రరీ మీదే ఆధారపడాల్సొస్తోంది.

రూమ్‌లో దీక్షగా చదువుకొంటోంటే రూమ్మేట్ కాంతారావు ఈలవేస్తూ నాట్యం చేస్తూ వచ్చాడు. ఇబ్బందిగా, చూశాడు రవి. కానదేమీ పట్టించుకోకుండా రూమ్‌లో కలతిరగసాగాడు ఏదో పాట హమ్ చేస్తూ.

"ఏమిటంత హుషారుగా వున్నావ్" పలకరించకపోతే మరీ రెచ్చిపోతాడేమోనని అడిగాడు రవి అయిష్టంగానే.

"గుడ్‌న్యూస్ గురూ... గుడ్‌న్యూస్. కొత్త నటీనటులు కావాలని ప్రకటించారు. నేను హీరోగా సెలక్టవటం ఖాయం. ఇంకో రెండేళ్ళలో ఈ కాంతారావు పేరూ, ఫొటో ఆంధ్రదేశపు గోడలమీదా, పేపర్లలోనూ మార్మోగిపోతూంటుంది. లలలా లలలా..."

"ఇలా ప్రకటనలు చేసే చాలా సంస్థలు బోగస్‌వని చదివానెక్కడో"



"ఇది బోగస్ గీగస్ కాదు గురూ. పీళ్ళేం డబ్బు పంపమన్లేదు. కేవలం రెండు ఫొటోలు పంపించమన్నారంతే"

"అయితే గతంలో డబ్బు పంపడాలు కూడా అయ్యిందన్నమాట"

"అదో లెక్కకాదు గురూ. రేపు సినీతారనై వెలిగితే కనకవర్షం కురపదా! కార్లలో తిరగనా..."

ఇక అవాళ రూమ్‌లో చదువుసాగదని తెలిసిపోయింది. పుస్తకం తీసుకుని పార్కుకెళ్ళిపోయాడు రవి.

చదువుకొంటోంటే ఇద్దరు పిల్లల ముద్దుముద్దు సంభాషణ అతడి చెవిలో పడింది. తల తిప్పి చూశాడు.

ముచ్చటగా శుభ్రంగా వున్న ఇద్దరు పిల్లలు సిమెంట్ బెంచీమీద కూర్చొని ఇంగ్లీషులో మాట్లాడుకుంటున్నారు. వాళ్ల వయస్సు ఏడెనిమిది సంవత్సరాలు మించి వుండదు. ఆ వయస్సులో మాతృభాష కాని ఇంగ్లీషులో మంచినీళ్ళప్రాయంగా మాట్లాడుకొంటోంటే ఎంతో సంతోషం వేసింది.

వాళ్ళని పిలిచి వాళ్ళ గురించీ, వారి కాన్వెంటుగురించీ అడిగితెలుసుకున్నాడు.

వాళ్ళ నాన్నగారు బ్యాంకులో పని చేస్తున్నారట. వాళ్ల మిషనరీ కాన్వెంట్లో చదువుతున్నారట. వాళ్ళ టీచర్ చాలా మంచిదట. ఎన్నో కథలూ, పాటలూ చెబుతుందిట.

వారి మాటలు ముగ్ధుడై విన్నాడు రవి.

కాన్వెంట్లతో ప్రభుత్వ స్కూల్స్‌ని పోల్చుకోకుండా వుండలేకపోయాడు.

కాన్వెంట్ చదువులు ఫీజుల దృష్ట్యా, డొనేషన్ల దృష్ట్యా, ఇతర ఖర్చుల దృష్ట్యా అధికాదాయ వర్గాలవారికే పరిమితమైపోతున్నమాట నిజమే. కానదే పద్ధతిలో తెలుగులో మన పాఠశాలల్లో విద్య బోధించడం అసాధ్యంకాదే. మరి వాటిల్లో ప్రాధాన్యతవహించే క్రమశిక్షణ, విజ్ఞానం, విధేయత, ఆత్మవిశ్వాసం వీటిలో ఎందుకు కొరవడుతున్నాయి?

సౌకర్యాలు లేకా? తగినంత మంది ఉపాధ్యాయులు లేకా?

సిలబస్ లోపమా? టీచర్ల ట్రైనింగ్ లోపమా?

లేక ప్రభుత్వ నిర్వహణ లోపమా?

ఏమైనా కాన్వెంట్లని ఆదర్శంగా తీసుకుని ప్రాథమిక విద్యా విధానాన్నీ, విద్యాబోధననీ కూడా సంస్కరించాల్సిన అవసరం ఎంతయినా వుందనిపించింది. అలాటి మంచిరోజెప్పుడు వస్తుందో!

అతడి కళ్ళముందు చక్కని యూనిఫారం ధరించి ఆరోగ్యంతో ఆనందంతో మిసమిసలాడుతోన్న బాలబాలికలు బారులుగా చక్కని భవనాల్లోకి వెళ్తోన్న దృశ్యం కదిలింది.

ఆ వెంటనే ఒంటిమీద సరయిన బట్టలు లేక అనారోగ్యంతో ముక్కులు తుడుచుకుంటూ, జారిపోతున్న లాగుల్ని పైకి లాక్కుంటూ పశువుల పాకలాంటి బడిలోకి పల్లెటూరిపిల్లలెళ్తోన్న దృశ్యమూ కదిలింది.

విద్యావిధానం మారితేనే చాలదు - పిల్లల తల్లిదండ్రుల ఆర్థికస్థితిగతులు కూడా మారాలి. అప్పుడే అలాంటి మార్పు సంభవమనుకున్నాడు.

* * *

కేంటీన్లో హాస్టల్ విద్యార్థులు భోంచేస్తున్నారు.

"ఏం బాబూ....నానాటికి తీసికట్టు నాగంబొట్లు అన్నట్టుంటోంది భోజనం"





సర్వర్‌తో అన్నాడో విద్యార్థి.

"వీళ్లు కొంటోన్న బియ్యం ఏ అండర్ గ్రౌండ్ మిల్లులోనో స్పెషల్‌గా తయారయినవనుకుంటాను. లేకపోతే ఇన్ని రాళ్లూ, రాగులూ కలిసుండటం ఎలా సంభవం?' మరొకరు సందేహం వెలిబుచ్చారు.

"సాంబారు స్పెషల్ గంజితోకాస్తావు కాబోలు ప్రోటీన్లెక్కువుంటాయని" ఇంకొకరు వ్యాఖ్యానించారు.

సర్వర్లు నవ్వివూరుకుంటున్నారు.

ఏమీ అనుకోకుండా సర్దిచెప్పుకోకుండా ఆ భోజనం తినడం సాధ్యం కాదుమరి. అందరి మాటలూ వింటూ అయిష్టంగా తింటున్నాడు రవి.

ఇంతలో శేషగిరీ, వీర్రాజూ తదితర బృందం ఓ ఆరడజనుమంది వచ్చారు.

వీర్రాజు యూనియన్ సెక్రటరీయే కాదు హాస్టల్ స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంటు కూడాను. ప్రిన్సిపల్‌గారు తొక్కినదారినే సుబ్రావుగారూతొక్కి వీర్రాజుని ప్రెసిడెంటుగా నామినేట్ చేశారు. ఈ ఏడాదే వెలుగులోకొచ్చిన వీర్రాజెవరోకాదు - ఆ టౌన్ మున్సిపల్ చైర్మన్‌గారి సుపుత్రుడు. పదవికోసం హాస్టల్ రిజిస్టర్లో అతడి పేరుంటుంది తప్ప హాస్టల్లో వుండాల్సిన అగత్యం అతడికి లేనేలేదు.

అయితేనే హాస్టల్ కేంటీన్‌ని తన మావగారిల్లులా భావిస్తూ కోరిన వంటకాలు చేయించుకు తింటారతడూ శేషగిరి బృందమూనూ. అప్పుడప్పుడు సుబ్రావుగారు కూడా వాళ్ళతోకలిసి అక్కడే విందూ మందూ కూడా ఆరగిస్తూంటారు.

"మా దొరలొచ్చారు స్పెషల్ మీల్స్ పట్టండి" ఎవరో అరిచినట్టుగా అన్నారు వాళ్ళనిచూసి.

వీర్రాజు ఆ మాటలొచ్చినవేపుకోపంగా చూశాడు.

"మీల్సొద్దు. చికెన్ జాయింట్లు కావాలి" - మరోపక్కనుంచింకెవరో అన్నారు.

"చాటునుండి అరిస్తేకాదు. దమ్ముంటే ముందుకిరండి" సవాల్ విసిరాడు వీర్రాజు.

"వీర్రాజుగారూ! కేంటీన్లో గొడవెందుకు? వూరుకోండి" మధ్యలో కల్పించుకుంటూ అన్నాడు రవి.

"ఆ కోన్‌కిస్కాగాళ్ళెదో వాగితే నేను పడాలా?"

"ఈ భోజనం తినలేక అక్కసు కొద్దీ అనుకుంటారంతే! మీరీ విషయం టేకప్‌చేసి క్వాలిటీ పెరిగేట్లు చూస్తే బావుణ్ణు"

"ఆ విషయాలు మాకు తెలుసు. నువ్వెవడివి మధ్యలో నీలగటానికి?" శేషగిరన్నాడు దూకుడుగా.

"ఆ ప్రశ్న నేను మిమ్మల్నడగాలి. నేను హాస్టల్ స్టూడెంటుని. మీకిక్కడ పనేమిటి?"

"నోర్ముయ్... వేలెడంతలేవు నన్ను నిలవేసేవాడివయ్యావా? ఆ వార్డిగాడి అండ చూసుకుని ఎగుర్తున్నావుకాబోలు. వాణ్నీ,నిన్నూ ఎక్కడ కొట్టాలో అక్కడ కొడతాను జాగ్రత్త"

"మీరు కాస్త మర్యాదగా మాట్లాడితే బావుంటుంది"

"నీకు మర్యాదేమిటి పోవోయ్"

హేళనగా నవ్వారు.

రవి రక్తం వుడికిపోతోంది. అయినా నిగ్రహించుకుంటున్నాడు. కాల్చేసేలా చూస్తూ ఏదో తీవ్రంగా అనబోయాడు





కాని ఇంతలో ప్రకాష్, మిగతాస్టూడెంట్లూ లేచి "మరోసారా మాటనండి" అన్నారు చొక్కా చేతులు మడుస్తూ.

"కొడతారా?" అన్నట్టు బుసలు కొడుతూ చూశాడు వీర్రాజు.

పరిస్థితి అనుకూలంగా లేదని గ్రహించిన శేషగిరి "ఇప్పుడు కాదు. వీళ్ళ పని తర్వాత పడదాం పద" అంటూ లోపలికి తీసుకెళ్ళిపోయాడు.

"ఏడిశారు. వట్టి మొరిగే కుక్కలు" అన్నారెవరో!

అందరూ ఘొల్లుమని నవ్వారు.

* * *

హోటల్ రేట్లన్నీ ఒక్కసారే పెంచేశారు. అన్ని సరుకుల ధరలూ పెరిగాయంటూ ఆరునెలల క్రితమే ఓసారి పెంచారు. ఇదిగో ఇప్పుడు మళ్ళీనూ.

ఒక్క విద్యార్థుల్లోనే కాదు - పట్టణ ప్రజలందరిలోనూ కలవరం కలిగింది. ఇలా పెరుగుతూండటమేగాని ఏ వస్తువు ధరా ఎప్పటికీ తగ్గటమంటూ వుండదా అని మధనపడసాగారు.

జార్జి అఖిలపక్ష సమావేశాన్నేర్పాటు చేశాడు. టౌన్లోని వివిధ యువజన సంఘాలనుంచీ, విద్యార్థిసంఘాలనుంచీ చాలామంది ప్రతినిధులొచ్చారు. శేషగిరీ, వీర్రాజూ కూడా వచ్చారు అయిష్టంగానే.

సమావేశం ప్రసంగాల పద్ధతిలోగాక చర్చా పద్ధతిలో జరిగింది. హోటల్ ధరలింతగా పెంచడం అన్యాయం గనుక మనమంతా కలసికట్టుగా ఎదిరించాలన్న సూచనకంతా అంగీకరించి కార్యక్రమం ఏర్పాటు చెయ్యమన్నారు.

చర్చలో శేషగిరిగాని, వీర్రాజుగాని బొత్తిగా పాల్గొనకపోవడంతో "మీరేమంటారు శేషగిరిగారూ?" అనడిగాడు జార్జి.

"నా అభిప్రాయం అడక్కుండానే మీరే ఒక నిర్ణయానికొచ్చేశారుగా" నిష్ఠూరంగా అన్నాడు శేషగిరి.

"అదేవిటలా మాట్లాడుతున్నారు? మేం చర్చిస్తూ తర్జనభర్జనలు పడుతున్నప్పుడు మీరు మీ వాదాన్నెందుకు చెప్పలేదు? ఒక విషయం గురించి అంతా కలిసి చర్చిస్తున్నప్పుడు మీరేమంటారు మీరేమంటారని ప్రత్యేకంగా అడగక్కర్లేదుగా. పోనీలెండి... మీ అభిప్రాయం ఏవిటో ఇప్పుడైనా చెప్పండి"

"ధరలు పెంచడం నాకూ ఇష్టంలేదు. కానిది విద్యార్థులసమస్య కాదనుకుంటాను. ఇటువంటివాటిలో కలగజేసుకుని మన చదువు పోగొట్టుకోవడం అనవసరం"

"అలా ఎందుకనుకుంటున్నారు?"

"మనం విద్యార్థులం. విద్యార్జనే మనకి ప్రధానం గనుక"

"నిజమే. కాని కడుపు మాడుతోంటే మనకి ఆకలికన్నా విద్యార్జన ముఖ్యమంటూ చదువుకోగలమా చెప్పండి? మన సంఘటిత శక్తితో ఆకలిలాటి ప్రాథమికావసరాల సమస్యలు తీర్చుకుంటూనే చదువుకోవాలి తప్ప చదువు ప్రధానమని వాటినెలా అశ్రద్ధ చెయ్యగలం చెప్పండి! ఈరోజుల్లో కాలేజీ చదువెంత ఖరీదైపోయిందో మనకి తెలుసు. ఫీజులూ, పుస్తకాలూ, రూము అద్దెలూ, భోజనం కాఫీలూ- వీటన్నింటికీ అయ్యే ఖర్చుని భరిస్తూ తమ పిల్లల్ని చదివించడం మధ్య, కిందితరగతి కుటుంబాలకెంత కష్టమో ఆలోచించండి. మీరు పైతరగతివారు గనుక మీకా ఇబ్బందులు తెలీకపోవచ్చుగాని మాకు బాగా తెలుసు. అసలీ పరిస్థితుల్లో అతికష్టం మీద ఇన్నాళ్ళూ

గెంటుకొస్తోన్న చాలామంది చదువాగి పోవచ్చు కూడా. అటువంటప్పుడు హోటల్ రేట్లు మరింత పెరిగితే ఎంత ఆదనపు భారమవుతుందో మీరే చెప్పండి"

"బాగా చెప్పేరండీ" అని ఓ యువ జన సంఘం ప్రెశిడెంటన్నాదో లేదో మిగతావాళ్ళు తప్పట్లుకొట్టారు.

శేషగిరి మొఖంలో రక్తపు బొట్టులేదు. అతణ్నాదుకోవడానికన్నట్టుగా "మరేం చేద్దామంటారు? సమ్మెకిమాత్రం మేం వ్యతిరేకం" అన్నాడు వీరరాజు.

"మేమూ వ్యతిరేకమే. కాని తప్పని సరైతే చేయాల్సిందే" దృఢంగా అన్నాడు జార్జి.

"సరే, ఇప్పుడేంచేద్దామంటావు? హోటల్ ఓనర్స్ అందరి దగ్గరికి వెళ్ళి 'అయ్యాబాబూ రేట్లు తగ్గించండి' అని బతిమాల్దామా?" శేషగిరి అన్నాడు విసురుగా దురుసుగా.

అతడి అమాయకత్వానికి చాలా మంది వింతగానూ, కొందరు జాలిగానూ చూశారు.

"అలా వాళ్ళని బతిమాలినంత మాత్రాన ప్రయోజనముండదు శేషగిరి గారూ! ముందు సబ్‌కలెక్టర్‌ని కలుసుకుని వినతిపత్రం ఇద్దాం. బజార్లో సరుకులెంత శాతం పెరిగిందీ, హోటల్ వాళ్ళెంత శాతం పెంచిందీ మావాళ్ళు వివరాలు సేకరించి స్టేటస్టిక్స్ తయారుచేస్తున్నారు. అవి చూపి ఆయన్ని తగినచర్య తీసుకోమని కోరదాం. ఆయన తగినచర్య తీసుకోకపోతే తర్వాతి కార్యక్రమం గురించి అప్పుడాలోచించి నిర్ణయించుకుందాం" అన్నాడు జార్జి.

రవీ, ప్రకాషూ తాము చేసిన స్టేటిస్టిక్స్ జార్జి చేతికిచ్చారు. ఆ వివరాలందరికీ చెప్పడంతో "అదే బావుంది. అలాగే కానిద్దాం" అన్నారంతా ముక్తకంఠంతో.

వెంటనే వినతిపత్రాన్ని తయారుచేసి అన్ని సంఘాలవాళ్ళూ సంతకాలు చేసేరారు.

మర్నాడన్ని పక్షాలవాళ్ళూ పూరేగింపుగా నినాదాలు రాసిన అట్టలు చేత బూని నినాదాలుచేస్తూ వెళ్ళి సబ్ కలెక్టర్‌గారికి మెమోరాండం ఇచ్చి హోటల్ రేట్లు దారుణంగా పెంచినందుకు హోటల్ యజమానులపై నిరసన తెలియజేస్తూ ఆయన్ని వెంటనే కలగజేసుకోమని కోరారు.

హోటల్ యజమానుల సంఘంతో మాట్లాడి రెండ్రోజుల్లో ఏ సంగతీ చెబుతాననీ, సాధ్యమైనంతవరకూ రేట్లు తగ్గించేందుకు ప్రయత్నిస్తాననీ, ఈలోగా ఎలాంటి ఆందోళనకీ దిగవద్దనీ కోరారాయన.

ఆదేరోజు రాత్రి లాయర్ సత్యంగారి సలహాపై జార్జి, తదితరులు హోటల్ యజమానుల సంఘసహాయ కార్యదర్శీ, చిన్న హోటల్ యజమానీ అయిన సన్యాసిరావుగార్ని కలిశారు.

"రేట్లు పెంచడం మాకూ ఇష్టంలేదు. కాని పెద్ద హోటళ్ళవాళ్ళ పట్టుబట్టడంతో తప్పలేదు" అన్నారాయన.

"సబ్ కలెక్టరుగారు మిమ్మల్ని పిలిచారా?"

"పిలిచారు. రేట్లు తగ్గించమనీ, లేకపోతే జనంలో ఆందోళన వచ్చేట్లుందనీ అంటే మావాళ్ళు తగ్గించమన్నారు. తగ్గిస్తే నష్టమొస్తుందన్నారు. అయితే సరుకుల ధరలు పెరిగేయంటున్నారు గనుక ఇది వరకటికీ, ఇప్పటికీ ఎంత పెరిగిందీ; మీరెంత పెంచిందీ, పెంచకపోతే ఎంత





నష్టం వచ్చేదీ వివరాలిమ్మన్నారు"

"రెండ్రోజుల్లో ఇస్తారా?"

"ఇచ్చి బయటపడేకన్నా మనంతట మనమే తగ్గిస్తే మంచిదని వాదిస్తున్నారు. కొందరు. లాభశాతం ఎక్కువ వేసుకోవడం జరిగిందిలే. అంచేత తేలుకుట్టిన దొంగల చందమయ్యింది మావాళ్ళపని"

మూడోరోజున రేట్లు తగ్గించినట్లు అన్ని హోటల్స్‌లోనూ బోర్డులు తెలిశాయ్!

* * *

రవి రూమ్‌కొచ్చేసరికి రూమ్మేట్స్ డేవిడ్, కాంతారావు రిజర్వేషన్ల గురించి తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

..."మీలాంటి వాళ్ళంతా మా రిజర్వేషన్లుచూసి అసూయపడుతూంటారు గాని సాంఘికంగామమ్మల్ని అగ్రకులాల వాళ్ళెంత హీనంగా చూస్తున్నారో మీకు తెలీదు. అంటరానితనం ఎంతగా పాటిస్తున్నారో గ్రామాలకెళ్ళి చూస్తే తెలుస్తుంది. మేము చదువుకుంటున్నామన్నా, వుద్యోగాలు చేస్తున్నామన్నా అది అంబేద్కర్ పెట్టిన భిక్షే. రిజర్వేషన్లు లేకపోతే, మమ్మల్ని అధఃపాతాళానికి తొక్కెయ్యరూ మీరంతా?" అంటున్నాడు డేవిడ్.

"యస్సీలకి కొన్ని, యస్టీలకి కొన్ని, బీసీలకి కొన్ని ఎక్స్‌సర్వీస్ మెన్‌కి కొన్ని అంటూ కేటాయించేస్తే ఇక మాకుమిగిలేవెన్ని? మేమున్న దెంతమంది?"

"సీట్లు పెంచమనడగండి. అంతేగాని మమ్మల్నాడిపోసుకుంటే ఎలాగ?"

"ఆ నిష్పత్తిలో మీ సీట్లూ పెరుగుతాయి కదా. మొదట్లో పదేళ్ళు రిజర్వేషన్లుంటే చాలు వెనకబడ్డవాళ్ళు ముందుకొచ్చేస్తారన్నారు. తర్వాత మళ్ళీ పెంచారు. ఆ తర్వాత మళ్ళీ పెంచారు. ఇలా ఎప్పటికీ పెంచుకుంటూపోతే ఎలాగ! మిగతా



వాళ్ళేమైపోవాలి? కొన్నాళ్ళుపోతే అగ్ర కులాలన్నీ వెనకబడ్డకులాలైపోతాయి"

"అప్పుడు మీకు రిజర్వేషన్లు కల్పిస్తా ర్లెండి" వ్యంగ్యంగా అన్నాడు డేవిడ్.

"అంతవరకూ వూరుకుంటామా. ఇలాగే వుంటే కాంగ్రెస్సుని ఓడించిపారేసి మీ భరతం పడతాం"

"మమ్మల్నీ, మా ఓట్లనీ కాదని ఏ పార్టీ అధికారంలోకి రాలేదు"

"అదీ చూస్తాంగా"

"ఏం చూస్తారు నా బొంద"

"రిజర్వేషన్లవల్ల కళ్ళు నెత్తికెక్కాయ్. మళ్ళీ కుయ్యి చెబుతా"

పరిస్థితి వ్యక్తిగత ద్వేషంలోకి మారు తోందని గ్రహించి "వూరుకోండి" అంటూ సర్ది చెప్పేడు రవి.

"అదికాదు రవీ రిజర్వేషన్లవల్లమన మంతా నష్టపోవడంలేదా చెప్పు?" అని కాంతారావు అడిగితే, "మా రిజర్వేషన్లు చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటు న్నాడు. నిజం నువ్వుచెప్పు రవీ" అన్నాడు డేవిడ్.

"సాంఘికంగా కొన్ని కులాలు వెనక బడ్డమాటా, అణగదొక్కబడ్డ మాటా నిజమే. వాళ్ళని పైకి తీసుకురావడానికి రిజర్వేషన్లు,ఆర్థిక సాయాల్లాంటి ప్రోత్సా హాలవసరం.కాని దానికో పరిమితి కూడా వుండాలి. గతమూడున్నరదశాబ్దాల్లో హరి జనగిరిజనులుచాలామందిచదువుకున్నారు. వుద్యోగస్థులయ్యారు కూడా. మొత్తం మీద అలా ఎదిగిన వాళ్ళ శాతం చాలా తక్కువే అయినా వారి సాంఘిక ఆర్థిక పరిస్థితులు ఇదివరకటంత అధ్వాన్నంగా లేవు. నిజానికెక్కువ మంది చదువు కొంటే రిజర్వేషన్లు ప్రతిబంధకాలవుతాయి కూడా. అగ్రకులాల దృక్పథంలోకూడా చాలా మార్పు వచ్చింది. కుగ్రామాల్లో తప్ప అంటరానితనం లేదనే చెప్పాలి. వాళ్ళింకా ఆర్థికంగానూ, సాంఘికంగానూ ఎదగాల్సివున్న మాటకూడా యదార్థమే. అందుగ్గాను వాళ్ళకి వాళ్ళతో బాటు ఆర్థికంగా వెనుకబడ్డ అందరికీ కూడా ప్రభుత్వం ఆర్థికసాయం చెయ్యాలి తప్ప రిజర్వేషన్ సిస్టం అనవసరం. దానివల్ల తక్కువ మార్కులొచ్చిన వాళ్ళకి-వాళ్ల యస్సీ, యస్టీలైతే సీట్లొస్తున్నాయ్, వుద్యోగాలొస్తున్నాయ్, ప్రమోషన్లొస్తు న్నాయ్. కేవలం కులరీత్యా ముందున్నం దున అత్యధిక మార్కులొచ్చినా అవి రానందున చాలామందిలో నిరాశా నిస్పృహలు చోటుచేసుకుంటున్నాయి.

"అంచేత కులాల విభజనపోయి ఆర్థిక పరిస్థితికనుగుణంగా ఆర్థికసాయం చేస్తూ రిజర్వేషన్లకి స్వస్తిచెప్పాలి. యస్సీకి చెందిన కలెక్టర్ కొడుకు ఆర్థి కంగా, సాంఘికంగా ముందున్నా అతడికి రిజర్వేషన్లూ, ఆర్థికసాయాలూనూ. పేద బ్రాహ్మడి కొడుక్కి అవేవీ లేకుండా వున్నాయి. ఇది న్యాయం కాదా? వుద్యోగాలనియామకంలో రిజర్వేషన్లుంటే కొంతవరకూ సమర్థించొచ్చు. కాని మళ్ళీ ప్రమోషన్లలోకూడా రిజర్వేషన్లంటే ప్రతి భని కాదని కులానికి పట్టంగట్టినట్టే కాదా?

"అంచేత రిజర్వేషన్లు రద్దుచేసి కులమతాలని బట్టిగాక ఆర్థికంగా వెనుక బడ్డవారందరికీ వారి వారి స్థాయిని బట్టి ప్రభుత్వం అన్నిరకాలగానూ తోడ్పడి వారందరి వున్నతికీ కృషి ప్రారంభించడం అవసరం"

కాంతారావు సంతోషంతో తప్పట్లు కొట్టాడు.

డేవిడ్ మొఖం మాత్రం వాడిపోయింది

 

"మీ అగ్రకుల పక్షపాతం పోనిచ్చు కున్నారు కాదు" అనేసి వెళ్ళిపోయాడు బయటికి!

* * *

డబ్బు పంపించమని ఇంటికెన్నిసార్లు కబుర్లు పంపినా ప్రయోజనం లేకపోయే సరికి తనే బయల్దేరి వెళ్ళాడు రవి.

ఇంటి ఆర్థిక పరిస్థితేం బావుండలేదు.

అధిక వృష్టివల్ల సార్వాపంట దెబ్బ తింది. కాలువ గట్టుకి గండిపడటం వల్ల పర్ర చేలు ముంపుకి గురయ్యాయి. ఒక పదిహేను రోజులపాటు ఎండ కాసివుంటే ఇంచుమించు అందరి పంటా ఒబ్బిడయ్యేది. కానెక్కడా వర్షం తెరిపివ్వలేదు. పండిన చేలు కొయ్యడానికి సందులేకపోయింది. ఈలోగా ముంపు రైతుల్ని ముంచేసింది. మరి గత్యంతరం లేక మొలలోతు చేలలో దిగి పంట కోయించి తలుపుల మీదా, చెక్కల మీదా, పడవలమీదా వేసి గట్టుకి చేర్చారు.

గింజ సగంపైనే రాలిపోయింది. మిగిలిందైనా తడుపు వల్ల ముక్క పాయ అయ్యింది.' ధర పలకనందున అయిన కాడికి అమ్మాల్సొచ్చింది!

రాష్ట్రంలో ఒకవక్క వర్షాలు లేక, నీళ్ళులేక పంటచేలు ఎండి, మాడి బీడులు పడుతోంటే మరోపక్క అధిక వర్షాలూ, వరదలూనూ!

డబ్బు కావాలని తండ్రినడగటానికి నోరాలేదు రవికి. అలాగని ఊరకుండే పరిస్థితీ కాదు. మెల్లగా తల్లికి చెప్పేడు సంగతి.

ఆవిడేం మాట్లాడలేదు. కొడుకు చూడకుండా కళ్ళు తుడుచుకుంది.

పిల్లలకి గోరుముద్దలు చేసి తినిపించే ట్పుడు చందమామని చూసి కావాలని మారాంచేస్తే అదీ ఇదీ చెప్పి మాయచేసి మరుపు కలిగిస్తూంటారు. ఇప్పుడు కాలేజీ చదువులు కూడా అందరాని చందమామ చందమయ్యాయి గనుక ఇక తమలాంటి వాళ్ళలాగే మాయమాటలు చెప్పాలి కాబోలనుకోకుండా వుండలేకపోయిం దావిడ. రవి చదువుతానంటే వాళ్ళ నాన్న ఎందుకొద్దన్నాడో ఇప్పుడర్థమవ్వసాగింది.

అలా అని ఇంతవరకూ లాక్కొచ్చిన బండిని అర్థాంతరంగా వదిలెయ్యాలనీ లేదు. ఏమీ పాలుపోక అయోమయస్థితిలో వుండిపోయిందామె.

లోపలెన్ని బడబాగ్నులు ఒద్దలవు తున్నాయో ఏమోగాని పైకి మాత్రం గంభీరంగా వున్నారు రామయ్యగారు.

"శివయ్య మాస్టారబ్బాయి కలెక్టరు పరీక్ష తప్పేడంట్రా"

నిర్ఘాంతపోయాడు రవి.

మాస్టారి కుటుంబం ఆ పరీక్ష మీదెన్ని ఆశలుపెట్టుకుని మరెన్ని కలలుకన్నారో అతడికి తెలుసు. ఆ ఆశలన్నీ భగ్గున మండిపోతే వామ్మెళ్ళేపోతారో అనుకునేసరికి గుండెలు విలవిల్లాడాయ్. కన్నీళ్ళు పొంగి వచ్చాయ్.

రెండంగల్లో మాస్టారింటికెళ్ళాడు.

పీనుగెళ్ళిన ఇల్లులా వుంది వారిల్లు. చెమర్చిన కళ్ళు తుడుచుకుంటూ లోపలి కెళ్ళాడు.

మాస్టారి భార్య గోడకి జేరబడి కూర్చు సుంది పోతపోసిన విషాదంలా. రవిని చూసి పమిటచెంగుతో కళ్ళూ, ముక్కూ తుడుచుకుంది. పడక్కుర్చీలో పడుకు న్నన్న మాస్టారు ఉప్పెనలో సర్వం కోల్పోయినవాళ్ళా వున్నారు. అతడి రాకని పట్టించుకోకుండా శూన్యంలోకి చూస్తూండి పోయారు.

ఒక్కసారే పదేళ్లు పైబడ్డట్టున్న మాస్టారివంక సానుభూతిగా చూసి గది లోకి నడిచాడు.

పడుకునివున్న శివాజీ అతణ్ని చూసి లేచి కూర్చున్నాడు. అతడికళ్లు ఎర్రగా వున్నాయి. మొఖం నల్లబడి పీక్కుపోయి వుంది.

"రిజల్ట్స్ ఎప్పుడొచ్చాయ్?" మెల్లగా అడిగాడు.

"ఇవాళే"

"కోచింగ్ తీసుకున్నారా?"

"లేదు. తీసుకునుంటే పాసయ్యే వాణ్ణే. డబ్బు సర్దుబాటవ్వలేదు" ఓ క్షణ మాగి అన్నాడు మళ్ళీ "జనరల్ ఎగ్జామ్ పాసయ్యాను. తర్వాత ఎగ్జామ్..."

వాక్యం పూర్తిచెయ్యలేదు కళ్ళనిండా నీళ్లు చేరటంతో.

"పోనీలే. అమాత్రానికి మరీ నిరాశ పడాలా? నెక్స్టైమ్ బెటర్ లక్"

పేలవంగా నవ్వాడు. అతడికి తన మీదా, తన ప్రతిభమీదా, ఆఖరికి భవిష్యత్తు మీదా కూడా నమ్మకం పోతోంది.

"యమ్.ఫిల్. చెయ్యండి పోనీ"

"ఇంటరెస్ట్ లేదు"

"మరీ అంత డిస్కరేజ్ అవ్వాల్సిన పనిలేదు"

"నాకలా అనిపించడంలేదు."

అతడి మనస్సుకి బలమైన గాయం తగిలిందని తెలుస్తూనే వుంది. ఇంకేమని ధైర్యం చెప్పాలో తెలీక కాసేపు వుండి వచ్చేశాడు రవి.

"ఎవరూ?" చూపు ఆనక ఒక ముస లాయనడిగాడు రవిని.

"నేనుతాతా..రామయ్యగారబ్బాయిని"

"నువ్వట్రా... ఏం చదువుతున్నావ్?"

"సీనియర్ ఇంటర్ తాతా"

"అంటే ఎన్నో కలాసురా?"

"పన్నెండో క్లాసు"

"ఆహా. ఏం చదువులో ఏమోరా...! ఈమధ్యన మీ నాన్న నలిగిపోతున్నా డనుకో. మీరెప్పుడు పైకొచ్చి కుటుంబా న్నాదుకుంటారో ఏమో"

"........."

"పోనీ ఇంతవరకూ చదివిందానితో సరిపెట్టి వుజ్జోగ ప్రయత్నాలు చెయ్య కూడదుట్రా? ఏవో నాలుగురాళ్లు తెస్తే మీ నాన్న ఒడ్డునపడిపోతాడు"

"అలాగే తాతా"

తన ఆశయం గుర్తొచ్చింది.

'చూస్తోంటే ఆర్థికబలం లేనివాళ్ళకి ఆశయాలుండటంకూడా తప్పేనేమో' అని గొణుక్కున్నాడు రవి కళ్లల్లోనురికిన నీళ్లు తుడుచుకోవడం మర్చిపోయి.




"హలో రవిగారూ! మీతో కొంచెం అర్జంటుగా మాట్లాడాలి...రండి"

శేషగిరి ప్రవర్తనకు ఆశ్చర్యపోతూనే అతడివెంట హోటల్లోకి నడిచాడు రవి.

కాఫీకి ఆర్డరిచ్చేక అన్నాడతడు "జార్జి వూళ్ళోలేడని తెలిసింది. అతడి తర్వాత మీరే లీడరుగనుక నిన్న కాలేజీలో జరిగిన సంఘటన గురించి మాట్లాడదామని పిలిచాను"

"అసలేం జరిగింది? అది మీ క్లాసు లోనే జరిగిందికదా...మీరప్పుడు క్లాసులోనే

వున్నారనుకుంటాను"

"వున్నాను గనుకే సీరియస్‌గా తీసుకోవాల్సొచ్చింది. లేకపోతే నిన్న కొత్తగా వచ్చిన లేడీ లెక్చరర్ మా మీద ప్రిన్సిపాల్‌కి రిపోర్టు చేస్తుందా?"

"అసలేం జరిగిందో చెప్పండి ముందు"

"కొత్త కామర్స్ లెక్చరర్ శోభారాణి ప్రథమంగా మా క్లాసుకొచ్చింది నిన్న. అవిణ్ని ఫైనల్ ఇయర్‌కెలా పంపారో నాకిప్పటికీ అర్థంకాదు. ఆవిడ నిన్నగాక మొన్న యమ్‌కామ్. పాసైనా పొగరుగా ఏదేదో చెప్పేద్దామని మా క్లాసుకొచ్చి ఒక్కొక్కరి పేర్లూ చెప్పమంది. అటెండెన్స్ రిజిస్టర్‌లో వున్నాయి చూడండన్నారెవరో. ఆమె రుసరుసలాడింది. మనవాళ్లు కొందరు పిల్లికూతలూ, నక్క కూతలూ కూశారు సరదాగా. 'మీ మాతృభాషలో మాట్లాడినందుకు సంతోషం. కానీ కాలేజీలు మనుషులగ్గాని జంతువులక్కాదు....మీరెళ్ళొచ్చు' అంది. మనవాళ్లు రెచ్చిపోయారు. దాంతో ఆవిడ రేష్‌గా ఇడియట్స్ మేనర్లెస్ బ్రూట్స్ అంటూ తనకొచ్చిన నాలుగు ఇంగ్లీషు ముక్కల్లోనూ తిట్టేసింది. ఆమె తిడితే పడుండటానికి మీసాల్లేనివాళ్ళంకాదు గనుక జాగ్రత్తగా మాట్లాడమని మర్యాదగానే చెప్పేం. ఆవిడెళ్ళి ప్రిన్సిపాల్‌కి రిపోర్టుచేసింది. ఇది మన విద్యార్థులందరి పరువు ప్రతిష్ఠల సమస్యగనుక మనల్నవమానించినందుకు ఆవిడచేత క్షమాపణ చెప్పించాలని సమ్మె చేద్దామనుకుంటున్నాం. ఇదివరకు మేం మీకు తోడ్పడ్డాంగనుక మీరు మాకు తోడ్పడతారని ఆశిస్తున్నాం"

"న్యాయమైన సమ్మె అయితే తప్పక తోడ్పడతాం. కాని మేం మరోలా విన్నాం"

"ఏమని?" శేషగిరి మొఖం పాలిపోయింది.

"ఆమె క్లాసులో అడుగుపెట్టగానే పిల్లికూతలూ, నక్కకూతలూ కూశారనీ; ఆమె రిక్వెస్ట్‌చేసినా వినకుండా బల్లలు బాదటం, పాటలు పాడటం, సిగరెట్లు కాల్చడం, హేళనగా మాట్లాడటం చేశారనీ; ఆమె విసుగెత్తి ప్రిన్సిపాల్‌కి రిపోర్టు చేసిందనీ తెలిసింది"

"అబద్ధం...అంతా ట్రాష్" అంటూ టేబిల్ మీద బాదాడు శేషగిరి.

హోటల్లోనివాళ్ళంతా వారి వంకే చూడసాగారు వింతగా.

"ముందు మిమ్మల్ని మీరు కంట్రోలు చేసుకోండి"

"నేను కంట్రోలు తప్పిలేను"

"కాని మీ ప్రవర్తనలాగే వుంది"

"విదేశీ తొత్తులు గనుక మీ కళ్ళకలాగే కన్పిస్తుంది"

"మతం మత్తుతో జోగుతూ అమెరికాని ఆరాధించేవాళ్ళకలాగే అన్పిస్తుంది"

"మీతో వాదిస్తూ కూర్చోడానికి తీరిక లేదు. మీరు స్ట్రయిక్‌ని సపోర్టుచేస్తారా లేదా?"

"మీరు చెబుతున్న కారణం అబద్ధం గనుక..."

"రబ్బిష్..అది పచ్చినిజం. నేనక్కడే వున్నానని మళ్లీ చెబుతున్నాను"

"నాకూ ప్రత్యక్ష సాక్షులే చెప్పేరు. పైగా మీ క్లాసులో కూసిన కూతలూ, చేసిన అల్లరీ మాకూ విన్పించాయి. తప్పు మనలో వుంచుకుని ఎవర్నో నిందించడం, సిల్లీ విషయాలకి సమ్మెలనడం మంచిపని కాదు. ఒక స్త్రీ మనకి





లెక్చరర్‌గా వచ్చినప్పుడు గురువుగా గౌరవించాలప్ప అనాగరికంగా ప్రవ ర్తించడం మన విద్యార్థి లోకానికే అవమానం. ఆడపిల్లల్ని గేలిచెయ్యడానికి, లెక్చరర్లని ఏడిపించడానికీ, క్లాసు లెగ్గొట్టి మేట్నీలు చూట్టానికి కాదు మన మిక్కడికొచ్చింది. మనకి చదువు ముఖ్యం. సత్ప్రవర్తన ముఖ్యం. అంతే తప్ప ఇలాటి సిల్లీ గొడవల్లో తల దూర్చడం మంచిదికాదు. పైగా మన సంస్కృతికి ఏకైక వారసులమని చెప్పే మీరు 'గురుదేవోభవ' అన్న ఆ సంస్కృతి మాటల్ని మంటకలపటం బాగాలేదు" రవి కాస్త ఆవేశంగానే అన్నాడు.

"మీరు కలిసి రాకపోతే సమ్మె చెయ్యలేమని విర్రవీగకండి. నేను కాలేజీ యూనియన్ ప్రెశిడెంటుని. నా తడాఖా ఏమిటో చూపిస్తాను చూడండి"

విసురుగా వెళ్ళిపోయాడు శేషగిరి కానతడి తడాఖా చూపించడానికి అవకాశం లేకపోయింది.

కొందరు విద్యార్థులా చిన్న విషయానికి సమ్మెనా అని నవ్వేశారు. మరి కొందరు ప్రోత్సహించారు.

శేషగిరి మాత్రం సమ్మెకు పిలుపిచ్చి గొడవ చేసైనా సరే ఆమెచేత క్షమాపణ చెప్పించుకోవాలనీ, తన గొప్పతనం నలుగురికీ చాటాలనీ గట్టిగానే ప్రయత్నించాడు గాని ప్రిన్సిపాల్ గారు పిలిచి ఆవిడ కమిటి ప్రెశిడెంట్ కేండిడేట్ అన్చెప్పి మందలించడంతో చల్లారిపోక తప్పింది కాదు.

* * *

కాలేజీ యానివర్సరీకి విస్తృతంగా ఏర్పాట్లు చేశారు.

శేషగిరి, వీర్రాజు బృందం చేతిలో కావల్సినన్ని కాలేజీ ఫండ్సున్నాయి. దాంతో కోతికి కొబ్బరికాయ దొరికినట్టయ్యింది. వాళ్ళ హడావిడికీ, ఆర్భాటానికీ ఎల్లల్లేకపోయాయి.

ప్రముఖుల్ని ఆహ్వానించడానికంటూ మద్రాసూ, హైదరాబాదూ, విశాఖపట్నం వెళ్ళారు. ఎవరెవర్నో పిలిచారు. ఏవేవో కొన్నారు. వాళ్ళ చేతుల్లో డబ్బు మంచి నీళ్ళయ్యింది.

కాలేజీ గేటు ముందు పెద్ద వెల్‌కమ్ బోర్డు వేలాడదీశారు. చుట్టూ బల్బుల తోరణాలు అమర్చారు. గేటు మొదలుకుని ఆడిటోరియం వరకూ దారి పొడవునా ట్యూబ్‌లైట్లూ,దండలూ అమర్చారు. ఇక కాగితాల తోరణాల గురించి చెప్పనే అక్కర్లేదు.

ఓ సినీ హీరోనీ, దర్శకుడ్నీ, నటినీ ఒక రోజునా; కొందరు కవుల్ని ఓ రోజునా; నాయకుణ్ణి, ప్రముఖ విద్యావేత్తల్నీ మరో రోజునా సభలకాహ్వానించారు.

సాంస్కృతిక కార్యక్రమాల్లో సంఘ సభ్యులు కూడా విరివిగా పాల్గొని వీధి భాగోతం లాటివి ప్రదర్శించాలనుకున్నారు గాని వాటిని పోటీలకి అనుమతించమన్నారు. ప్రత్యేకంగా ప్రదర్శిస్తామంటే అందుకోసం కూచిపూడి బృందాన్ని ఆహ్వానించామనీ, లెక్చరర్లు కూడా వేరే ఓ నాటిక ప్రదర్శిస్తున్నారనీ చెప్పేరు.

ప్రథమంగా రవి మొఖానికి రంగు పూసుకున్నాడు. ఓ నాటికలో తమ్ముడి పాత్ర ధరించాడు. అన్న పాత్రని జార్జి ధరించాడు. నాటకం కోసం కర్రసాము ప్రత్యేకంగా నేర్చుకున్నారు.

సంఘ సభ్యులకి బహుమతులు

రాకుండా చెయ్యాలని శేషగిరి వర్గం కృషి చేసిందిగాని జడ్జీలు వారి ఆటలు సాగనివ్వలేదు. ఉత్తమ ప్రదర్శనతో బాటు మరికొన్ని బహుమతులు స్వంతం చేసుకున్నారు వాళ్ళు. రవికి ఉత్తమ సహాయ నటుడి బహుమతి వచ్చింది.

ప్రకాష్, రవి తదితరులు మ్యూజిక్ ప్రోగ్రాం కూడా ఇచ్చారు. ఎన్నో జానపదగేయాలూ, అభ్యుదయ పాటలూ పాడారు. పిల్లి నక్కకూతలు కూసి అభాసుపాలు చెయ్యాలని చూసిన కొందరి ఆటలు సాగనివ్వలేదు ప్రేక్షకులు.

మొత్తానికి యానివర్సరీ వుత్సవం ఆనందకరంగా ముగిసింది.

ఖర్చు గురించి వివరాలు చెప్పమని జార్జి అడిగితే 'అలాగే' అన్నారు ప్రిన్సిపాల్‌గారు. శేషగిరి మాత్రం మొఖం చాటేసేశాడు.

* * *

పరీక్షలకింక ఇరవైరోజుల వ్యవధి మాత్రం వుంది.

ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చెయ్యడంతో క్షణం విశ్రాంతిలేకుండా చదువుతున్నాడు రవి.

తనకెక్కువ మార్కులు రావడమే కాదు పాఠ్యాంశాలు క్షుణ్ణంగా తెలియడం కూడా ముఖ్యమే. అప్పుడే ఎంట్రన్స్ పరీక్ష పాసై మెడికల్ కాలేజీలో అడుగు పెట్టగలడు. అందుకే మరింత దీక్షగా చదువుతున్నాడు.

ఒకోసారి ప్రభావతి గుర్తొచ్చి కొంచెం కంగారుపడుతున్నాడు కూడా. గత ఏడాది పరీక్షల్లో టైఫాయిడ్ వచ్చి పరీక్ష రాయలేకపోయిందామె. ఒక సంవత్సరం వృధా అయిపోయింది. అలాగే ఒకవేళ తనకీ అనారోగ్యం చేస్తే...

ఆ వూహ మెదిలితే చాలు ముచ్చెమటలు పోస్తున్నాయి.

టెన్త్ క్లాస్ పబ్లిక్ ఎగ్జామ్స్ జరుగుతూండటంతో జయంత్ ఎలారాస్తున్నాడో తెలుసుకుందామని మేనత్తగారింటికెళ్ళాడు.

తనని చూసి భవాని పారిపోయింది. సాదరంగా ఆహ్వానించింది అన్నపూర్ణ.

"కామేశ్వరీ, గోపీ ఇంట్లో లేరా?''

"లేరుగనుకే ఇల్లు ఇంత ప్రశాంతంగా వుంది. నానమ్మగారింటికెళ్ళారు మొన్న శలవులివ్వగానే''

''జయంతెలా రాస్తున్నాడత్తా?''

''బాగానే రాస్తున్నాడంటున్నాడు మరి. అంతా ఆ ఏడుకొండలవాడి దయ. గదిలో వున్నాడు చూడు. కాఫీ కలిపి తెస్తాను"

రవి గదిలోకెళ్ళేసరికి జయంత్ గైడ్ లోనూ, టెక్స్టుబుక్‌లోనూ కొన్ని ప్రశ్నలూ జవాబులూ బ్లేడులో కత్తిరిస్తున్నాడు.

"జయంత్...!"

మందహాసం చేశాడతడు.

"నీకు తెలిదులే బావా! కాపీకొట్టడానికి కూడా దమ్ములుండాలి"

"పట్టుబడితే ఏమవుతుందో తెలుసా?"

''పట్టుకోడానికెన్ని గుండెలున్నాయి వాళ్ళకి? నేనేకాదు బావా చాలామంది కాపీ లాసేస్తున్నారు. కొందరికి మేష్టార్లే కాపీలు తెచ్చిస్తున్నారు. బిట్ పేపర్లలో సగం బిట్లు వాళ్ళే చెప్పేస్తారనుకో''

"జరిగినంతకాలం అంతా బాగానే వుంటుంది జయంత్...కాని ఏ స్క్వాడ్ వాళ్ళో వస్తే..."

''మా స్టార్లు మాకు ముందే వుప్పందించేస్తారు'' అని గొప్పగా నవ్వి, ''తాశిల్దారుగారమ్మాయి, సర్కిలిన్‌స్పెక్టర్

గారబ్బాయి మా రూమ్‌లోనే పరీక్ష రాస్తున్నారు'' అన్నాడు.

మేనత్త తెచ్చిచ్చిన కాఫీ చప్పరిస్తూ జయంత్‌నే గమనించసాగాడు.

''పెదబాబూ... టైమవుతోందిరా'' లోపల్నుంచి కేకపెట్టింది వాళ్ళమ్మ.

''వచ్చేస్తున్నానమ్మా... అన్నం పెట్టెయ్''

కటింగ్ కార్యక్రమం ముగించి రబ్బర్ బేండ్ల సాయంతో కొన్ని కటింగ్స్‌ని తొడకి అతికించాడు. కొన్ని బెల్టు కిందా, మరికొన్ని అండర్ వేర్లోనూ దాచేడు.

రెండు మెతుకులు తిని బయల్దేరాడు. మేనత్త మాటమీద రవి కూడా అతడి వెంట పరీక్షా కేంద్రానికెళ్ళాడు.

అక్కడేదో తిరనాళ్ల జరుగుతోందా అన్పించేట్టుంది వాతావరణమూ, జనమూనూ. పరీక్ష రాస్తోన్న విద్యార్థుల కన్నా వాళ్ళ కూడా వచ్చినవాళ్ళే ఎక్కువ మంది వున్నారు. పోలీసు బందో బస్తు సరేసరి.

బెల్ కొట్టారు.

గేటు దగ్గర చొక్కాలూ, లాగులూ పైపైన చెక్‌చేసి లోపలికి పంపించారు కుర్రాళ్లని.

మరో బెల్ మోగేసరికంతా నిశ్శబ్దమై పోయింది. బయటి జనం మాత్రం ఆందోళనగా స్కూలుగోడలచుట్టూ తిరగ సాగారు.

ఓ అరగంట గడిచిందోలేదో లోపల్నుంచి ప్రశ్నాపత్రం బయటికొచ్చేసింది. పెద్ద గుంపుగాచేరి ప్రశ్నల్ని తర్వాత జవాబుల్ని స్లిప్పులమీద రాసి వివిధ మార్గాలద్వారా లోపలికి పంపించ సాగారు.

రవి విస్తుబోతూచూసి కదలబోతోంటే ఓ పెద్దమనిషి గుంపుదగ్గరికొచ్చి మెల్లగా అన్నాడు "చూస్తోంటే మీరంతా బి.సి.నాటి వాళ్ళలా వున్నారే" అని నవ్వాడు సిల్కు లాల్చీ, పంచె ధరించిన ఆ ఆసామి.

అయోమయంగా చూశారంతా.

"పేపర్లే బైటెపోతోంటే ఈ పాట్లెందుకంట? మొన్నే హైదరాబాద్‌లో పేపర్లు కొనుక్కొచ్చేన్నేను"

"మేం కొంటాం సార్", "మాకు అమ్మండి సార్" అని చుట్టుముట్టారంతా.

"ఒక్కో పేపర్ ఖరీదు మూడొందలు"

కొంచెం జంకేరు. "నిజంవేనా లేక డూప్లికేటువా?" ఎవరో గొణిగేరు.

"ఈ మూడ్రోజుల్నుంచీ నేనమ్మినవే పరీక్షల్లో ఇచ్చారు. కావలిస్తే రుజూ చేస్తాను"

అంతే! ఆ తర్వాతాయన్ని వాళ్లు మాట్లాడనివ్వలేదు.

ఆయన భుజంమీద చేతులేసి లాక్కుపోయారు దగ్గర్లోని హోటల్లోకి.

"ఇంత పబ్లిగ్గావచ్చి అమ్ముతున్నాడంటే ఇదేదో కుంభకోణం బాపతే. ఈమధ్య ఇలాటివాళ్ళు చాలా పెరిగిపోయారు" అక్కడేవున్న ఒకరు వ్యాఖ్యానించారు.

దానికి జవాబుగా "ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? ఒకవేళాయన అమ్మేవే నిజం పేపర్లయితే?" అనేసి వాళ్ళెళ్ళినవైపే వెళ్లిపోయారింకొకరు.

బాధగా నవ్వుకుంటూ కదిలాడు రవి.

హోటల్లో కాఫీ తాగుతోంటే అనంతం కన్పించాడు.

ఇదివరకు పప్పుసుద్దలా తనేవిటో తన చదువేమిటో తప్ప ఇంకేమీ పట్ట




నట్లుగా, స్తబ్దుగా వుండే అతడిప్పుడు గట్టిగా కబుర్లు చెప్పేస్తున్నాడు. నవ్వేస్తున్నాడు వుత్సాహంగా. మొఖంలో కూడా ఇదివరకులేని మెరుపూ, కళా చోటుచేసుకున్నాయ్!

"హాయ్ రవీ" అంటూ వచ్చి చేతిలోని వెడ్డింగ్‌కార్డ్సు కట్టలోంచోటి తీసి అతడి పేర్రాసి అందిస్తూ "వచ్చేనెల అయిదున నా మేరేజ్. తప్పకుండా రావాలి" అని ఆహ్వానించాడు.

తలూపి శుభలేఖ చూసి "మీరు ఇండియన్ బ్యాంక్‌లో చేస్తున్నారా?" అనడిగాడు కించిత్తు ఆశ్చర్యపోతూ రవి.

"అవునోయ్. రెండు నెలల్కితమే వచ్చింది. నేను చాలా లక్కీ ఫెలోని"

"అవునండీ! చదువైన ఏడాదిలోనే మంచి జాబ్ రావడం ఈరోజుల్లో అదృష్టమే మరి"

రవి బిల్లు కూడా తనే చెల్లించి "ఇంక వస్తాను రవీ! మేరేజ్‌కి తప్పకుండా రావాలి. మన ఫ్రెండ్స్‌కీ, లెక్చరర్లకీ వెడ్డింగ్‌కార్డ్సు ఇద్దామనొచ్చాను. వస్తానూ" అన్నాడు.

"ఒన్ మినిట్. మాకుపయోగించే కెమిస్ట్రీ నోట్సులేమైనా వున్నాయా మీ దగ్గర?"

"ఏమో...ఏమున్నాయో ఎక్కడున్నాయో! అసలు కొన్నాళ్ళుపోతే ఏయే సబ్జక్టులు చదివేనోకూడా మర్చిపోతాను. ఇక సబ్జక్టేం గుర్తుంటుంది?"

"మీరు క్లాస్ స్టూడెంట్ కదా?"

"అయితే మాత్రం అవన్నీ ఇప్పుడు అనవసరం కదా? కెమిస్ట్రీ ఫార్ములాలూ, ప్లేంట్ ఫామిలీ లక్షణాలూ అవీ మాకెందుకూ? డెబిట్లూ, క్రెడిట్లూ, బేలన్సులూ, ఎడ్జస్ట్‌మెంట్లూ, డిపాజిట్లూ, లోన్లూ...మా లోకం వేరు. మాక్కావల్సింది ఇవేగాని డిగ్రీ సబ్జక్టులు కాదు కదా. వస్తాను రవీ" రిక్షామీద వెళ్ళిపోయాడు అనంతం.

అలే చూస్తూండిపోయాడు రవి.

అతడన్నది నిజమే. బ్యాంకు గుమస్తాకి కెమిస్ట్రీలూ, జువాలజీలూ ఎందుకు? మరయితే ఈ మూడేళ్ల డిగ్రీ చదువూ నిరుపయోగమేనా?

* * *

జయంత్ డిబారయ్యాడని విని ్రమాన్పడిపోయాడు రవి.

అవినీతి విశృంఖలంగా ప్రవహిస్తోన్న పరీక్షల్లో స్క్వాడ్లూ, డిబార్లూ లాంటివి కన్నీటితుడుపు చర్యలే. అసలు పరీక్షా విధానంలో వున్న లోపాన్ని తొలగించి విద్యార్థి ప్రతిభనీ, సృజనాత్మక శక్తినీ మధించే ఏర్పాట్లుచేసిన్నాడు అవినీతి ఇంత విచ్చలవిడిగా నర్తించగలదా? అలాటి సమూల మార్పు చెయ్యకుండా చిన్న చిన్న సంస్కరణలు చేసి చేతులు దులుపుకుంటే ఏంలాభం?

డిబార్ వార్త తెలిసి తనే ఇదైపోతున్నాడే ఇక అత్తమామలెంత తల్లడిల్లిపోతున్నారో అన్పించడం ఆలస్యం ఆఘమేఘాలమీద వాళ్ళింటికెళ్ళాడు రవి.

మేనత్త చీరకొంగు నోటికడ్డం పెట్టుకుని ఓ మూల కూర్చుంది.

జయంత పొగరుగా నిలబడి పళ్ళు నూరుతున్నాడు.

కుటుంబరావుగారు రౌద్రాకారం దాల్చినట్టుగా వున్నారు. మున్నెన్నడూ ఆయన్నలాటి రూపంలో చూసవుండని రవి ఆయన మనఃస్థితినర్థంచేసుకుని కలవరపడ్డాడు.

"విన్నావా రవీ? స్క్వాడ్‌వాళ్లు వీణ్ని పట్టుకుని డిబార్ చేయించారు. బుద్ధిగా చదువుకుని వచ్చిందేదో రాయక కాపీలెందుకంట

వీడికి? ఫలానా మేస్టారబ్బాయి కాపీచేస్తూ పట్టుబడ్డాడసంతా అనుకొంటోంటే నాకెంత అప్రదిష్ట చెప్పు? నేను మొదట్నుంచీ చెబుతూనే వున్నాను చెడుస్నేహాలు చెయ్యకురా, రవిలాగా బుద్ధిగా చదువుకోరా అని. వింటేనా? ఇదిగో ఇదంతా ఆవిడచేసిన నిర్వాకం. చిన్నపిల్లాడు చిన్నపిల్లాడని నెత్తికెక్కించుకుని గారాబం చేసింది. ఇప్పుడనుభవిస్తోంది. అసలు వీడికా అడ్డదార్లెందుకట?" కుటుంబరావుగారన్నారు కోపంతో వూగిపోతూ.

"నేనేకాదు అంతా కాపీలు రాస్తున్నారు?''

"అదేరా వద్దనేదీ. చెడునిచూసి కాదు మంచినిచూసి నేర్చుకోవాలి. అంతా కాపీ చేస్తేనేం పట్టుబడిందీ, డిబారయ్యిందీ నువ్వే కదా!"

"నేనేకాదు – సర్కిలినస్పెక్టర్ గారబ్బాయి కూడా దొరికేడు. వాళ్ళ నాన్నొచ్చి అది మాఫీచేయించాడు. నన్నుమాత్రం వదల్లేదు దొంగనాకొడుకులు. అసలిదంతా పొట్టిమేస్టారివల్లే వచ్చింది. స్క్వాడ్ వాళ్ళొచ్చారని ఆ నాకొడుకు చెప్పుంటే దొరుకుదునా?" కసిగా అన్నాడు జయంత్.

"నోర్ముయ్యరా వెధవా. విద్యాబుద్ధులు చెప్పే గురువుని ట్రా తిట్టేది? కళ్లుపోతాయిరా చేసిన నిర్వాకానికి సిగ్గుపడక ఇంకా ఎగురుతున్నాడు చూడు"

"పూరుకో మావయ్యా! తెలిసీ తెలిని వయస్సు..."

"ఒంటిమీదకి పదహారేళ్లొస్తోంటే తెలీకపోవడమేమిటి? చిన్నోడా చిటికోడా తెలీదనుకోడానికి?"

"కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. అసలే బిక్కచచ్చిన బిడ్డని



మాటల్తో పొడుస్తారెందుకూ" అన్నపూర్ణ అంది కళ్ళు తుడుచుకుంటూ.

"అసలు వాణ్ని కాదు నిన్ననాలి ఇలా తయారుచేసినందుకు"

"ఇంక వూరుకో మావయ్యా..జయంత్! నువ్వు నీ గదికెళ్ళిపోరా. జరిగిందేదో జరిగిందిగాని ఇంకా విషయం మర్చిపోరా... వెళ్లు" అని జయంత్‌ని పంపించేశాడు రవి.

వుస్సురంటూ పడక్కుర్చీలో కూలబడ్డారు కుటుంబరావుగారు.

ఆయన కళ్ళల్లో కదిలిన కన్నీటిపొరని చూసి చలించిపోయాడు రవి.

* * *

పరీక్షలూ, ప్రాక్టికల్సూ అయ్యాయి.

రవి చాలా సంతృప్తికరంగా రాశాడన్నీ. దెబ్బయిశాతం మార్కులకి ఏరకంగానూ తగ్గవన్న నమ్మకం కలిగిందతడికి.

ప్రాక్టికల్స్‌లో పక్షపాత ధోరణి మాత్రం అతణ్ని బాగా కలచివేసింది.

కొందరు లెక్చరర్లు తమ అభిమాన విద్యార్థులకి అంటే ప్రయివేటు చెప్పించుకున్న వాళ్ళకి చాలా రకాలుగా మార్కులేయించారు. జువాలజీ ప్రాక్టికల్స్‌లో తేలికయిన డిసెక్షన్ ఇప్పించారు. డిసెక్షన్ ఎలాచేసినా ఎక్కువ మార్కులేయించారు. కెమిస్ట్రీలో కనుక్కోవల్సిన వాటిని ముందేచెప్పి కనుక్కోనవసరం లేకుండానే నోట్సు రాయించారు. బోటనీలో కూడా ముందే వుప్పందించారు. ఎక్స్‌టర్నల్ ఎగ్జామినర్స్‌కి అన్నిరకాల వసతులూ కల్పించారు.

ఇంటర్ పరీక్షలవుతూనే బి.కామ్ పరీక్షలు మొదలయ్యాయి. అప్పుడెవరూ వూహించని సంఘటనొకటి జరిగింది.

పరీక్ష భయంగాని, పాసవ్వననే భయంగాని శేషగిరికెప్పుడూలేవు. కాలేజీలోని చాలామంది లెక్చరర్లు కమిటీనీ, ప్రిన్సిపాల్‌నీ పూర్తిగా సమర్థించేవారవడంతో వాళ్ళనుండతడికి కావల్సినంత సహాయం లభిస్తుందనటంలో ఎలాంటి సందేహమూలేదు.

కాని ఎటువంటి ప్రలోభాలకీ లొంగని, మరెలాటి పక్షపాతాలూ చూపని లెక్చరర్లు కొందరున్నారు. వారంటే అటు కమిటీ వారికీ,ఇటు ప్రిన్సిపాల్‌కీ కూడా భయమే.

వారిలో తెలుగు హెడ్డాఫ్ ది డిపార్ట్‌మెంట్ సంపత్‌గారొకరు. ఆయనకి తెలుగు భాషమీదెంత కమేండ్ వుందో ఇంగ్లీషుమీదా అంత వుంది. క్రమశిక్షణకీ, నైతికవర్తనకీ భాష్యం ఆయన. ఆయన్ని విద్యార్థులు భక్తి భావంతో చూస్తూంటారు కూడా.

ఆయనోరోజున శేషగిరి రాస్తోన్న పరీక్షరూమ్‌కి వాచర్‌గావచ్చారు మరొకర్తో బాటు. స్ట్రిక్టుగా వుండే లెక్చరర్లని తన రూమ్‌కి వెయ్యకుండా అతడు ముందే ఏర్పాట్లుచేసుకున్నాడు. అయినా ఇలా జరిగేసరికి అతడి మొఖం తెల్లబడింది. ఒంట్లో వణకు ప్రారంభమయ్యింది.

దానికి తోడవాళ ఎకౌంట్స్ పరీక్ష. రూమ్‌లోని మిగతావాళ్ళని చూసి కాపీ కొట్టడమో,పాస్‌కని బయటికెళ్ళి పుస్తకాలలోంచి మోడల్ జవాబు చింపుకు రావడమో చేయాలప్ప ముందే కాపీలు తెచ్చుకో దానికి వీలుకాని పరిస్థితి.

స్వతహాగా ఆన్సర్‌చేద్దామని ప్రయత్నించాడుగాని ట్రయల్ బేలన్స్‌ల నుంచి బాలెన్స్ షీట్ తయారు చెయ్యలేకపోయాడు. ఏ కొద్దో తేడా వుంటే పోనీలే అనుకునేవాడుగానది లక్షల్లో వుంది.

అంటే తను పూర్తిగా పప్పులో కాలేశాడన్నమాట. ప్రిన్సిపుల్స్ తెలీవు గనుక ఏదోలా ఎడ్జస్టుచేద్దామని ప్రయత్నించి విఫలుడై గోళ్ళు కొరుక్కో సాగాడు.

అందుకే సంపత్‌గార్ని కరిచి చంపేద్దామన్నంత కోపంగా వుంది. చాలామందిలా కుర్చీలో కూర్చుని కబుర్లుచెప్పుకోవడమో, పేపర్ చదువుకోవడమో చెయ్యక ఆయన అటూ ఇటూ పచార్లు చేస్తున్నందుకు మరీ అసహనంగా వుంది. కనీసం ముందున్న వాడితో చూపించమని చెప్పడానికూడా వీల్లేకుండా వుంది.

చూసిచూసి ముందున్నవాణ్ని గోకాడు. సంపత్‌గారెక్కడ చూస్తారో అని కంగారు పడుతోన్న అతడు మరీ కంగారుపడ్డాడు. అదాయన గమనించనే గమనించారు.

''ఏం జరిగింది?"

''మరండీ....''

''నీళ్ళునమలకుండా చెప్పు"

శేషగిరిని చూపించాడు.

''మిస్టర్ శేషగిరీ...మైండ్ యువర్ బిజినెస్''

ఆ వార్నింగ్‌కి శేషగిరి మొఖం చెక్కిన కందగడ్డలా అయ్యింది.

మరికాస్త టైము గడిచినా పరిస్థితిలో మార్పురాలేదు. ఇలాగే మీనమేషాలు లెక్కిస్తూకూర్చుంటే తను ఎక్కౌంట్స్‌లో ఫెయిలవడం ఖాయమని తెలిసిపోయింది. దాంతో వెర్రిధైర్యం వచ్చిందతడికి.

"ఒరే...చూపించరా" అన్నాడు చొక్కా లాగుతూ.

అతడు చూపించలేదు. తల తిప్పలేదు.

మరికాస్సేపు బతిమాలినా లాభంలేక పోయేసరికి సంపత్‌గారు మరో పక్క





కెళ్ళగానే గబుక్కున ముందతను రాసేసిన ఆన్సర్ షీట్స్‌లోంచొకటి లాగేసుకున్నాడు.

సంపత్‌గారు చటుక్కున చూడటం, "నా పేపర్" అంటూ ముందు కుర్రాడు లేవటం ఒక్కసారే జరిగిపోయాయ్.

పరుగులాంటి నడకతో వచ్చేశారాయన.

"స్టేండప్ మిస్టర్ శేషగిరీ"

"ఎందుకు?"

"ముందులే...చెబుతాను"

"ఎందుకో చెప్పండి లేస్తాను"

"ఐసీ. ముందు నీ షీట్సన్నీ ఇలా ఇవ్వు"

"రాసుకొంటోంటే డిస్టర్బ్ చేస్తారెందుకు?"

"షటప్" అంటూ షీట్లు లాక్కుని "ఇదెవరిది?" అని గర్జించారు.

"నాదే"

"కాదు నాదండీ" ఏడుపు మొఖంతో అన్నాడు ముందు కుర్రాడు.

తన మాటకడ్డొస్తూ అతడలా అనడంతో అతడి డొక్కలో పొడిచాడు శేషగిరి.

"అమ్మో" అంటూ కూర్చుండిపోయా డతడు డొక్కపట్టుకుని.

"స్టేండప్ మిస్టర్ శేషగిరీ...కమాన్"

"నేను రాను"

"అయామ్ టెల్లింగ్యూ ఎగైన్... కమాన్"

"రావాల్సిన అవసరం లేదు నాకు. ముందు నా పేపర్లివ్వండి. లేకపోతే దౌర్జన్యంగా లాక్కున్నారని కేకలు పెడతాను"

"దెన్ డు దట్ ఫస్ట్"

ప్రిన్సిపాల్‌గారికి కబురంపి ప్యూన్ని కూడా పిలిచారు.

"అతణ్నిలా లాక్కురా"

ప్యూన్ అయోమయంగా చూస్తోంటే

ఏమనుకున్నాడో ఏమో లేచి వచ్చేశాడు శేషగిరి.

ప్రిన్సిపాల్‌గారు రాగానే విషయం చెప్పి ఆ సంగతి ఆన్సర్‌షీట్ మీద రాసే శారు సంపత్‌గారూ, మరొకాయనా.

"యు కెన్‌గో" ప్రిన్సిపాల్‌గారన్నారు అతికష్టంమీద గొంతు పెగల్చుకుని.

"బయటికిరా. నీ అంతు చూడకపోతే నా పేరు శేషగిరే కాదు" అని బెదిరించి మరీ వెళ్ళిపోయాడతడు.

అది వట్టిబెదిరింపుకాదని ఆ మర్నాటికి గానీ తెలీలేదందరికీ.

ఆ సంఘటన జరిగిన రాత్రే సంపత్‌గారు ఎక్కడికో వెళ్ళి తిరిగొస్తోంటేచీకట్లో ఓవ్యక్తి ఎదురొచ్చి సైకిలాపి ఆయన డొక్కలో చాకు దింపి పారిపోయాడు.

ఆయన కేకలకి పోగైన జనం వెంటనే ఆసుపత్రిలో చేర్చారు.

పోలీసులు కేసు రిజిస్టర్ చేసు కున్నారుగాని ఎవర్నీ అరెస్ట్ చెయ్యలేదు!

ఆసుపత్రికెళ్ళి సంపత్‌గార్ని పరా మర్శించారు రవీ, తదితర విద్యార్థులూ.

"నన్ను పొడిచినందుకు బాధగాలేదు. ఇప్పటికీ తన తప్పు తెలుసుకోనందుకే బాధగా వుంది" అన్నారాయన.

తనమీద హత్యాప్రయత్నం చేసింది శేషగిరేనని ఆయన నమ్మకం. కానా సమయంలో తను మరో ఊళ్ళో వున్నట్టు సాక్ష్యాధారాలు చూపించడంతో అతణ్ని అరెస్ట్ చెయ్యలేదు పోలీసులు.

పోలీసుల చిత్తశుద్ధి తెలిసిందే గనుక ఈ కేసు ఎప్పటికీ తేలదని అప్పుడే తెలుసుకున్నారు చాలామంది!

*　　　*　　　*

హాస్టల్ ఖాళీచేసి వచ్చేశాడు రవి.

జీవితంలో ఓ ముఖ్యఘట్టం ముగిసింది. చదువులో ప్రాథమిక దశ పూర్తయ్యింది.

ఏ రకంగా పేపర్లు దిద్దినా తనకి క్లాసు రావడం ఖాయం. మెడికల్ ఎంట్రన్స్ కెళ్ళడానికి సెకండ్‌క్లాస్ చాలు గనుక ఇక ఆ ప్రయత్నాలు ప్రారంభించాలను కున్నాడు.

"మెడికల్ ఎంట్రన్స్‌కిగాని, ఇంజనీరింగ్ ఎంట్రన్స్‌కిగాని వెళ్ళాలంటే కోచింగ్ తప్పనిసరి. క్లాసు పరీక్షలకీ, వీటికీ అసలు పోలికేలేదు. ప్రశ్నల్లోనూ, ప్రశ్నించే పద్ధతిలోనూ, ఛాయిస్‌లోనూ హస్తిమశకాంతరం వుంది" అన్నాడు శివాజీ.

"కానీ కోచింగ్ ఫీజు చాలా ఎక్కువ. ఓ రెండు నెలలపాటు రూమ్ తీసుకు నుండాలి. హోటల్లో భోంచెయ్యాలి. మొత్తంమీద రెండువేల వరకూ అవుతుం దనుకుంటాను" అన్నాడు రవి.

"అవుతుంది మరి. దానికితగ్గ ఉపయోగమూవుంటుంది. కోచింగ్ తీసుకు నుంటే నేనిప్పుడు అయ్యేయస్ ట్రైనింగవుతూండేవాణ్ని" శివాజీ కళ్ళు ఆశాపూరితాలయ్యాయి.

"పోన్లెండి. దానిని మించిన ఛాన్స్ వస్తాయి" ఓదార్పుగా అన్నాడు.

"ఏం వస్తాయ్ ? ఎక్కడ చూసినా లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం, రికమండేషన్లూ! లెక్చరర్ పోస్టుకి ట్రై చేశాన్లే. కొందరు ప్రైవేటు కాలేజీవాళ్ల 20 – 30 వేలు డొనేషన్లిమ్మన్నారు. కొందరు పూర్తి జీతానికి సంతకం పెట్టి సగం జీతం తీసుకోవాలని షరతు పెడు తున్నారు. మరికొందరు యమ్.ఫిల్. కావాలంటున్నారు"నిస్పృహగా అన్నాడు.

"మీలాంటి ఇంటెలిజెంట్‌కి ఏదొకటి వస్తుందిలెండి"

శివయ్య మాస్టారొచ్చారు బడినుంచి. రవిని చూశారుగాని పలక రించలేదు. ముభావంగా వుండిపోయారు.

శివాజీ అయ్యేయస్ పరీక్ష తప్పి నప్పట్నుంచీ బెంగగా దిగులుగా వుంటు న్నారాయన. ఎవ్వర్తోనూ ఎక్కువగా మాట్లాడటంలేదు. ఇదివరకట్లా వసపోసి నట్లు వాగటంలేదు. ఆఖరికి ముక్కు పొడుం డబ్బాని కూడా పట్టించుకోవటం లేదు. ఆయన్లో ఎంత మార్పొచ్చి వుంటుందో ఎవరైనా వూహించుకోవచ్చు. తనలోతాను గొణుక్కుంటూండటంకూడా మొదలయ్యిందీమధ్య.

"బ్యాంకులో క్లరికల్ పోస్ట్సుకి ప్రకటన వచ్చింది. అప్లై చెయ్యనా?" చిన్నగా అడిగాడు శివాజీ.

ఓ క్షణం కొడుకుపంక పిచ్చిగా చూశారు మాస్టారు. "ఇంత బతుకూ బతికి ఇంటెనకాల చచ్చినట్టు పదిమంది మీద అజమాయిషీచేసే ఆఫీసరు కావల్సిన వాడివి ముష్టి గుమస్తా వుద్యోగానికెళ్తా వ్రటా?"

ఆయన కళ్ళల్లో నీళ్లు! గొంతులో సుళ్లు తిరిగిన బాధ!

తలొంచుకున్నాడు శివాజీ.

రవి గుండె బరువెక్కింది.

* * *

"డాక్టర్ కోర్సు చదవాలనుంది. అందులో చేరాలంటే ముందో పరీక్ష పాసవ్వాలి. దానికి కోచింగు తీసుకుంటే బావుంటుంది నాన్నా. ఎంతలేవన్నా పది హేనొందలవుతుంది" తండ్రి మొఖంలోకి సాభిప్రాయంగాచూస్తూ అన్నాడు రవి- రాత్రి భోజనాలయ్యాక పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చున్నప్పుడు.

రవి తన మనస్సులోని మాటని ప్రథమంగా బయటపెట్టటంతో అదిరిపడి చూశారు రామయ్య దంపతులు. వారి చూపులు జాలిగా మారాయి.

డాక్టర్ కోర్సంటే వందల్తో పనికాదు వేలమూటతో పని. తనలాంటి బక్కరైతు కది గగనకుసుమం. చదివిన చదువుతో చాలించి ఏ వుద్యోగమో చూసుకుని కుటుంబానికి ఆధరువుగా నిలబడితే సంసా రమో ఒడ్డుకి చేరుతుంది. లేకపోతే అటు అప్పులకి వడ్డీలు కట్టలేక, ఇటు సంసా రపు బండి నీడ్వలేక చతికిలబట్టం తప్ప ఏం చెయ్యగలడు తను? చదువుకున్న వాడూ, పెద్దకొడుకూఅయిన రవి పరిస్థితి అర్థంచేసుకుని చేదోడు అవుతాడని తామాశిస్తోంటే వాడేమో పైపైకి చూస్తు న్నాడు. ఇద్దరికీ లంగరు కుదుర్తుందా?

'ఏవిటో వెధవ బతుకు! చక్కగా చదువుకుంటూ గబగబా మెట్లెక్కుతున్న బిడ్డ పైపైకి వెళ్తానంటే చదివించలేని అసమర్థుడైపోయాడు. 'నేనింక చదివించ లేన్నా, నీ కష్టంతో మమ్మల్ని గట్టె క్కించరా తండ్రీ' అని ఏ మొఖంతో చెప్పగలడు?

రామయ్యగారి మనస్సు గానుగలోని చెరుకులా నలిగిపోతోంది.

"మాట్లాడవేం నాన్నా"

"కాలూ, చెయ్యీ కూడదీసుకోవడమే కష్టంగా వుందిరా. ఇంక...."

'ఏవో తిప్పలుపడి నిన్నింతవరకూ చదివించారు మీ నాన్న. పెద్దోడివై నందుకు నువ్వేదో దారి చూసుకుని నీ తర్వాతోళ్ళకోదారి చూపించాల' అందా మనుకున్న శాంతమ్మ కొడుకు మొఖం చూసి మరి నోరు తెరవలేకపోయింది.

"నిన్ను కాలేజీలో చేర్చడానికే వెనకా ముందూ చూసుకోవడం నీకు తెలుసు

కదుర్తా. ఇప్పుడు మళ్ళీ అయిదారేళ్ళ కోర్సంటే ఎంతలేదన్నా ఏడాదికి నాలు గయిదువేలు కావాలి...
కాలూ, చెయ్యీ కూడదీసుకోలేకపోతున్న ఈ పరిస్థితిలో..."

"అవన్నీ ఆలోచించాను నాన్నా ప్రభుత్వం మనలాటివారికి లోన్‌స్కాలర్ షిప్పు ఇస్తోంది. చాలా బాంకులు చదువు కోసం ప్రత్యేకంగా అప్పులిస్తున్నాయి. తర్వాత ఉద్యోగమో, వృత్తో చేసుకునే ప్పుడు వాయిదాలుగా అప్పు తీర్చు కోవచ్చు. అంచేత మెడికల్ కాలేజీలో చేరేవరకూ ఖర్చులన్నీ ఎలాగో భరిస్తే ఆతర్వాత ఆ అప్పుగురించి ప్రయ త్నిస్తాను" దృఢచిత్తంతో అన్నాడు రవి.

"నేను పుట్టి పెరిగిందే అప్పుల్లో అని ఇదవుతోంటే ఇక నువ్వు కూడా.... సరేలే. ఎలా జరగాలని రాసుంటే అలా జరుగుద్దిగాని తర్వాతి సంగతి తర్వాత చూద్దాం. డబ్బు గురించి రేపు సోమయాజులుగార్నడిగి వస్తాను ఏమైనా అప్పిస్తారేమో"

"చెయ్యండి... చెయ్యండి. అప్పుమీద అప్పుచేసి ఆఖరికి మిగిలిన పిల్లలకి సెంటుభూమికూడా మిగల్చకండి. ఇంకో ఏడాదో రెండేళ్లోపోతే అమ్మాయి పెళ్ళి కెదుగుద్ది. దాని పెళ్ళే చేస్తారో,పీకపిసికేసి గోదాట్లో పడేస్తారో మీ ఇష్టం" ఎన్నడూ లేంది గుండెల్లోని భయాలన్నీ వెళ్ళగక్కి ఏడ్చేసింది శాంతమ్మ.

దిమ్మెరబోయారు తండ్రీ కొడుకులూ.

"వూరుకోవే! చూస్తున్నావుగా... నేనే మయినా చెయ్యాలని చేస్తున్నానా చెప్పు? అన్నీ ఆలా తోసుకొచ్చి అప్పుల్లో కూరుకుపోయానుగాని అప్పులు చెయ్యడం నాకు మాత్రం సరదాయా?" ఆవేదనగా అన్నారాయన.

"అది కాదండీ...ఇప్పటికే అప్పులు తడిసి మోపుడయ్యాయ్. ఇంటి ఖర్చు పెరి గింది. రాబడి తగ్గింది. ఇంకా అప్పులుచేస్తూ పోతే..." దుఃఖం ఆమె కంఠాన్ని పూడ్చెయ్యడంతో ఆగిపోయిందావిడ.

"నువ్వన్నదీ నిజమేనే. కాని..."

"నాకంతా అర్థమయ్యింది నాన్నా! ఇప్పుడు నా గురించి మళ్ళీ అప్పుచెయ్యొద్దు. కోచింగు తీసుకుంటేనే పరీక్ష పాసవ్వను. నేనింటిదగ్గరుండే బాగా ప్రిపేరవుతాను. నా గురించి మీరేం బెంగపెట్టుకోకండి. సాధ్యమయినంతవరకూ నా బరువు మీమీద పడనివ్వను. సీటొస్తే మెడికల్ కాలేజీలో చేరటానికి తోడ్పడితే చాలు. మిగతా ఖర్చులకి నేనేర్పాటు చేసు కుంటాను" అన్నాడు రవి.

కన్నీటి తెరల్లోంచి కొడుకువంక ఆవేదనగా చూస్తూండిపోయారా తల్లి దండ్రులు.




ఆషాడమాసం ప్రవేశించి రెండ్రోజు లయ్యిందో లేదో కారుదున్నల్లాంటి మేఘాలు ఆకాశంలో పరుగులెత్తాయ్.

కుంభవృష్టిగా కురిసింది వర్షం.

కాస్త తెరిపివ్వగానే రైతన్నలు నాగళ్ళు భుజాన వేసుకుని పొలం వెళ్ళారు.

పొలం దున్ని వరినారు వూడుస్తోంటే రవి తండ్రికి అన్నంమూట పట్టుకెళ్తూ




సాయపడుతున్నాడు.

నారు తక్కువవడంతో పొరుగూళ్ళో దొరుకుద్దేమో చూసొస్తానని వెళ్తూ దగ్గరుండి వూడ్పించమని రవికి చెప్పారు రామయ్యగారు.

ఆయనటు వెళ్ళగానే చొక్కా తీసేసి లుంగీ కట్టుకుని చేలో దిగాడు రవి.

ఇన్నాళ్ళూ గట్టుమీదుండి చూడటమే గాని చేలో దిగలేదెన్నడూ.

వూడ్పు వూడుస్తోన్న ఆడవాళ్ళూ దమ్ముచేస్తూ ఆకు కట్టలందిస్తోన్న మగాళ్ళూ కూడా ఆశ్చర్యంగా చూశారు.

"పెదకాపుగారుచూస్తే కోప్పడతారు" అన్నా రొకరు ఓపక్క సంతోషపడుతూనే.

''ఫర్లేదులే... కానివ్వండి'' ఓ కర్ర తీసుకుని తనూ దమ్ము చెయ్యసాగాడు.

''దమ్ము సేత్తే సాల్దయ్యగోరూ... కట్టలందివ్వాల'' ఒకామె అంది నవ్వుతూ.

అలాగే అంటూ అందివ్వసాగాడు.

వాళ్ళేదేదో అంటూ హాస్యమాడి హాయిగా నవ్వేశారు. రవీ శృతికలిపాడు.

అలా పనిచేస్తున్నందుకెంతో ఆనందంగా వుంది రవికి.

ఆడవాళ్ళో పాట అందుకున్నారు.

ఆ పాటలు బహు చమత్కారమైనవి. వాటిలో ఎక్కువగా కొంటెతనం, శృంగారం కొట్టొచ్చినట్లు కన్పిస్తాయిగాని వాటి వెనుకనున్న గుండెలలోతులు కూడా అదే సమయంలో మన గుండెల్ని స్పృశిస్తాయ్. ఒకోసారి పగలబడి నవ్విస్తూనే బొటబొట కన్నీళ్ళు కార్పిస్తూంటాయ్.

ఆ సాహిత్యం ఎప్పుడెలా పుట్టిందో గాని ఒక తరంనుంచి మరో తరానికి సజీవ స్రవంతిలా ప్రవహిస్తూనే వుంది. తమ తమ పడికట్టు మాటల్నీ, భావాలనీ, ఆచారాలనీ కలుపుకుంటూ; సింగారాలు నింపుకుంటూ - నిత్యనూతనంగా, ముగ్ధ మనోహర వాహినిలా పరుగులు పెడుతూనే వుంది. అవి ప్రకృతి ఆలాపిస్తోన్న మధురగీతాల్లా గుండె గొంతుక లొక్కటై పాడుతోన్నట్లు అన్పిస్తాయ్.

ఇంతలో సూర్యుడు పడమరకి కొంచెంగా వంగటంతో భోజనానికి లేచారంతా.

కూలీలు కాళ్ళూ, చేతులూ కడుక్కుంటూ, అన్నం మూటలు విప్పుతూ కూడా సన్నగా పాడుకుంటూండటం విన్నాడు రవి.

రవి కాళ్ళుకడుక్కొచ్చి కేరియర్ విప్పుతోంటే ''సువ్వూ పన్సేసేవేంట్రా అన్నయ్యా?'' అనడిగాడు కేరియర్ తెచ్చిన తమ్ముడు.

నవ్వి వూరుకున్నాడతడు.

"మా కూరేసుకుంటా రా అయ్యగోరూ" నవ్వుతూ అడిగిందొకామె అన్నం తినబోతూ.

రవి నవ్వడంతో అతడి తమ్ముణ్నడిగింది. ''ఛీ... మేం తినం'' అన్నాడు వాడు.

''ఏందా...మాది కూర కాదా?''

"మీరు మాలోళ్ళు''

అదిరిపడ్డాడు రవి. పట్టుమని ఎనిమిదేళ్ళైనా లేని పసి హృదయంలో కుల భేదాలు నాటుకున్నాయంటే పరిసరాల ప్రభావం ఎంతటిదో కదా అని విస్తుపోకుండా వుండలేకపోయాడు.

మళ్ళీ చేలో దిగారంతా వుత్సాహంగా. పొద్దువాలేక పనిలోంచి లేస్తోంటే రామయ్యగారొచ్చారు. ''పని బాగానే తెమిలిందే'' అన్నారు.

రవి కూడా చేలో దిగినసంగతి విని ''నువ్వెందుకు దిగావురా! నువ్విలాటి మోటుపన్లు చెయ్యగలవా ఏమన్నానా'' అన్నారాయన ఓ చెంప సంతోషిస్తూనే.

ఇంటికెళ్ళి స్నానంచేసి భోంచేశాడో లేదో తలపోటు వచ్చింది రవికి. పగలంతా ఎండలో పనిచేశాడు మరి. పైగా అలవాటులేని పని. మర్నాటికి స్వల్పంగా జ్వరం కూడా తగిలింది.

* * *

ఇంటర్మీడియట్ రెండో సంవత్సరపు పరీక్షా ఫలితాలొచ్చాయ్.

రవి ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు.

అతడి ఆనందానికవధుల్లేకపోయాయ్. అప్పుడే మెడిసిన్లో జేరినట్టూ, డాక్టరై వచ్చి పల్లెలో ప్రాక్టీసు పెట్టినట్టూ, కూలి నాలి జనావళికి వుచితవైద్యం చేస్తున్నట్టూ తీయని అనుభూతి అతడి శరీరంలోని ప్రతి అణువునీ సమిలేస్తోంటే హాయిగా, సిగ్గుగా నవ్వుకున్నాడు.

ఇక అతడింట్లోవారి సంగతి చెప్పనే అక్కర్లేదు. వారి కళ్ళల్లో కోటి జ్యోతులు వెలిగాయి. చానాళ్ళ తర్వాత పరమానందంతో పరవశించిపోయారు. భవిష్యత్తులోకి ఆశగా, నమ్మకంగా చూడసాగారు.

క్షణాల్లో వార్త పల్లెని చుట్టేసింది. అభినందించి "మీ నాన్న పరిస్థితి ఆలోచించు మరి" అన్నారు జీవితపు లోటుపాట్లూ, ఆటుపోట్లూ తెలిసిన కొందరు సన్నిహితులు.

ఆ సంగతతడికీ తెలుసు. అంచేతే ఓ బాంకులో ఎడ్యుకేషన్ లోన్ గురించి వివరాలన్నీ సేకరించి సీటు వస్తే లోను రావటం గ్యారంటీ అన్న ధీమా కలగ్గా మెడిసిన్ చదువుతానని చెప్పగలిగాడు.

మార్కుల లిస్టు వచ్చింది. రవికి అరవై తొమ్మిది శాతం మార్కులొచ్చాయి. రెట్టించిన వుత్సాహంతో మెడికల్ ఎంట్రన్స్‌కి అప్లైచేశాడు.

ఎంట్రన్స్‌కి కోచింగిచ్చే కొన్ని ప్రైవేటు కాలేజీల్లో స్వయంగానూ, పోస్టుద్వారానూ వాకబు చేశాడు. కాని, వాళ్ళు వసూలుచేసే ఫీజులు చూసి మరా సంగతి ఎత్తకుండా స్వయం కృషిమీద ఆధారపడసాగాడు.

ప్రవేశ పరీక్ష రాయడానికి గుంటూరు వెళ్తానంటే రామయ్యగారు అడ్డు చెప్పలేదు. ఒక ఎకరం పొలం అమ్మైనా చదివించాలను కుంటున్నారాయనిప్పుడు. ఫస్ట్‌క్లాస్‌తో పాసైనందున తల్లి కూడా అదే మాటంటోంది. పెద్ద బిడ్డ పైకొస్తే మొత్తం కుటుంబం పైకొచ్చినట్టేనని సరిపెట్టుకున్నారు. అప్పుచేసి డబ్బు తెచ్చి ఇచ్చారాయన.

మెడికల్ ఎంట్రన్స్ రాయడానికొచ్చిన యువకుల్తో గుంటూరు పట్నమే నిండిపోయినట్టుంది. ఏ లాడ్జీలో కూడా ఖాళీల్లేవు. చిన్న చిన్న లాడ్జి గదుల్లో ఇద్దరూ ముగ్గురూ కూడా సర్దుకుంటున్నారు. రవి కూడా అలా సర్దుకోక తప్పింది కాదు.

పరీక్ష రాయడానికి మెడికల్ కాలేజీలో అడుగుపెడుతోంటే వింత అనుభూతి కలిగిందతడికి. ఎత్తయిన భవనాలు, మధ్యలో చక్కని గార్డెన్, గార్డెన్ మధ్యలో గ్రీకు హీరోల శిల్పాలు....!

తన కలల ప్రపంచం కళ్ళ ముందు నిలిచేసరికి స్వర్గం చేతికందినట్టు అపూర్వానుభూతిననుభవించాడు రవి.

పరీక్షలు సంతృప్తికరంగానే రాశాడు. కాని శివాజీ హెచ్చరించినట్టు తను అలవాటు పడ్డ పద్ధతికీ, ఈ పరీక్షా పద్ధతికీ ఎక్కడా

పోలికే లేదు. దానికితోడు పరీక్ష రాసిన వాళ్ళంతా క్లాసు స్టూడెంట్లే. 45%మార్కు లొచ్చినవాళ్ళంతా పాసయినట్టేనని ప్రకటించే పద్ధతి కాదిది. ఎక్కువ మార్కులెవరికొస్తే వారినిమాత్రం సెలక్ట్ చేసుకునే కాంపిటీషన్ పద్ధతి. ఎన్ని సీట్లుంటే అందరు మాత్రమే సెలక్టవుతారు. ప్రత్యేక కోచింగులు తీసుకున్న వాళ్ళకి, విద్యాబోధన బాగున్న కాలేజీల్లో చదివినవాళ్ళకి అవకాశాలెక్కువ వుండటం సహజం. ఆ రెండూ లోపించిన రవికి స్వీయ ప్రతిభా, కృషీ మాత్రమే తోడునిలిచాయి.

ఒక నెల రోజుల్లోనే ఫలితాలు వెలువడ్డాయ్.

అదురుతోన్న గుండెల్తో పేపర్ చూశాడు రవి.

గుండె చలనం ఆగినట్టు, సర్వావయవాలూ స్తంభించినట్టు, గాలి ఆగినట్టు పట్టపగలే కారుచీకట్లు కమ్మినట్టు, భూమి కంపించినట్టు, ఆకాశం బద్దలయినట్టు అన్పించిందతడికి!

కళ్ళముందు మసకచీకట్లు!
కళ్ళనుండి కన్నీటిధారలు!
గుండెల్లో డెనమైట్ల నాదాలు!
మెదళ్ళో వుప్పొంగిన మహాసదులు!

"ఏమయ్యింది? పాసయ్యావా?" ఎవరెవరో ఏదేదో అడుగుతున్నారు. నిర్వికార స్థితికి చేరుకున్నట్టు, ప్రాపంచిక సుఖ దుఃఖాలకతీతుడయినట్టు నడుస్తున్నాడు రవి.

ఇంటికెళ్ళి మహావృక్షం కూలిపోయినట్టుగా మంచంమీద కూలబడ్డాడు.

దుఃఖం ఉవ్వెత్తున పొంగిరాగా బావురుమన్నాడు చిన్నపిల్లాడిలా.

* * *

ఫలితాలుతెలిసి వారంరోజులు కాలేదు.

కానీ కొద్ది సమయంలోనే రవి రూపురేఖలు మారిపోయాయి. మృత్యుముఖం నుండి బయటపడ్డ వాడిలా వున్నాడిప్పుడు.

ఆచారి డాక్టరొచ్చి మందులిస్తున్నాడు. ఇంజెక్షన్లు చేస్తున్నాడు.

ఆయన మెడలోని స్టెతస్కోప్ని చూస్తోంటే రవి కళ్ళనుండి రక్తాశ్రువులు జారుతున్నాయ్.

ఏ గాలో సోకిందని మంత్రగాణ్ని పిలిచి తాయెత్తులుకట్టించి క్షుద్రశక్తి పూజ చేయిస్తున్నారు.

వారి నమ్మకాలూ, అతడి పిచ్చితంతూ చూస్తోంటే నవ్వొస్తోంది రవికి.

కాని, దేనికీ ఎలాటి గుణమూ కనిపించకపోయేసరికి ఇంటిల్లపాదీ భయంతో వణికిపోసాగారు. చెట్టంత కొడుకు చేజారిపోతాడేమోనని విలవిల్లాడసాగారు.

శాంతమ్మ మాతృ హృదయం కన్నీరు మున్నీరుగా విలపిస్తోంటే రామయ్యగారికంతా అయోమయంగా, దిక్కుతోచకుండా వుంది.

అటువంటి సమయంలో సంగతి తెలిసి కుటుంబరావుగారు పరుగెత్తుకొచ్చారు.

ఆయన తరచి తరచి అడిగేసరికి గుండెల్లో గూడుకట్టుకున్న బాధనంతా ఆయనముందు గుమ్మరించాడు రవి. మెడిసిన్ చదవలేకపోతే తన బతుకువృథా అన్నాడు. తన ఆశయం కార్యరూపం దాల్చకపోతే తను బతికి లాభం లేదన్నాడు.

నవ్వొచ్చిందాయనకి.

"చదువుకున్నవాడివి, తెలివైనవాడివీను. ఈమాత్రందానికే అంత నిరాశపడాలా చెప్పు? ఎదురుదెబ్బ తగిలిన ప్రతివాళ్ళూ నీలాగే నిరాశతో నీరసపడిపోతే లోకం ఇవాళలావుండేదా చెప్పు?




ఏం చేసినా, ఏది సాధించినా ఆశతోనేగాని నిరాశతో ఏమీ చెయ్యలేం. ఓటమికి బెదరి వెన్నిచ్చి పారిపోకూడదు రవీ... ఓటమిని సవాల్ గా స్వీకరించాలి. ఆత్మవిశ్వాసంతో మరిన్ని శక్తులు సమకూర్చుకుని ముందడుగు వెయ్యాలి. అలాటి ధీరోదాత్తుణ్నే విజయం వరిస్తుంది" అన్నారాయన.

రవి లేచి కూర్చుని విస్మయంగా చూడసాగాడాయనవంక. ఆయన బతకలేని బడిపంతుల్లాగానూ, బతుకు బరువుకి నడుం వంగిన సగటుమనిషిలానూ కన్పించడం లేదిప్పుడు. ఒక గురువుగా, కర్తవ్య బోధకుడిగా, వెన్నుతట్టి విజయంవైపు నడిపించే శక్తిగా కన్పించసాగారు రవికి.

"ఈ ఏడాది ఎంట్రన్స్ తప్పితే ఇంకెప్పుడూ మెడిసిన్లో సీటు రాదనెందుకనుకోవాలి చెప్పు? వచ్చే ఏడాది పాసవొచ్చు. ఇతర రాష్ట్రాల కాలేజీల్లో సీటు రావొచ్చు. అదీ ఇదీ కాకపోతే డిగ్రీ పాసయ్యాక కూడా మెడిసిన్ కెళ్లొచ్చు. బాగా అర్థంచేసుకోడానికీ, మొదటిసారే ప్రతి పరీక్షా పాసవ్వడానికీ డిగ్రీవుంటే బాగా తోడ్పడుతుందని ఎవరో చెప్పగా విన్నానుకూడా. మెడిసిన్లో చేరేక పరీక్షలు తప్పి ఏడెనిమిదేళ్ళలో ఆ డిగ్రీ పాసయ్యేవాళ్ళెక్కువగా వున్న ఈరోజుల్లో రెండు మూడేళ్ల ఆలస్యంగా మెడిసిన్లోచేరి కోర్సైన వెంటనే డిగ్రీ తీసుకోవడమూ వుత్తమమేగా. ఇప్పుడు చెప్పు నీ ధోరణికేమైనా అర్థంవుందా? సీటు రానప్పుడు మరెంత పట్టుదలతో, దీక్షతో చదివి సాధించాలి తప్ప ఇలా దిగులుతో దిగాలుగావడి కూర్చుంటే సాధించగలిగేది శూన్యం. లే...ఇంకలాటి అనుమానాలేం పెట్టుకోకుండా రేపొచ్చి బి.యస్సీలో చేరు. వచ్చే ఏడు మెడిసిన్లో సీటెందుకురాదో చూద్దాం"

ఆయన మాటల్లో ఓదార్పువుంది. ధైర్యంవుంది. సత్యంవుంది. చల్లదనం వుంది. వీటన్నిటినీమించి ఆశావుంది.

మనిషి మనుగడకి మూలధాతువు ఆశే. మనిషిని నడిపించేదీ, నిర్వీర్యుడు కాకుండా చూసేదీ, చైతన్యంతో నింపేదీ, అసాధ్యాలని సైతం సాధ్యాలు చేసేదీ ఆశే!

కుటుంబరావుగారి మాటలు టానిక్కుల్లా పనిచేశాయ్.

రవిలో జీవకళ తొంగిచూసింది.

చైతన్యం పురివిప్పింది.

భవిష్యత్తులోకి ఆశగా, ధీమాగా చూడసాగాడు.

* * *

అప్పటికే కాలేజీలు తెరిచి దాదాపు మూడు నెలలవుతోన్నా రవి ఎలాగో బి.యస్సీలో చేరాడు. తనతో ఇంటర్ చదివి పాసైనవాళ్ళు చాలామంది ఫస్టియర్లోనే వున్నారు. కొందరు అగ్రికల్చరల్ బి.యస్సీకి, బి.వి.యస్సీకి వెళ్ళారు. ఫెయిలైనవాళ్ళు సెప్టెంబరుతో కుస్తీపడుతున్నారు.

ఇంటర్లో అన్ని సబ్జక్టులకీ ప్రైవేట్లు పెట్టిన చక్రవర్తి మెడికల్ కాలేజీలో లక్ష రూపాయలు డొనేషన్ చెల్లించి చేరాడని తెలిసేసరికి రవి గుండెలు బాధగా మూలిగాయి.

తనో 40 వేలు కేపిటేషన్ ఫీజు కట్టగలిగితే కాకినాడ మెడికల్ కాలేజీలో సీటు వచ్చేది. లక్ష అయితే విజయవాడ మెడికల్ కాలేజీలోవచ్చేది! ఒకవేళ వీటిల్లో రాకపోయినా డబ్బుంటే కర్ణాటకలో పుట్టగొడుగుల్లా వెలసిన ప్రైవేటు మెడికల్ కాలేజీల్లో తప్పకుండా వచ్చేది!

కేవలం 45% మార్కులొచ్చిన తన హాస్టల్ రూమ్మేట్ దేవిడ్‌కి రిజర్వేషన్ల కోటా కింద గవర్నమెంట్ మెడికల్ కాలేజీలో సీటొచ్చిందని విని విచారించ కుండా వుండలేకపోయాడు రవి.

వెనుకబడ్డకులాలనీ, తరగతుల్నీ అన్నివిధాలా ప్రోత్సహించాల్సిందే. వారి వెనుకబడ్డతనాన్ని రూపుమాపాల్సిందే. అందుగ్గాను ఆర్థిక సాయం చెయ్యడం తప్పనిసరి కూడా. అలాగని కులరీత్యా ముందున్నా ఆర్థికంగా వెనుకబడ్డవారికి ఆర్థికంగా చేయూతనివ్వకపోతే ఎలా? రిజర్వేషన్లంటూ కొన్ని సీట్లని వారికి కేటాయించి ప్రతిభగల విద్యార్థులకి ద్రోహం చెయ్యడం ఎలా సమంజస మవుతుంది?

బియస్సీ రాంక్‌తో పాసైన జార్జి యూనివర్శిటీకెళ్ళి యమ్మెస్సీలో జేరాడు. మరికొందరు సంఘ ముఖ్య కార్యకర్తలు కూడా చదువైపోవడంతో పైచదువులకి కొందరూ, బతుకుతెరువుకోసం కొందరూ వెళ్ళిపోయారు. దాంతో సంఘంలో ఒక రకమైన స్తబ్దత తాత్కాలికమే అయినా ఏర్పడింది.

ఎకౌంట్స్ పరీక్ష రోజున కాపీ చేస్తూ పట్టుబడ్డ శేషగిరి మరెలా మేనేజ్ చేసుకున్నాడో గాని ఆ గొడవని మాఫీ చేయించుకున్నాడు. సెప్టెంబరుకి సిద్ధమవుతున్నాడు.

ప్రిన్సిపాల్ గారూ,వార్డెన్ సుందర్రావు గారూ కలిసి కుట్ర పన్ని సంఘ కార్య క్రమాల్లో చురుగ్గాపాల్గొనే విద్యార్థులెవ్వరికీ ఈసారి హాస్టల్లో సీటివ్వలేదు.

ప్రకాష్ మొదలైన వాళ్ళు సుందర్రావుగార్నడిగితే — "వెనుకబడ్డ కులస్తులకీ, మంచి నడవడి కలవారికి మాత్రమే సీట్లివ్వడం జరిగింది. వాళ్ళకే నిజానికి హాస్టల్ వసతి కావాలి. మిగిలిన వాళ్ళకి సంఘాల్లో తిరగటం, తిరగ బడటంతోనే సరిపోతుంది గనుక వాళ్ళకి ఇవ్వలేదు" అన్నారు.

"అందరికీ అదే బేసిస్‌మీద సీట్లిచ్చారా? వున్నత వర్గంవారికెవ్వరికీ ఇవ్వలేదా?" అని సూటిగా అడిగేసరికి, "ఇంకా కొన్ని కన్సిడరేషన్స్‌వల్ల ఇవ్వటం జరిగింది. ఇంకా సీట్లుంటే మీకూ ఇద్దుం మరి" అని మాట మార్చారు.

ప్రభుత్వానికి విజ్ఞాపన పత్రాలు పంపిస్తే బావుంటుందని చూశారు గాని కక్షతో తమ ప్రవర్తన బావుండలేదని ప్రిన్సిపాల్ సర్టిఫై చేసి తప్పించుకో వచ్చని వూరుకుండిపోయారు.

రవీ, ప్రకాష్, హాస్టల్లో సీటురాని మరి ముగ్గురు కుర్రాళ్ళూ కలిసి రెండు గదులద్దెకు తీసుకుని స్వయంపాకం మొదలుపెట్టారు ఖర్చు కలిసొస్తుందని.

* * *

బజారుకెళ్ళిన రవికి కుటుంబరావు గారు కన్పించి వాళ్ళింటికి రమ్మనడంతో వెళ్ళక తప్పలేదు అతడికి. వీధిలో తుడుస్తోన్న భవానీ రవిని చూసి లోపలికి పారిపోయింది. అసలే పొట్టిదయిన ఆమె పరికిణీ కట్టుకుని, వోణీలేసుకునేసరికి చిన్న బొమ్మకలాటి డ్రెస్ వేసినట్లనిపించి నవ్వుకున్నాడు.

కామేశ్వరీ, ఆమె తమ్ముడూ కూడా పరుగున ఎదురొచ్చి రవి చేతులు పట్టేసు కున్నారు అత్యంతానందంతో.

"మా ఇంటికి రావటంలేదేం బావా?" కామేశ్వరి అంది బుంగమూతి పెట్టుకుని.

"కాలేజీకెళ్ళొద్దేవిటి" అన్నాడు నవ్వేస్తూ.




"సినిమాకి వెళదాం బావా" గోపీ అన్నాడోలేదో కామేశ్వరి వంతపాడింది.

"వెళదాంలే"

ఆ మాటకి వాళ్ళ మొఖాలు విప్పారాయ్.

టీ గ్లాసందిస్తూ "నీ ఆరోగ్యం బావుం టోందా రవీ?" అనడిగింది మేనత్త.

సిగ్గుగా తలూపాడు.

"కాలేజీలోజేరి ఇన్నాళ్ళయ్యింది ఒక్కనాడూ గుమ్మం తొక్కలేదే మయ్యా?"

"వద్దామనుకుంటూనే వున్నానత్తా. కానీ వీలుపళ్ళేదు"

"అన్నట్టు హాస్టల్లోకాక గది అద్దెకు తీసుకునుంటున్నావుట కదా. మావయ్య చెప్పేరు. అవుండేదేదో ఇక్కడే వుండకూడదూ... మేమేమైనా పరాయి వాళ్ళమా చెప్పు?"

"అది కాదత్తా! క్రితం సంవత్సరం కలిసున్నవాళ్ళతోబాటు గది తీసుకు నుండాల్సొచ్చింది"

"బావా...సినిమా మొదలెట్టేస్తారు" వారి మాటలకడ్డొస్తూ అంది కామేశ్వరి.

"వుండవే... కాస్సేపైనా కూర్చో నివ్వవాయేం? ఇది రవీ... వీళ్ళవరస. సువ్వొస్తేచాలు వీళ్ళకి పండగే"

"సినిమాకింకా బోలుడు టైముందిలే" అన్నాడు.

"మొత్తానికి సినిమాకి తీసుకెళ్తాననే వరకూ వూరుకోలేదన్నమాట. భలే వాళ్ళేనే! బావనలా అడగొచ్చా... తప్పు కదూ?''

"పోన్లే అత్తా! వాళ్ళకదో సరదా.... జయంతేది?''

''వాడికిల్లు పట్టదు రవీ! వాడి తిరుగుళ్ళేమిటో, వాడేమిటో తప్ప



ఇంకేం పట్టవనుకో. ఆ పరీక్షలో ఆ మాయదారి చచ్చినాడు డిబార్ చేసి నప్పట్నుంచి బొత్తిగా చేతికందటం లేదనుకో. చదువూ లేదు కుదురూ లేదు. ఇలా వూరుకుంటే వాడేమవుతాడో అంతా అయోమయంగా వుందనుకో" కళ్లు తుడుచుకుంది అన్నపూర్ణ.

"చిన్నతనం కదత్తా... వాడే తెలుసుకుని దార్లోకొస్తాళ్ళే" ఓదార్చడానికలా అన్నాడు గాని ఆ మాటలమీద అతడికే నమ్మకం లేదు!

"వాడి నొసటనెలా రాసుందో ఏమో! నువ్వు కూడా కన్పించినప్పుడల్లా చెబుతూండు రవీ ... మీ అమ్మ నీ గురించి బెంగ పెట్టుకుందని కూడా చెప్పు ఏమైనా తెలుసుకుంటాడేమో"

"అలాగే అత్తా"

మరి కొంచెం సేపుండి భోంచేసి కామేశ్వరీ, గోపీల్ని తీసుకుని సినిమా కెళ్ళాడు రవి.



## 9

సూర్యకిరణాల వేడి క్రమంగా తగ్గిపోతోంది. గోదావరి మీంచి చల్లనిగాలి వీస్తోంది. పచ్చగా, ఆహ్లాదంగా వుంది ప్రకృతి.

కెమిస్ట్రీ లేబ్‌లో ఎలిమెంట్స్‌తోనూ, ఏసిడ్స్‌తోనూ కుస్తీపట్టి అలసిన రవి తలపోటుగా ఉండటంతో టీ తాగి షికారుకొచ్చాడు.

లాకుల్ని దాటి కొంచెం పైకెళ్ళి కొబ్బరి తోటలో ఎవరూ లేని ప్రదేశంలో పచ్చికమీద పడుకున్నాడు వెల్లకిలా. అతడి మనస్సు దూదిపింజలా తేలిపోతూ పరవశించిపోయిందా వాతావరణానికి.

మెల్లగా గొంతెత్తి పాడుతూ ఏవేవో సుమధుర లోకాల్లో విహారానికి సాగిపోయాడు.

"హలో...."

ఎవరిదో మాట విన్పించి ఉలిక్కిపడి చూశాడు పాటనాపి.

ఎదుట నవ్వుతూ అరుణ!

ఆమె ఈ సంవత్సరమే తమ కాలేజీ కొచ్చి బియ్యేస్సీ ఫస్టియర్‌లో చేరింది.

"మీరా?"

"మీరా కాదు... అరుణ"

"ఎంతసేపయ్యిందొచ్చి !"

"అవునుగానీ ఏవిటలా సంగీత సాగరంలో కొట్టుకుపోతున్నారూ ? మీ కంఠం చాలా బావుంది సుమండీ"

ఆమె మొఖాన్నే పొగిడేస్తోంటే సిగ్గేసి సందర్భం మార్చడానికి "అదేం పుస్తకమండీ" అన్నాడామె చేతిలోని పుస్తకం వంక చూస్తూ.

"కారుచీకటిలో కాంతి రేఖ. మీరు చదివారా?"

"లేదండీ"

"తప్పకుండా చదివి తీరాల్సిన పుస్తకం"

"మీరిదివరకు ఏ కాలేజీలో చదివారు?"

"విజయవాడలో మా బ్రదర్ దగ్గరుండి చదివాను. మా బ్రదర్‌కి ట్రాన్స్‌ఫర్ అవడంతో ఇక్కడికొచ్చి డిగ్రీ చదవాల్సొచ్చింది"

"అది మా అదృష్టం"

"భలేవారేనే"

"నిజమండీ... ప్రతిదీ విశ్లేషించి, నిశిత పరిశీలనచేసి వాదించడం మీ ప్రత్యేకత. యల్లెల్బీ చదివితే మంచి ప్లీడర్‌గా పేరు తెచ్చుకోవడం ఖాయం"

"నా ఉద్దేశమూ అదేనండీ! పేదలకి న్యాయం అందుబాటులో లేకుండా పోయిన ఈ రోజుల్లో న్యాయాన్ని రుజువు చెయ్యాలంటే బోలుడు డబ్బు ఖర్చుపెట్టాల్సొస్తోన్న ఈ రోజుల్లో మన సత్యంగార్లాటి లాయర్లెందరో అవసరం. నేను కూడా యల్లెల్బీ చదివి పేదసాద శ్రామిక జనపక్షాన నిలవాలన్నది నా కోరిక"

"వెల్...మన కాలం యువతలో వస్తోన్న మార్పుకీ, అభ్యుదయ దృక్పథానికీ మీరో ఉదాహరణ"

"నన్నేం ములగచెట్టు ఎక్కించొద్దు గాని మీ భవిష్యత్ ప్రణాళికేమిటి?"

అతడి కళ్ళల్లో కన్నీటిపొర కదిలింది. ముఖం తిప్పుకుని కళ్లు తుడిచేసుకున్నాడు.

"యం.బీ చదివి మా వూళ్ళో ఆసుపత్రి పెట్టి పల్లె జనానికి, నిరుపేదలకి ఉచిత వైద్యం చెయ్యాలన్నది నా ఆకాంక్ష, జీవితాశయం కూడా. మరేమవుతుందో ఏమో!"

ఆమె కళ్ళల్లో మెరుపులు కురిశాయ్. అభినందనపూర్వకంగా చూసిందతణ్ని.

"మీరలా అధైర్యపడకండి. మీ ఉన్నతాశయం మిమ్మల్ని తప్పకుండా డాక్టర్ని చేస్తుంది. ఎందరెందరో అభాగ్యుల్ని మృత్యుముఖం నుండి కాపాడతారు. నాలాటి ఎందరికో మీరు స్ఫూర్తిగా నిలుస్తారు"

"థాంక్యూ! మీరు చాలా పెద్ద మాటలూ, బరువైన మాటలూ వుపయోగించొద్దు. నేను సామాన్యుణ్ని...దట్సాల్! ఆ విషయాలనలా ఉంచి ఇంకేమైనా మాట్లాడండి"

"యూనియన్ ఎలక్షన్ జరపడం ఖాయమంటున్నారు. మొన్న ఏదో పని మీదొచ్చిన మంత్రిగారు విద్యార్థి సమాఖ్య అనే కొత్త సంస్థని ప్రారంభించినప్పట్నుంచి ఆ మాట గట్టిగా విన్పిస్తోంది. దాని లీడర్ వీర్రాజు ఛైర్మన్‌గారబ్బాయి కదా! అతడు పోటీ చెయ్యొచ్చనుకుంటాను"

"తప్పకుండా చేస్తాడు. మనం గట్టి పోటీ ఇవ్వాలి"

"ఇవ్వడం కాదు ఓడించాలి. అప్పుడే యూనియన్ ఫండ్‌ని సక్రమంగా వినియోగించేట్లు చూడగలం. విద్యార్థులకెన్నో మేళ్ళు చెయ్యగలం"

"ఓకే...తప్పకుండా"

లేచి తిరుగుముఖం పట్టారిద్దరూ.

"మా ఇంటికెళ్దాం రండి"

"మీ ఇంటికా?"

"ఏం...రాకూడదా?"

"అహ... అలా అని కాదు. మీ ఇల్లెక్కడ?"

"ఇక్కడే...?"

"ఇక్కడంటే"

"మా నాన్నిక్కడే లాకులమీద పని చేస్తున్నారు. అక్కడే వున్నాయి క్వార్టర్స్"

ఆమె ఇంటికెళ్ళారు. సింపుల్‌గా పొందిగ్గా సర్దివున్నాయి గదులు.

ఓ షెల్ఫ్ నిండా వున్న పుస్తకాలు చూసి 'బాపురే' అనుకున్నాడు.

కాఫీ తాగి రెండు పుస్తకాలు చదివిస్తానని తీసుకునొచ్చేశాడు రవి.

'స్త్రీ ఎలా వుండాలన్న దానికి వుదాహరణామె. ఆమెను పెళ్లి చేసుకున్న వాడు సాధించని విజయాలంటూ వుండవు. ఆ అదృష్టశాలి ఎవరో!' అనుకున్నాడు మనస్సులోనే.

* * *

అకస్మాత్తుగా కాలేజీ వాతావరణంలో పెద్ద మార్పొచ్చింది.

ఎక్కడ చూసినా గుంపులు గుంపులుగా విద్యార్థులు. లెక్చరర్లతో సహా అంతా చర్చిస్తోన్నది స్టూడెంట్ యూనియన్ ఎన్నికల గురించే.

గత ఏడాదిలాగాక ఈసారి ఎన్నికలు నిర్వహిస్తానంటూ ప్రిన్సిపాల్ గారు ప్రకటించారు. అంతేకాదు – గతంలోలా ప్రెశిడెంట్ పదవికి ఫైనల్ ఇయర్ డిగ్రీ వాళ్ళే అర్హులన్న నిబంధన మార్చి డిగ్రీ వాళ్ళంతా అర్హులే అన్నారు. వీరరాజుని దృష్టిలో వుంచుకుని ఈ మార్పు చేసి వుంటారని విద్యార్థులభిప్రాయబడ్డారు. అతను సెకండ్ బి.ఏ చదువుతున్నాడు.

జార్జి లేకపోవడం, వీరరాజు ఆధ్వర్యంలో సమాఖ్య అవతరించడం, గత ఏడాది శేషగిరి యూనియన్ ఫండ్ ఎకౌంట్ చూపించలేదనీ, నిధులు దుర్వినియోగం చేశాడనీ వచ్చిన ఆరోపణలూ ప్రిన్సిపాల్‌గారు ఆ నిర్ణయం తీసుకోడానికి తోడ్పడ్డాయ్.

వెంటనే సంఘ సర్వసభ్య సమావేశాన్నేర్పాటుచేశాడు రవి.

''ఈ ఎన్నికలు చాలా కీలకమైనవి. అభ్యుదయవాదులకీ, మతవాదులకీ, మిత వాదులకీ మధ్య జరగబోతోన్న ముక్కోణపు పోటీ ఇది. అందువల్ల మన శక్తియుక్తులన్నీ కేంద్రీకరించి మన బలం ప్రదర్శించాలి. మన సంఘంలోని ప్రతిఒక్కరూ నాయకత్వానికి కావల్సిన అన్ని అర్హతలూ వున్న మాట నిజమే అయినా మన ప్రతి కార్యక్రమాన్నీ ముందుండి విజయవంతం చేస్తోన్న అరుణగార్నీ, ప్రకాష్‌నీ ప్రెశిడెంట్, వైస్‌ప్రెశిడెంట్ పదవులకి సూచిస్తున్నాను. మీరు మీ అభిప్రాయాలు చెప్పొచ్చు"

రవి మాటలకడ్డొస్తూ అరుణ అంది– "మన ప్రత్యర్థులకు ధనబలం, హంగుబలం వుందని మనం మర్చిపోకూడదు. అంచేత విద్యార్థుల అభిమానాన్ని చూరగొన్న రవిగారే ప్రెశిడెంట్‌గా పోటీచెయ్యడం సమంజసం"

అంతా రవే వుండాలంటూ పట్టుబట్టారు గాని ఆతడొప్పుకోలేదు. ''సంఘ బాధ్యతని స్వీకరించి మన కార్యకలాపాలు విస్తృతం చేసే కార్యక్రమం చేపట్టిన నాకన్నా ఇతరులైతేనే సమర్థవంతంగా పనిచెయ్యగలరు" అన్నాడతడు.

"అది నిజమే గాని కేవలం పోటీ చెయ్యడమే కాదు–గెలవడం కూడా మనకి ముఖ్యమే. ఆ దృక్పథం నుంచి ఆలోచించి అభ్యర్థిని నిర్ణయించాల్సివుంది. సంఘ నాయకుడిగానేగాక వ్యక్తిగాకూడా నీకు మంచి పేరుంది. నీ మీద అందరికీ నమ్మకం వుంది. అందువల్ల నువ్వు నిలబడితేనే బావుంటుంది" అన్నారు లాయర్ సత్యంగారు.

అంతా తప్పట్లుకొడుతూ 'మీ రే వుండాలి' అన్నారు వుత్సాహంగా. ఒప్పుకోక తప్పలేదతడికి.

అరుణ వైస్ ప్రెశిడెంటుగానూ, ప్రకాష్ ట్రెజరర్‌గానూ, ఆనందరావు కల్చరల్ సెక్రటరీగానూ, రజాక్ స్పోర్ట్స్ సెక్రటరీగానూ పోటీచెయ్యడానికి నిర్ణయించారు.




అభ్యర్థుల ప్రచారానిగ్గాను చందాలు వసూలుచెయ్యాలనికూడా నిశ్చయించారు. అప్పటికప్పుడు సభ్యులు ముందుకొచ్చి కొన్ని విరాళాలిచ్చారు.

నామినేషన్ల ఘట్టం ముగిసింది.

ప్రెసిడెంట్ పదవికి సంఘం తరఫున రవి, సమాఖ్య తరఫున వీర్రాజు, సమాజం తరఫున బాలాజీరావూ రంగంలో ఉన్నారు.

ప్రచారం జోరు పుంజుకొంటోంది.

గోడలమీద రాయిస్తున్నారు. వాల్ పోష్టర్లంటిస్తున్నారు. కరపత్రాలు పంచుతున్నారు.

విద్యార్థుల గదులకి గుంపులు గుంపులుగా వెళ్ళి ఓట్లడుగుతున్నారు. ఉచితంగా కాఫీ, టిఫిన్లిప్పిస్తున్నారు. సినిమాలు చూపెడుతున్నారు. డాట్ పెన్నులూ, దువ్వెన్లూ పంచిపెడుతున్నారు. ప్రాక్టికల్స్‌లో మార్కులేయిస్తామనీ, పరీక్షలు లూజుగా జరిగేట్లు చూస్తామనీ లోపాయికారీగా వాగ్దానాలు చేస్తున్నారు. కులమతాలని తప్పి మనం మనం ఒకటంటున్నారు.

పోటీ తీవ్రంగా వుంది.

ఆ మాటే వీర్రాజు తన తండ్రితో చెప్పేడు. ఆయన తన కుడిభుజమైన రామనాథాన్ని పిలిచి "ఏమైనా మావాడు ప్రెసిడెంటైతీరాలి" అన్చెప్పేడు.

ఆయన ప్రిన్సిపాల్‌ని కలిసి ఛైర్మన్ గారి మాట చెప్పేరు. ఇద్దరూ కలిసి సుందర్రావుగారికీ, ప్రభాకరంగారికీ, వీర్రాజుకీ, బాలాజీరావుకీ కబుర్లు పంపేరు.

అంతా వచ్చేక పరిస్థితి సమీక్షిస్తూ రామనాథంగారన్నారు— "గాలి బావోలేదు. మనం మనం కుమ్ములాడుకుని మూడో వాడికి సింహాసనం కట్టబెట్టేకన్నా మనం రాజీకొచ్చి పదవులన్నీ మనమే పంచుకోవడం ఉత్తమం. ఆ సంఘాన్ని కూడా ఓ దెబ్బ తీసినట్టవుతుంది"

ప్రభాకరంగారూ, బాలాజీరావూ కూడబలుక్కున్నారు. శేషగిరి టైములో తమ సమాజానికున్నంత పేరిప్పుడు లేదు. పోటీలో బాలాజీరావు మూడోవాడవన్నది పచ్చి నిజం. అంచేత హాస్టల్ స్టూడెంట్స్ ప్రెసిడెంటు పదవీ, వైస్ ప్రెసిడెంటూ, కల్చరల్ సెక్రెటరీ పదవులు తమకిస్తే మిగతావాటికి వాళ్ళని బలపరుస్తామన్నారు.

వీర్రాజు ముందు కొంచెం బెట్టు చేశాడు. తర్వాత తనకి ప్రెసిడెంటు పదవే ముఖ్యం గనుక ఒప్పేసుకుని బాలాజీరావుతో చేతులు కలిపాడు.

కథ సుఖాంతమవబోతున్నందుకు పెద్దలంతాసంతోషించి 'తథాస్తు' అన్నారు.

కాని కథ అడ్డం తిరిగిందని ఫలితాలు ప్రకటించేకగాని వాళ్లు గ్రహించలేకపోయారు.

స్వల్ప మెజార్టీతో రవీ, అధిక మెజార్టీతో మిగతా సంఘ సభ్యులూ గెలుపొందారు. స్పోర్ట్స్ సెక్రటరీగా మాత్రం సమాజంఅభ్యర్థి గెలుపొందాడు.

* * *

బజార్లో కన్పించిన తమ వూరతను శాంతమ్మగారికి అయిదార్రోజుల్నుంచి సుస్తీగా వుందని చెప్పడంతో రవి ఆఘమేఘాల మీద ఇంటికెళ్ళాడు.

మంచానికంటుకుపోయిన తల్లిని చూసేసరికి కన్నీళ్ళు జలజలా రాలాయ్.

"వూరుకో నాన్నా ... నీకక్కడ సౌఖ్యంగా వుంది కదా" అందామె.

ఆమాటలకిమరింతకదలిపోయాడతడు. తను అనారోగ్యంతో బాధపడు




తున్నా సరే బిడ్డల క్షేమమే కోరుతూ తపి స్తూంటుంది తల్లి. అందుకే మాతృదేవోభవ అన్నారు పెద్దలు.

ఆచారి డాక్టరు వైద్యం చేస్తున్నాడని విని కలవరపడ్డాడు రవి. తన అన్న గార్నీ, మరి చాలామందినీ పొట్టన పెట్టుకున్న వైద్యశిఖామణి ఆయనే. తన చిన్నప్పట్నుంచీ కూడా వూళ్ళో వున్న డాక్టరు ఆయనొక్కడే. అంతకుమించి వైద్య సౌకర్యం పెరగనేలేదు.

పట్నం తీసుకెళ్దామంటే తల్లి ఒప్పుకో లేదు. తగ్గుముఖం పట్టిందిలే అంది. కానీ అనారోగ్యానికి కారణం మనోవ్యాధి అని మరి కాస్సేపటికే గ్రహించాడు రవి. తండ్రి పరధ్యానానిక్కారణం కూడా అదేనని గుర్తించాడు.

గుండెలు పట్టేసినట్టన్పించింది.

ఈమధ్య పంట దిగుబడి అంతంత మాత్రంగానే వుంటోంది. పెట్టుబడి ఎక్కువ పెట్టాల్సొస్తోంది. అంచేత అప్పు పత్రాలు రాయక తప్పడం లేదు. దిగుబడి తక్కువగా వుంటోంది. పండిన నాలు గ్గింజలకీ బజార్లో ధర వుండటం లేదు. ఇంకెలా కోలుకోగలడు మధ్యతరగతి రైతు?

తను హాస్టల్లోగాక వేరే వుంటున్నం దున కొంచెం అదనపు ఖర్చవుతూనే వుంది. ఇక ఫీజులూ, పుస్తకాలూ సరేసరి. వీటన్నిటికీ సర్దుబాటు చేస్తూ ఇల్లు గడుపుకురావడం మాటలు కాదు. పైగా మొన్ననే ఎడ్ల జతలో ఒకటి వాతం కమ్మి చనిపోయింది.

ఏం చెయ్యాలో, ఏంచెప్పాలో తోచక దిగులుగా వుండిపోయాడు రవి.

"కాలువ పొర పొలంకాడుంటాను అనకోసారటురారా" అన్చెప్పి వెళ్ళాడు రామయ్యగారు మరుసటి రోజున.

ఏదో పనివుందని గ్రహించి టీ తాగి బయల్దేరాడు. దారిలో సీతయ్యా గారి మామిడి తోట దగ్గిర ఆదిగాడు కన్పించాడు. అతడు రవి చిన్నప్పుడు వాళ్ళ పాలేరుగా పనిచేశాడు. ఇప్పుడు వయస్సు పైబడటంతో పని చెయ్యలేక న్చెప్పి ఎవరూ పనికి పిలవడంలేదు.

"ఎవరారూ?"

"నేను ఆదిగా..రామయ్యకాపుగారబ్బా యిని"

"తవరా చినకాపుగోరూ... బాపుం దారా?"

"బాగానే వున్నానుగానీ నువ్వేం జేస్తున్నావ్?"

"ఏటిసెయ్యగల్ను బాపూ. కూకుంటే లేవలేను, లేత్తే కూకోలేను. అలాగన్చెప్పి కూకునుంటే కూడెట్టేవాళ్లు లేరుగందా. ఇల్లిదిగో ఈ తోట కాపలాకొప్పుకుని ఏదో ఏడుత్తున్నా బావూ. ఆభగమంతు డెప్పుడు దయదల్సి తీసుకుపోతాడా అని సూత్తన్నా"

వూహ తెలిసినప్పట్నుంచి రెక్కలు ముక్కలు చేసుకుంటూ కూలీనాలీ చేసుకుని బతికిన అతడికిప్పుడు గంజి నీళ్లు పోసే దిక్కుకూడా లేదు. ఇలాటి వాళ్లని ప్రభుత్వం ఆదుకునే రోజెప్పు డొస్తుందోగదా!

ముందుకి నడిచాడు రవి. అతడెళ్ళే సరికి కాలువ కింది పొలం గట్టు మీద కూర్చునున్నారురామయ్యగారుదిగులుగా. సర్వం కోల్పోయినవాళ్ళా కళ్ల నీళ్ళు నింపుకుని పొలం వంక దీనంగా చూస్తోన్న తండ్రిని చూసేసరికి అతడి గుండె నీరయ్యింది.

కొడుకుని చూసి కళ్ళు తుడుచు

కుంటూ "రారా" అంటూ పిలిచారు.

కొన్ని క్షణాలు గంభీరంగా గడిచేక అన్నారాయన.

"ఈ పొలం వుంది చూశావూ....ఇది నిన్నా మొన్నా కొన్నది కాదురా! ఎప్పుడో మా తాత కొన్నాడ్రా దీన్ని. కాలువ కింద పొలం కదా పాలకీ నీళ్ళకీ లోటుండదని కొన్నాడు. ఇదిగో ఈ మట్టి చూశావూ? దీన్లో మా తాత రక్తం, మా నాన్న రక్తం, నా రక్తం కూడా చెమటతో బాటు కలిసివ్వాళ బంగారుభూమి అయ్యిందిరా. దాన్నివాళ...." చేలోంచి గుప్పెడు మట్టి తీసి చూపిస్తూ బావురుమన్నారు.

"ఏవయ్యింది నాన్నా?"

"ఏదైతే అవ్వకూడదనుకున్నానో అదే అవ్వబోతోందిరా. ఇంటికి పెద్దోడివి నీతోగాక ఇంకెవరితో సంప్రదించను చెప్పు? ఏం లేదురా...మనకి పదివేల్దాకా అప్పుంది. నీ చదువుకైతేనేం, సంసారానికైతేనేం, వ్యవసాయ పెట్టుబళ్ళకైతేనేం అప్పుడప్పుడూ చేసిన అప్పు ఇంతై కూర్చుంది. ఏవో రెండు పంటలు గట్టిగా పండితే తీర్చలేకపోతామా అని ఇన్నాళ్లూ చూశానుగాని ఇంక ఆశఅడుగంటిందిరా. నీకు తెలుసో లేదోగాని మనిషి,పక్షీ అన్నీ నిద్రపోతాయిగాని అప్పు నిద్రపోదురా. రాత్రీ పగలూ కూడా అది పెరుగుతూనే వుంటుంది. అదింకా పెరిగి మిగిలిన పొలాన్ని కూడా చుట్టేసేవరకూ వూరుకునేకన్నా ఇప్పుడే ఈ ఎకరం పొలం తీసేసి అప్పు లేకుండా చేసుకుంటే మంచిదని వుంది. బతికి బాగుండాలిగాని ఇంతోటి పొలం దొరక్కపోదు ... కొనుక్కోకపోము. ఏమంటావురా?"

"బయటి అప్పుకి వడ్డీ ఎక్కువ కదా. కోఆపరేటివ్ సొసైటీలోనో, బాంకులోనో అప్పు తీసుకుని బయటి అప్పు తీర్చేస్తే మంచిదికదా"

"సొసైటీలోనూ అప్పుందిరా. ప్రతి ఏడూ అలా తీసుకుంటూ ఇలా చెల్లువేస్తూ తిరగేసుకొస్తున్నాం. దెబ్బమీద దెబ్బలాగా మన దాపడెద్దు చచ్చిపోయింది. ఎలపడెద్దు జతకింకోటి కొనాలి. ఎంత లేదన్నా పదిహేనొందలవుతుంది. వచ్చేవి పనుల్రోజులు కూడా"

"మరయితే పొలం బేరంపెట్టక తప్పదంటావా?"

"బేరం పెడితేనే కూస్తంత గాలిపీల్చుకోగలమనిపిస్తోంది. బేరంపెట్టినా వూళ్ళో వాళ్ళలో కొనేసత్తువెవరి దగ్గరుందిగాని సోమయాజులుగార్ని పుచ్చేసుకోమంటాను. ఎలాగూ మనం బాకీవున్నది ఆయనకే గనుక అదీ అదీ సరిపెట్టి కొంచెం ఇమ్మందాం."

"తక్కువకి వేసుకుంటాడేమో?"

"ఆయనలాటి వాడు కాదులే. తాతల కాణ్నుంచి వాళ్ళకీ మనకీ వ్యవహారం నడుస్తోంది. పైగా ఇది కాలువపొర పొలం. దీని పక్కనున్న పాతిక ఎకరాల దొడ్డీ ఆయనదే. పొలంలో పొలం అని కొంటారులే. రేపు పాలకొల్లు వెళ్ళి ఆయనతో మాట్లాడొద్దాం. నువ్వొందే వడ్డీలెక్కలూ అవీ సరిచూడొచ్చు"

"వెళ్దాంలే" గాఢంగా నిశ్వసిస్తూ అన్నాడు రవి.

* * *

సోమయాజులుగారి ఇల్లు పూర్వకాలందే అయినా పెద్దగా, పకడ్బందీగా, హుందాగా వుంటుంది.ఎత్తయిన అరుగులు, టేకుదూలాల చావిడి, ఇంటిచుట్టూ గాజు పెంకులు గుచ్చిన ప్రహరీ. ఇంటిముందు




చెరోపక్కా రెండు ధాన్యంగాదులు, ఇంటి వెనకాల పశువుల కొట్టం.

ఆ ఇల్లు పడగొట్టి మేడ కడదామని కొడుకులన్నా పూర్వంనుంచీ అచ్చొచ్చిన ఇల్లంటూ ఒప్పుకోలేదు సోమయాజులు గారు.

సోమయాజులుగారికి ఆయనకే తెలీనంత పొలం వుంది. దాన్ని రామయ్య లాంటి సన్నకారు రైతులు కౌలుకి చేస్తూంటారు. ఆయనెప్పుడూ పొలంలో కాలుపెట్టరు. కుప్పనూర్పిళ్ళకి మాత్రం ఆయన తాలూకు మనిషొకరు వచ్చి దగ్గరుండి తూకాలు వేయిస్తారు. ఆయనెక్కువగా రైతులకి అప్పులిస్తూంటారు కూడా. ఆయన భూముల్లో సగం రైతులు అప్పు తీసుకుని దఖలుపర్చినవే !

వీధిలో ఆడుకొంటోన్న ఏడేళ్ళ కుర్రాణ్ని "నాన్నగారున్నారా అబ్బాయిగారూ" అంటూ రామయ్యగారు మన్నిస్తూ అడగడంతో రవికేదోలా అనిపించింది.

ఆ కుర్రాడు చిరాగ్గాచూసి "నాన్నగారూ...నాన్నగారూ" అంటూ లోపలికి వెళ్ళిపోయాడు.

"కూర్చోరా" అన్నారు రామయ్యగారు పైపంచెతో అరుగుతుడుస్తూ.

అరుగుమీద రెండు కుర్చీలూ, ఓ బల్లా కూడా వున్నాయి. వాటిమీద కూర్చుందాం అనబోయే అంతక్రితం ఆ కుర్రాడితో నాన్న ప్రవర్తన గుర్తొచ్చి వూరుకుని అరుగుమీదే చతికిలబడ్డాడు రవి.

కొంచెంసేపటికొకావిడ "ఎవరూ?" అని దీర్ఘంతీస్తూవచ్చి "నువ్వా రామయ్యా ఏవిటీమధ్య ఇటు రావట్లేదూ? పంటలెలా వున్నాయీ?" అంటూ కుర్చీలోకూర్చుంది.

రామయ్యగారు లేచి నిలబడ్డారు వినయంగా. రవికీ లేవక తప్పలేదు.



"ఏదో బాగానే వున్నామమ్మగారూ"

"ఈ అబ్బాయెవరూ? నీ కొడుకా?"

"అవునండమ్మగారూ ... మా పెద్ద అబ్బాయ్. కాలేజీలో చదువుతున్నాడు" గొప్పగా ఫీలవుతూ అన్నారు.

"భూమిని నమ్ముకునే మీరు కూడా చదువులకి ఎగబడితే ఇక పంటలెవరు పండిస్తారూ?"

"ఎంత పండించినా, రెక్కలుముక్కలు చేసుకున్నా ఏం మిగలటం లేదమ్మగారూ. అయ్యగార్లేరా అమ్మగారూ?"

"వస్తారుగాని ఈమధ్య మంచి ఆవు నెయ్యి దొరకటం లేదోయ్ రామయ్యా. మీ వూళ్ళోగానీ, చుట్టుపక్కలగానీ చూసి ఓ రెండు వీశెలు పంపిద్దూ"

"అలాగే నమ్మగారూ! రెండ్రోజుల్లో తెస్తానండి"

"నిలబడే వున్నావేం ... కూర్చో కూర్చో" అంటూ లోపలికెళ్ళి పోయిందావిడ.

మరి కాస్సేపటికి సోమయాజులుగారు చేతులు తుడుచుకుంటూ వచ్చి సావిట్లో వున్న తూగుడు బల్లమీద తలగడల కానుకునికూర్చుని బొజ్జ సవరించుకుంటూ భుక్తాయాసం తీర్చుకుంటూ వూగ సాగారు.

"ఎవరూ....రామయ్యా" అన్నారు భార్య తెచ్చిచ్చిన వక్కా తాంబూలం నోట్లోవేసుకుంటూ.

"నేనేనండి...దండాలండయ్యగారూ"

"ఏవిటిలా వచ్చావ్?"

"మీతో చిన్న పనుండి...."

"పనా?"

"పనేనండి. మొన్నామధ్య మా దాపటెద్దు వాతంకమ్మి చచ్చిపోయిందండి. ఇంకో ఎద్దుని కొనాలండి. తవరికెలాగూ ఇదివరకే బాకీ వున్నాను గనుక కాలవ పౌర కింద ఎకరం పొలం తీసేద్దామను కుంటున్నానండి..."

"అలాగా...మంచిదే. ఎవరైనా బేరాని కొచ్చారా?"

"అదేవిటలా అంటారు. మిమ్మల్ని కాదని వేరేవాళ్ళకెందుకిస్తాం చెప్పండి? పైగా మీ పొలం పక్క పొలం. అసలు కాలువ పౌరపొలం అమ్మడం నాకిష్టం లేదండి. మిగతా భూమంతా ఒకేచోటుంది కదా అని దాన్ని బేరం పెడుతున్నా నండి"

"ఏమాత్రం వుంటోందేమిటి ధర?"

"ఏడాది కిందట ఆ పక్కపొలం పదకొండు వేల అయిదొందలకాడి కమ్మేరండి"

"ఆహా...అలాగా. కొంటే బాగానే వుండున్నగాన్ని ఈరోజుల్లో సొమ్ము పొలాల మీద పెట్టడం మంచిది కాదోయ్. లాండ్ సీలింగులూ అవీఇవీ అంటూ ప్రాణాలు తోడేస్తున్నారనుకో. పెద్దగా లాభసాటిగానూ వుండటం లేదు.ఏ మిల్లో, సినిమాహాలో కడితే బావుంటుందంటున్నారు మా పిల్లలు"

"అమ్మమ్మ... పెద్దకామందులు తవరే అలాగంటే ఇంక మా గతేవిటి చెప్పండి! మీ పొలంలో కలిసిపోయే కాలువపక్క పొలమాయె. నీళ్ళకి పాలకి ఇబ్బంది లేని పొలం. గట్టుతీస్తే చాలు నీళ్ళొచ్చి పడ తాయ్. మీరెలాగైనా తీసుకోవాల్సిందే. తవరికి, మాకూ ఎప్పట్నుంచో కలిసెళ్ళి పోతోంది. అందుకే అప్పుకైనా, అమ్మ కానికైనా తవరికాడికే వస్తున్నాం"

"పాపం...అంతగా బతిమాల్తున్నాడు రామయ్య. వీలుంటే చూడండి! రామయ్య మంచివాడూ, నమ్మకమైన మనిషీనూ"

ఆయన భార్య అంది.

"అది నిజమే అనుకో...కానతడెంత ధరకావాలనుకుంటున్నాడో ఏమో మనకేంతెలుసు!"

"నేనేం అనుకోవడంలేదండి ... తమ రెంతంటే అంతకి మాకు ఒప్పదలేనండి"

"సరే! మరీ ఇంతగా అడుగుతున్నావు గనుక ఎనిమిదివేలిస్తాను"

"ఎనిమిదివేలాండీ?! కిందదేడాది ఆ పక్కపొలం..."

"అది కిందదేడాదిమాట రామయ్యా! ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయ్. లాండ్ సీలింగ్ కేసులు తెమల్లేదుకదా. ఎవరివి వుంటాయో, ఎవరివి పోతాయో తెలీని పరిస్థితాయె. ఇంకొన్నాళ్లుపోతే భూముల్ని అమ్మేవాళ్లేగాని కొనేవాళ్ళుండరు. ప్రతివాడూ పట్నాల్లో ఫాక్టరీలో, మరోటో మరోటో పెట్టాలనే చూస్తున్నాడు తప్ప సొమ్ము భూమ్మీద పెడదామనుకోవడంలేదు. ఏదో అప్పు తీరుస్తానూ, ఎడ్లు కొనుక్కుంటానూ అంటున్నావనిగాని పొలం కొనడం నాకసలిష్టమేలేదు"

"తమరు చెప్పినధర మరీ తక్కువగా వుంది. నా సాధకబాధకాలు తవరికి తెలీందేవుంది. ఇంకోమాట చెప్పండి"

"సరే...బతిమాల్తున్నావుగనుక ఇంకో అయిదొందలు కట్టుకో"

ఆ రేటుకి ఇవ్వనంటాడని ఆశగా చూసిన రవి నివ్వెరుడయ్యేలా "మళ్ళీ ఆ కొదవెందుకులెండి... తొమ్మిదివేలు చెయ్యండి" అన్నారు రామయ్యగారు.

"సరే... కానియ్. నీలాటి రైతులు బాగుంటేనేకదా మేం బాగుండేది. అయినా మనలో మనకేమిటోయ్ రామయ్యా! ఎన్నాళ్ళనుంచో అలా వస్తుంది గనుక అలా పోనివ్వాలిగాని నీలాటివాడు కూడా వెనకా ముందూ చూసుకుంటే ఎలాగ?"

"బాకీలవీ లెక్కల్లూస్తే..."

"చూద్దాం. ఇవాళొద్దు. మంచిదికాదు. రేపు వూళ్ళో వుండను. ఎల్లుండి దశమి... శనివారం. దివ్యమైన రోజు. ఎల్లుండిరా రాతకోతలు పూర్తిచేసుకుందాం"

"అలాగేనండి... మరొస్తానండి"

"అలాగే. ఇందాకట్నుంచి అడుగుదామకుంటూనే గొడవలోపడి మర్చిపోయాను. ఆ కుర్రాడెవరోయ్ రామయ్యా ... నీ కొడుకా?"

"అవునంఢయ్యగారూ... మా పెద్ద బ్బాయి. కాలేజీలో చదువుతున్నాడండి"

"ఎందుకొచ్చిన చదువులోయ్! ప్రతివాడూ చదువు చదువంటూ ఎగబడితే మీ పనులెవడు చేస్తాడు? కులవృత్తికి సాటి రాదు గువ్వలచెన్నా అన్నారు పెద్దలు. పోనీ అని చదివితే వుద్యోగాలొస్తున్నాయా అంటే అవీలేదు. డిగ్రీలు చదివినవాళ్ళు రోడ్లు సర్వే చేస్తున్నారు"

"నాకూ ఇష్టంలేదండి. మావాడు చదువుతానని పట్టుబడితేనూ..."

"సరిసరే. ఇప్పటికైనామించిపోయింది లేదుగానీ దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకో. తెల్సిందా?"

రవికి ఒళ్ళు మండిపోయింది ఆయన ధోరణికి. 'తను మాత్రం పౌరోహిత్యమో ఏదో చేసుకోక వ్యవసాయమూ, వడ్డీ వ్యాపారమూ ఎందుకుట? వాళ్ళకక్కర్లేని కులవృత్తి ఇతరులకెందుకో?' అని రుసరుసలాడాడు.

వెళ్లొస్తానని భార్యాభర్తల్తో ప్రత్యేకంగాచెప్పి రామయ్యగారు వెనుదిరగ్గానే "ఆవునెయ్యి మాట మర్చిపోకేం" అని గుర్తుచేసిందావిడ.

"అలాగేనండి. ఈసారొచ్చినప్పుడు తీసుకొస్తా"

ఇల్లు దాటి నాలుగడుగులెయ్యగానే రవి అన్నాడు "ఆ రేటుకమ్మకుండా వుండాల్సింది. మరీ అంత దారుణంగా అడుగుతాడా ఆయన? అలాటివాళ్ళని నమ్మితే నష్టపోయేది మనమే"

"నిజమే అనుకో. కాని వాళ్ళని కాదని వెళ్ళలేంరా. తెల్లారి లేస్తే వాళ్ళతో అవసరంపడుతుంది మనకి. రేపు అత్యవసరంగా ఏ అప్పో కావాలన్నా, ఇంకేం కావాలన్నా వాళ్ళే దిక్కు మనకి. అంచేత అయినకాడికే అయినా ఇచ్చెయ్యక తప్పదు."

కళ్ళు తుడుచుకున్నారాయన.

భారంగా నిట్టూర్చాడు రవి.

ఎకరం పొలం అమ్మినా ఇంకా రెండు మూడు వేల వరకు అప్పుంటుంది.

ఎద్దు కోసం కొత్తగా అప్పుచెయ్యాలి.

"ఇక విముక్తి ఎప్పుడో" గొణుక్కున్నాడు.

బస్టాండులో శివాజీ కన్పించాడు. వాడి నల్లగా వుందతడి మొఖం. కొంచెం నీరసంగా కూడా వున్నాడు.

"ఏవిటిలా వచ్చేవు?" రవే పలకరించాడు.

"యమ్మెల్యేగార్ని కలుసుకుందామనొచ్చాను. ఏవైనా రికమండేషన్ చేస్తారేమోనని ... మనల్ని పట్టించుకోరని మన మంగారావుగారి దగ్గర్నుంచి వుత్తరం కూడా పట్టుకెళ్ళాను"

"ఏమన్నారు?"

"చాలా చెప్పుకొచ్చాడాయన. చదువులూ, వుద్యోగాలు, వుద్యోగుల కోర్కెలూ, నిరుద్యోగుల పాట్లూ అన్నీ చెప్పుకొచ్చి 'పరీక్షపాసై ఇంటర్వ్యూ వచ్చేక ఫలానా దాంట్లో ఇంటర్వ్యూ వొచ్చింది చెయ్యమంటే చేస్తాను గాని వూరికే చెయ్యమంటే ఏం చెయ్యనూ నాకోపనా ఓలోకవా' అన్నారు. లెక్చరర్ పోస్టు గురించి చెప్పమంటే 'అబ్బెబ్బే! డొనేషనివ్వలేనప్పుడు కమిటీవాళ్ళని కనుక్కోవడం కూడాదండగే' అన్నారు"

"ఆయన మాటలకేంలెండి. రికమండేషన్లూ, లంచగొండితనాలూ ఎంతెక్కువైనా ప్రతిభకి గుర్తింపు లభిస్తూనే వుంది. మొన్ననే మా సీనియర్ అనంతానికి ఏదో బాంకులో వుద్యోగం పచ్చింది"

"మొదట్లో క్లరికల్ పోస్టా అని అప్లై చెయ్యలేదు. ఇప్పుడదీ దొరకటం లేదు. నాలుగు నెలల క్రితం ఓ టెస్ట్ రాశాను గాని దాని అతీ గతీ తెలీలేదింతవరకూ. ఏవిటో...రవీ నాకు వెక్సేషన్ వచ్చేస్తోంది. ఇంక వుద్యోగం రాదనిపిస్తోంది"

"మీరలా నిరాశపట్టం ఏం బావోలేదు. ఒకటి రెండ్రోజులాలస్యమైనా తప్పకుండా మంచి వుద్యోగమే వస్తుంది మీకు"

"ఏమో రవీ.... ఈ కుళ్ళు పరిస్థితులు చూస్తోంటే నాకేం నమ్మకం కలగటం లేదు. అప్లికేషన్ ఫీజులూ, పోష్టుఖర్చులూ అంటూ ఫాదర్ని ప్రతిసారీ అడగడానికి సిగ్గేస్తోందనుకో. నేనాఫీసర్నికాలేకపోయానని ఆయన బెంగెట్టేసుకుని ఆరోగ్యం పాడుచేసుకున్నారు. ఫాదర్కి అప్పిచ్చిన సింహాచలంగారు అప్పుతీర్చమని ఒత్తిడి తెస్తున్నారు. ఏం చెయ్యాలో ఏమిటో ఏమీ తోచడంలేదనుకో''

అతడి నిరాశాధోరణికి కదిలిపోయి సానుభూతిగా చూస్తూండిపోయాడు రవి.

• • •

''బతకలేక బడిపంతులంటారు గాని నిజానికి బతకలేని బడిపంతులనాలి మా మున్సిపల్ టీచర్ల దుస్థితి చూసి. ఆర్నెల్ల

నుంచి జీతాలివ్వడం లేదు. ఏమిటనడిగితే గ్రాంట్స్ రాలేదంటారు. మరేవో సాకులు చెబుతారు. ఇలా వుందయ్యా మా పరిస్థితి. ఏవో ప్రైవేట్లువల్ల ఏదో నెట్టు కొస్తున్నాం గాని లేకపోతే మాబోటి వాళ్ళకి అప్పుపుట్టే కాలమా ఇది? ఇక తెగించి సమ్మెకు దిగాం. రేపట్నుంచి రిలే నిరాహార దీక్షలు కూడా చెయ్యబో తున్నాం" కుటుంబరావుగారన్నారు.

రవి బాధగా చూస్తూ అన్నాడు "ఛైర్మన్‌గారేం చొరవ తీసుకోడా?"

"ఏవో శాసన సంబంధమైన చిక్కులు ఉన్నాయంటారు. ఎన్నేళ్ళు గడిచినా ఆ చిక్కులు విప్పనే విప్పరు. మాకు సరిగ్గా జీతాలొచ్చే ఏర్పాట్లు చెయ్యరు. నెలనెలా జీతాలొస్తేనే బతకటం కష్టంగావున్న ఈరోజుల్లో అయిదారు నెలలవరకూ జీతాలివ్వకపోతే ఎలా బతకటం చెప్పు?"

''ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారా?''

''చాలాసార్లు చేశాం ... ఇంకా చేస్తున్నాం. అవన్నీ చెవిటివాని ముందు శంఖమూదినట్టేఅనుకో.మా గొడవకేంగాని ఇంటికెళ్ళేవుటకదా అంతా బావున్నారా?"

"ఏం బాగులే మావయ్యా... మొన్ననే ఎకరం పొలం అమ్మేశాం'' అంటూ ఆ విషయాలన్నీ వివరించాడు.

నిట్టూర్చారాయన.

''జయంతి సంగతి కాస్త పట్టించు కోమని నువ్వైనా చెప్పు రవీ'' మేనత్త అంది మధ్యలో వచ్చి.

''ఏం చెయ్యమంటావే. చదువూలేదు, వాడు చెయ్యగల్గిన పనీ లేదు''

''అలాగనెలా వూరుకుంటామండీ... ఏదో దారి చూపాలిగానీ''

''నువ్వు చెప్పు రవీ...వాడేం చెయ్య గల్డనీ అనుకోడానికి?"

రవి మాట్లాడలేదు. డిగ్రీ చదివిన వాళ్ళే ఏమీ చెయ్యలేక, చేతకాక నిరుద్యోగ రక్కసి కోరల్లో నలుగుతున్నారు. ఇక యస్సెస్సీవాళ్ళ సంగతి చెప్పాలా? వృత్తి విద్యలు కూడా బోధించివుంటే నిరు ద్యోగం ఈనాడింత తీవ్రరూపం ధరించేది కాదేమో.

"ఏ షాపులాటిదైనా పెట్టిద్దామంటే కుదురుగా వుండేరకం కాదాయె''

"అప్పుడే ఏమంత వయసొచ్చిందని మావయ్యా. మెట్రిక్‌కి కట్టిస్తేసరి"

"చదవగలడంటావా?''

"మీది మరీ చోద్యం. ఏదో బుద్ధి గడ్డి తిన్నాడని అసలేం చదవలేడంటారేవిటి!"

ఆవిడ మాటల్ని రవి బలపరచడంతో ''సరే. కట్టిద్దాంలెండి. ఈసారయినా వెర్రి మొర్రి వేషాలెయ్యక తిన్నగా చదువు కోమను బదుద్దాయిని'' అన్నారాయన.

మర్నాడు కలుస్తాననిచెప్పి వచ్చేశాడు రవి.

అన్నట్టుగానే మరుసటిరోజున మున్సిపల్ ఆఫీసుకెళ్ళాడు.

ఆఫీసుముందువేసిన షామియానాకింద పదిమంది టీచర్లు రిలే నిరాహారదీక్షకి కూర్చున్నారు. వారిలో కుటుంబరావుగారు కూడా వుండటంతో ఆయన్ని పలక రించాడు రవి.

వారి సమ్మెకి మద్దతుగా విద్యార్థు లంతా ఒకరోజు సమ్మె చేస్తే?

అరుణతోనూ,ప్రకాష్‌తోనూ అమాటే చెప్పాడు.

"స్టూడెంట్స్ సమ్మె చేస్తే వాళ్ళ సత్యా గ్రహానికి విలువా,ప్రచారం పెరుగుతాయి. త్వరగా ఏదో చర్య తీసుకుంటారు కూడానూ" అన్నాడు ప్రకాష్.

సంఘసమావేశంలోఆమేరకోతీర్మానం

ఆమోదించేక కాలేజీ విద్యార్థులందరికీ తామోరోజు సమ్మె చెయ్యాల్సిన అవసరాన్ని వివరించి చెబుతూ ఒకరోజు సమ్మెకు పిలుపిచ్చారు.

సంగతి విని వీర్రాజు మండిపడ్డాడు. టీచర్ల సమ్మెని బలపరచడమంటే ఛైర్మన్ అయిన తన తండ్రిని వ్యతిరేకించడమే. దీన్ని సహించకూడదన్నాడు. "మీ పార్టీ రాజకీయాలకోసం విద్యార్థుల్నుపయోగించుకోవడం సిగ్గుచేటు" అంటూ బాలాజీ రావు అతడికి సపోర్టిచ్చాడు.

ఇద్దరూకలిసి సమ్మెకి వ్యతిరేకంగా ప్రచారంచేశారు.

కానెక్కువమంది రవినే సమర్థించారు.

అతడు యూనియన్ ప్రెసిడెంట్ అవడం ఒకకారణమయితే, "మనకి విద్యాబుద్ధులు నేర్పి, మనల్ని మనుషులుగా, మనీషలుగా తీర్చిదిద్దే ఉపాధ్యాయులు ఆకలిమంటల్లో శలభాల్లా మాడిపోతోంటే వారికి మన సానుభూతినీ, సంఘీభావాన్నీ తెలపడం మన విద్యుక్తధర్మం. ఒక్కరోజు సమ్మెవల్ల మనం నష్టపోయేదదుమేం లేదుగాని అదే సమయంలో మనం ప్రగతిపథాన ఒక్కడుగు ముందుకేసినట్లవుతుంది" అంటూ కన్విన్సింగ్‌గా అతడు చేసిన వాదన మరో కారణం.

ఏమైతేనేం సమ్మె విజయవంతమైంది. విద్యార్థినీ విద్యార్థులుమహోత్సాహంతో సమ్మెలోనూ, అనంతర వూరేగింపులోనూ పాల్గొన్నారు. ప్రజలుకూడా వారి చర్యని మనస్ఫూర్తిగా బలపరిచారు.

కాని మరో వారం గడిచినా టీచర్ల సమ్మె పరిష్కారం కాలేదు.

మరోసారి సమ్మె చేద్దామనుకుంటుండగా మరో మూడ్రోజులకెలా అయితేనేం ప్రభుత్వం టీచర్ల జీతాలగ్గాను ఫండ్స్ రిలీజ్ చేసింది.

ఆ సందర్భంగా ఆ ప్రాంతంవాడైన మంత్రిగార్ని తీసుకొచ్చి సన్మానం చేశారు ఛైర్మన్ గారూ, సమితి ప్రెసిడెంటు, యమ్మెల్యే తదితరులు.

సన్మాన సభలో మునిసిపల్ టీచర్ల విషయమై మంత్రిగారెంతో ప్రత్యేక శ్రద్ధ తీసుకుని గ్రాంట్లు విడుదల చేయించారంటూ ఛైర్మన్‌గారాయన్ని ప్రశంసిస్తే ఆయన ఈయన్ని పొగిడేశాడు.

"...ఈ కార్యంలో మీ ఛైర్మన్‌గారి పాత్రా ఉంది. మేం మొత్తం రాష్ట్ర వ్యవహారాలన్నీ చూడాలి గనుక మాకు ఎన్నో పనులుంటాయి. అది గ్రహించి మీ ఛైర్మన్‌గారే హైదరాబాద్ వచ్చి పనయ్యేవరకు దగ్గరుండి పని చేయించుకొచ్చారు" అన్నారాయన.

మంత్రిగారి వుపన్యాసం వల్ల చాలామందికో సత్యం తెలిసింది. ఆయన వుద్యోగులకి రాజకీయాలొద్దన్నారు. విద్యార్థులకొద్దన్నారు. కార్మికులకీ, రైతులకీ వద్దన్నారు. వాళ్ళందరికీ వారి వారి పనులే ముఖ్యమనుకోవాలన్నారు. బాగానే వుంది. మరి రాజకీయాలూ, పదవులూ ఎవరికావాలి? ఇప్పుడధికారంలోవున్న వారికీ, వారి వారసులకీ, తాబేదార్లకీ మాత్రమేనా? అలాగే అన్పించింది చాలామందికి.

* * *

స్కూళ్ళూ, కాలేజీలూ తెరచి ఆరు నెలలయ్యాయిగాని చాలా క్లాసులవాళ్ళకి పాఠ్యపుస్తకాలే మార్కెట్లోకి రాలేదు.

ఈసారి తప్పనిసరిగా స్కూళ్ళు తెరిచేసరికి పాఠ్యపుస్తకాలు సప్లై చేస్తామనీ అందుకన్ని ఏర్పాట్లూ చేశామనీ ఎన్నో ప్రకటనలిచ్చిన విద్యామంత్రిగారు

 

ఇప్పుడు కాగితాల కొరతనీ, ప్రెస్సుల్లో ఆలస్యమయ్యిందనీ 'సారీ'లు చెబుతున్నారు!

"మేమేం పాఠాలు చెప్పం?" అని ఉపాధ్యాయులు ప్రశ్నిస్తోంటే, "మేమేం చదువుకుని పరీక్షలు రాయం?" అంటున్నారు హైస్కూలు విద్యార్థులు. పాఠ్య పుస్తకాలకోసమూ, ఎక్సర్‌సైజు పుస్తకాలు చౌక ధరకి సప్లై చెయ్యమనీ కొన్నిచోట్ల ప్రదర్శనలూ, సమ్మెలూ చేస్తున్నారు కూడా.

ఆ వార్తలన్నీ అసహనంగా చదువుతున్నాడు రవి.

మరోచోట దొంగ మార్కుల లిస్టుల్తో ఎంట్రన్స్ రాశారనీ, మెడికల్ ఎంట్రన్స్ పేపర్ల వేల్యుయేషన్లో అవకతవలు జరిగాయనీ కొందరు కోర్టుకెక్కారన్న వార్త ప్రచురించారు.

ప్రాన్పడిపోయాడు రవి.

తన పేపరుకూడా అవకతవకలకి గురైనందున తప్పేదేమో? లేకపోతే తన మార్కులింకొకరికీ, ఇంకొకరి మార్కులు తనకీ వేశారేమో? ఏం చెప్పగలం ఏం జరగటానికైనా అవకాశం వుంది!

నిట్టూర్చి పేపర్ విప్పిన రవికి బాక్సు కట్టి ప్రకటించిన వార్త కన్పించింది. గబగబా చదివాడు.

"ఆత్మహత్య చేసుకున్న మాస్టర్ డిగ్రీ గల నిరుద్యోగి" అన్న హెడ్డింగ్ కింద వుద్యోగం రానందున, తల్లిదండ్రులు తన మీద పెట్టుకున్న ఆశలు నిజం చెయ్యలేని అశక్తుడైనందున విసిగి వేసారి ఆత్మహత్యకు తలపడ్డాడనీ, అతని పేరు శివాజీ అనీ, యమ్మెస్సీ క్లాసుతో పాసయ్యాడనీ రాశాయి!

అదిరిపోయాడు రవి.

తన కళ్ళని విశ్వసించలేక మళ్ళీమళ్ళీ చూశాడు.

అవునన్నీ నిజమే. అతడిపేరు శివాజీయే!

కళ్ళనుండి కన్నీళ్ళు కాల్వలు కట్టాయ్.

ప్రతిపరీక్షా ఎంతో దీక్షగా,పట్టుదలతో చదివి వుత్తీర్ణుడైన శివాజీ, ఐఏయస్ కావాలని కష్టించి ప్రిలిమినరీ ఎగ్జామ్ పాసైన శివాజీ కళ్ళముందు కదిలాడు.

ఆమధ్య కన్పించినప్పుడు అతడి కళ్ళల్లో కన్పించిన నిరాశా, మాటల్లో ధ్వనించిన నిస్పృహ గుర్తొచ్చి విలవిల్లాడాడు.

అతడిమీదెన్నో ఆశలు పెట్టుకుని మరెన్నో గాలిమేడలు కట్టుకున్న శివయ్య మాస్టారూ, ఆయన భార్యా ఎలా వున్నారో...ఆ షాక్‌కి ఏమయ్యారో అన్పించి వణికిపోయాడు.

వెంటనే వూరికి పయనమయ్యాడు.

వూరంతా శివాజీ గురించేఆలోచిస్తోంది; విచారిస్తోంది.

"ఏదో పరీక్ష వుందని బెజవాడెళ్ళి ఆత్మహత్య చేసుకుంటున్నానని చీటీరాసి చచ్చిపోయాట్ట. మొన్నపొద్దుటే వార్త తెలిసిందిట" అనెవరో ఎవర్తోనో చెబుతున్నారు.

"ఉద్యోగం ఇవాళగాక పోతే రేపొస్తుంది. ఈమాత్రానికే ఆత్మహత్య చేసుకుని కన్నవాళ్ళ కడుపుల్లో ఆరని చిచ్చు పెట్టాలా?" అంటున్నారు కొందరు.

"వుద్యోగాలెక్కడొస్తాయిలే. ఇక పిల్లల్ని చదివించడం దండగ" అని తేల్చిపారేస్తున్నారు కొందరు.

శివయ్య మాస్టారింటి దగ్గర చాలామంది జనం ఉన్నారు. మాస్టారి పరిస్థితేం

బావుండలేదు.

"నువ్వు కలెక్టరువవుతావురా. కార్లలో తిరుగుతావురా. నువ్వు నిజంగా జీనియస్సువిరా. ఈ పుణ్యభూమిలో పుట్టడం నీ పూర్వజన్మ సుకృతంరా" అంటూ శూన్యంతో మాట్లాడుతూ గొణుక్కుంటూ ఏడుస్తున్నారాయన.

"రెండ్రోజుల్నుంచీ ఇలాగే వుంది. మతి స్థిరం తప్పినట్లుంది" అన్నారెవరో.

ఓపక్క కొడుకు పోయిన దుఃఖం, మరో పక్క మతిస్థిరంలేని భర్త వల్ల శోకం— వీటిమధ్య నలిగి హోరున భోరున ఏడుస్తోంది మాస్టారి భార్య.

ఆవిణ్నెలా ఓదార్చాలో తెలీలేదు రవికి!

* * *

"మా ఇంటికెళ్దాంరండి" కాలేజీ అయ్యాక రవినాహ్వానించింది అరుణ.

"ఏమైనా పనుందా?"

"పనుంటేనే వస్తారా?"

"అహ... అలాకాదనుకోండీ"

"ఇంకేం చెప్పకుండా రండి"

"ఓకే... పదండి"

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. దారిపొడవునా చాలా జతల కళ్లు తమవంక ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ, అసూయగానూ కూడా చూస్తూండటం వాళ్లు గమనించకపోలేదు.

"చూస్తోంటే మనం జంట కవుల్లా వున్నాం" వున్నట్టుండి అందామె నవ్వుతూ.

"ఏం...?"

"ఏమీ తెలీనట్లలా అడుగుతారేం? మీరు కార్యదర్శి అయితే నేను ఉపకార్యదర్శిని. మీరు ప్రెశిడెంటైతే నేను వైస్ ప్రెశిడెంటుని. మనది జంట నాయకత్వమన్నమాట"



"మనం ఇండివిడ్యువల్‌గా నాయకత్వం వహించలేనప్పుడు జంట నాయకత్వంలో తప్పులేదుగా?"

"తప్పులేదుగాని మహానుభావా...ఈ జంటల గొడవ ఎక్కడికి దారితీస్తుందో అని భయంగా వుంది"

ఆమెలో కొత్త అందాలూ, సిగ్గులూ కన్పించి కించిత్తు విస్తుబోయాడు రవి. హుషారుగా ఫీలయ్యాడు కూడా.

ఇంట్లో అడుగుపెడుతోంటే-"ఎవ్వర్లేనట్టున్నారే?" అనడిగాడు.

"వూరికెళ్ళారండీ"

"అదీ....అలా చెప్పండి. ఏవిటీవిడ పట్టపగలు రమ్మని పిలిచేస్తోందీ అనుకుంటున్నాను. అదన్నమాట కథ! ఎవళ్లూ లేరుగనుక ఇల్లు మీ ఇష్టారాజ్యమైపోయిందన్నమాట"

"వాళ్లుంటేమాత్రం నాకు భయమా?"

"భయంకాదుగాని అలాటిదే"

"నాకేం భయా ల్లేవులెండి. పైగా మీ గురించంతా వాళ్ళకి చెప్పేశా న్లెండి"

"చంపేశారు! మీకు తెలుసో లేదో-నాకు కాపీరైట్ హక్కుందండోయ్. నా పర్మిషన్ లేకుండా ఎవరూ ఎక్కడా ఏ రకంగానూ నా గురించి చెప్పకూడదు"

"అసలు నాకు తెలీకడుగుతానూ... మీ గురించి చెప్పుకునేంత గొప్పవారా మీరు అని?"

"అమ్మమ్మ...అలా అనకండి. పెళ్ళికెదిగిన ఫస్ట్‌క్లాసైన కుర్రవాణ్ని. ఆ క్వాలిఫికేషన్ చాలదేమిటి?"

"అలాగా పాపం"

ఇద్దరూ హాయిగా నవ్వేసుకున్నారు.

అరుణ ఒక ప్లేటునిండా స్వీట్సు పెట్టుకొనొచ్చి ఇచ్చింది.

"ఇవన్నీ ఏమిటండీ?"

"వీటిని స్వీట్స్ అంటారు. తింటే తియ్యగా వుంటాయ్"

"ఓహో...మీరూ తెచ్చుకోండైతే"

తనూ ఓ ప్లేటు తెచ్చుకుని కూర్చుంది అరుణ.

"ఇంతకీ ఈ అల్పాహార విందు ఎందుకో ఏవిటో చెప్పలేదు"

"ఇవాళ నా బర్త్‌డే అండీ"

"అయ్‌సీ! ఇందాక చెబితే ఓ బుల్లి ప్రెజంటేషన్ తెద్దునుకదా. పోనీలెండి... ఇదిగో ఈ స్వీటే నా ప్రెజంటేషన్‌గా తీసుకోండి. మెనీ హేపీ అండ్ స్వీట్ రిటర్న్స్ ఆఫ్ ద డే"

"థాంక్యూ"

"మరింకెవర్నీ పిలవలేదేం?"

"నాకు నచ్చినవార్నే పిలవాలని..."

సాభిప్రాయంగా చూశాడామె కళ్ళల్లోకి.

ఆమె కళ్ళు సిగ్గుతో వాలిపోయాయి.



## 10

"రవిగారూ... రవిగారూ"

ఉలిక్కిపడి బయటికొచ్చారు రవీ, ప్రకాషూ.

బయట నలుగురైదుగురు హాస్టల్ స్టూడెంట్లున్నారు.

"అక్కడే నిలబడ్డారేం! లోపలికి రండి"

"మీరు అర్జంటుగా రావాలండీ"

"ఎక్కడికి?"

"మాకు కేంటీన్లో పెట్టిన అన్నంలో చచ్చిన బల్లి ఉంది"

"మైగాడ్! ఎవరైనా తిన్నారా?"

"కొందరు తిన్నారు. ఇంతలో బల్లి కన్పించి మేం తినకుండా వచ్చేశాం"

"వార్డెన్‌కి రిపోర్ట్ చేద్దాం గాని మీకు మళ్ళీ వండి పెట్టమనక పోయారా"

"అడిగాం... పెట్టమన్నారు. వార్డెన్ గారు కూడా కాంట్రాక్టు ప్రకారం ఒక్క సారే వండిపెడతారన్నారు"

"ఎక్కడున్నారాయన?"

"కేంటీన్ పైనున్న రూమ్‌లో. ఏదో పార్టీ చేసుకుంటున్నారు"

"సరే...పదండి" చొక్కా తొడుక్కుని బయలుదేరాడు.

"అసలు హాస్టల్ భోజనంబాగుండటం "లేదండీ! నానా చెత్తా కలిపి పారేస్తున్నారు మా ముఖాల్ని" అన్నారొకరు.

"ఇదివరకు ఉదయంపూట రెండు రకాల టిఫిన్లు చేసేవారు. ఇప్పుడు ఒక్కటే తగలేస్తున్నారు. ఇదేమంటే రేట్లు పెరిగిపోయాయంటున్నారు" అని ఫిర్యాదు చేశారింకొకరు.

"హాస్టల్లోని మంచాలెంత పాతవో మీకు తెలుసు కదా! మొన్న విక్టర్ రూమ్‌లో మంచం విరిగిపోతే దాని ఖరీదు కట్టమని కూర్చున్నారు వార్డెన్‌గారు" ఇంకొకరన్నారు.

"ఆ మంచాలకి నల్లుల మందు కూడా రాయించరు. ఇతర సౌకర్యాలూ చూడరు. హాస్టల్ సొమ్మంతా మింగి కొత్తగా ఇల్లు కట్టుకుంటున్నాడు వార్డెన్ సుందర్రావు" కోప్పడ్డారింకొకరు.

అన్నీ మౌనంగా విన్నాడు రవి. అతడికవన్నీ తెలిసినవే. గతంలో చవి చూసినవాడే కదా. ఈ ఏడాది సంఘంలోని ముఖ్యులకి సీటివ్వక వాళ్ళని ఇబ్బందులపాలు చేసినప్పట్నుంచీ రవి గుండెలు రగులుతూనే ఉన్నాయి. అయినా ప్రిన్సిపాల్‌గారో, మరొకరో వారిని రక్షిస్తూనే ఉన్నారు. ఈసారలా జరగనివ్వకుండా ఆయనంతు తేల్చుకోవాల్సిందే.

కేంటీన్ మేనేజర్తో మాట్లాడి నా ప్రయోజనం లేకపోయేసరికి వార్డెన్ సుందర్రావుగారు వగైరాలున్న రూమ్‌వైపు వెళ్ళారు అంతా.

నెలకి రెండుమూడుసార్లు ఆ రూమ్‌లో సుందర్రావుగారు తన అభిమాన విద్యార్థుల్తో కలిసి విందూ, మందూ ఏర్పాటు చేసుకుంటుంటారు. ఆ విందులోని సరుకులన్నీ కేంటీన్‌నుంచి హాస్టల్ ఖర్చు మీద తయారయ్యాయన్నది బహిరంగ రహస్యమే.

విద్యార్థులెళ్ళేసరికి సుందర్రావుగారు మాంచి పట్టులో వున్నారు. వీర్రాజు, ఓల్డ్ స్టూడెంట్ శేషగిరి అదుపుతప్పేసి వూగుతూ పేలుతున్నారు.

తలుపులు బాది పిలిచేసరికి ''ఎవర్రా'' అంటూ అరిచారు సుందర్రావుగారు. ఆ పిమ్మట తిడుతూ, తూలుతూ వచ్చి తలుపు తీశారు. రవినీ, అతడి వెనకాలున్న విద్యార్థుల్నీ చూసి గతుక్కుమన్నారు. కొంచెంగా మత్తు దిగింది గాని బింకం సడలలేదు.

''మేనర్స్ లేకుండా అర్థరాత్రి అంకాలమ్మ శివాలేంటి?" విసుగ్గాఅన్నారు.

"డిస్టర్బ్ చేస్తున్నందుకు క్షమించండి. అన్నంలో చచ్చిన బల్లి వుందట. మళ్ళీ అన్నం వండించి పెట్టించమని కోరడానికొచ్చాం"

''బల్లి వుంటే ఛస్తారా? ఈమాత్రం

దానికే వీధెక్కి రాద్ధాంతం చెయ్యాలా? అసలు మీకామాత్రం తిండైనా పెడుతు న్నందుకు సంతోషించి నోరు మూసుకు వెళ్ళండి''

"మీరు చాలా అమర్యాదగా మాట్లాడు తున్నారు"

"ఫోబే. నీకు మర్యాదేవిటి? నిన్ను పోలీసులకి పట్టిస్తాను జాగ్రత్త"

"మర్యాద ఇచ్చి పుచ్చుకోండి'' అంటూ చొక్కా చేతులు మడుస్తూ ముందుకి రాబోయిన కుర్రాళ్ళనాపుతూ రవి అన్నాడు - "మీకు చేతనైంది చేసుకోండి. కాని భోజనం సంగతే మంటారు?"

"ఇష్టంవుంటే మేంపెట్టేది తినండి. లేకపోతే పొండి.... అంతే! వూరికే వూర కుక్కల్లా మొరిగితే వూరుకోను" దభేలున తలుపేసుకున్నారు.

"రవిగాడా? లోపలికి లాక్కు రాకపోయారా... వాడిపని పడుదుం. పీడ విరగడయ్యేది'' అని శేషగిరి అంటే, "ఎప్పటికైనా వాడిపని పట్టేది నేనే! వాడి అంతు చూట్టానికే పుట్టాన్నేను" అని డంబాలు పలికాడు వీర్రాజు.

కాని సుందర్రావుగారు జవాబివ్వలేదు. వాళ్ళు బల్లి వూసెత్తినప్పట్నుంచీ అతడి గుండెలు దొక్కు మోటార్లా శబ్దం చేస్తు న్నాయ్. బిర్యానీ, చికెన్ఫ్రై కేంటీన్లో వండినవే. ఒకవేళ వాటిల్లో కూడా బల్లి పడివుంటే...

కడుపులో దేవినట్లన్పించింది.

బెల్ కొట్టి సర్వర్ని పిలిచి తన అనుమానం వట్టి అనుమానమేనని తేల్చు కున్నాక గాని కుదురుగా ఉండలేక పోయారాయన. అప్పటికి తలకెక్కిన మత్తు దిగిపోవడంతో విసుక్కుంటూ బాటిల్ అందుకుని చీర్స్ చెప్పుకున్నారు.

''ప్రిన్సిపాల్కి రిపోర్టుచేసి తేల్చు కుందాం. ఈ పూట హోటల్లో తిందురు గాని" అన్చెప్పి వెనుదిరిగిన రవీ, వాళ్ళు కేంటీన్ ఆవరణ దాటారో లేదో మొదటి బేచ్లో భోంచేసిన వాళ్ళలో ఆరుగురికి వాంతులవుతున్నాయని చెప్పేరెవరో. అంతా హాస్టల్ వైపు పరుగెత్తారు.

బల్లి సంగతి తెలీని విద్యార్థులు వాంతులు చూసి బెంబేలుపడసాగారు కలరా సోకిందేమోనని.

వారికి ధైర్యంచెప్పి వాళ్ళందర్నీ ప్రభుత్వాసుపత్రికి తీసుకెళ్ళారు. ప్రమాదం లేదని చెప్పేరు డాక్టర్లు ట్రీట్మెంటిస్తూ. మర్నాటిఉదయం హాస్టల్ విద్యార్థులెవరూ కేంటీన్లో భోంచెయ్యడం లేదు. అందరికీ భయంగా వుండటంతో అటు తొంగిచూళ్ళేదెవరూ. కేంటీన్ని బాయ్కాట్ చేసి వుంటారని కేంటీన్ వాళ్ళు కంగారుపడితే, వాళ్లంతు చూస్తా నంటూ చిందులు తొక్కసాగారు వార్డెన్ గారు.

ప్రిన్సిపాల్ని కలిసి జరిగిందంతా వివరించి తగినచర్య తీసుకోమని కోరారు విద్యార్థులు రవి ఆధ్వర్యంలో. కేంటీన్లో భోజనం చెయ్యడానికి విద్యార్థులు భయ పడుతున్న సంగతి కూడా చెప్పేరు.

"నేనంతా కనుక్కుని సాయంత్రం చెబుతాను. అవసరమైతే ఎలాటి చర్య తీసుకోడానికైనా వెనుకాడను. మీరీలోగా తొందరపడి గొడవ చెయ్యకుండా క్లాసుల కెళ్లండి" అని ఆయన హామీ ఇవ్వటంతో వచ్చేశారు.

సాయంత్రం ప్రిన్సిపాల్ దగ్గరికెళ్ళే సరికి ఆయన చాలా సీరియస్గావున్నారు. ఆయన మొఖం ఎర్రగా గంభీరంగా

వుంది. వాళ్లని తినేశాలా చూసి అన్నారు.

"వెల్ మిస్టర్ రవీ! నేనావిషయాలన్నీ కనుక్కొన్నాను. కేంటీన్ ప్రొప్రయిటరూ, సర్వర్‌లూ అంతా కూడా అది అబద్ధమనీ, ఇది కొందరు విద్యార్థులు అల్లర్లు సృష్టించడానిగ్గాను చేసిన పననీ, చచ్చిన బల్లిని తెచ్చి అన్నంలో వేసి అన్నంలో వచ్చిందంటూ గొడవచేశారనీ అంటున్నారు. అందువల్ల మేం అది నమ్మక తప్పడం లేదు"

స్తంభీభూతులయ్యారంతా. అప్పుడే చక్కని కథకి రూపకల్పన చేశారన్న మాట!

"అదే మీ ఫైనల్ డెసిషన్ అయితే స్ట్రయిక్ చెయ్యాల్సొంటుంది మేం" సూటిగా అన్నాడు రవి.

"స్ట్రయిక్! స్ట్రయిక్! స్ట్రయిక్! ఎవర్నయ్యా మీరు బెదిరించేదీ? అసలు మీరు స్ట్రయికుల కోసమే కాలేజీలో జేరారా యేం? మీలాటివారివల్లే విద్యాలయాలు కలుషితమైపోతున్నాయ్. లేకపోతే ప్రతి చిన్న విషయానికీ స్ట్రైకు లేనా? నోనో...దటీజ్ నాట్ ది ప్రోపర్ వే టు డీల్ థింగ్స్. మీరు విద్యార్థులనీ, నేను రెస్పాన్సిబుల్ ప్రిన్సిపాల్‌ననీ మీరు గుర్తుంచుకోవాలి. మీరు మీ సమస్యల్ని నా దృష్టికి తీసుకొచ్చారు. నేను విచారణ చేశాను. వారిది దోషమై వుంటే తప్పక చర్య తీసుకునేవాణ్ణే గనుక ఆ విషయం మర్చిపోండి. అనవసరంగా ప్రతిదానికీ గొడవచేసి అరాచకం సృష్టించి నాకూ, మన కాలేజీకీ చెడ్డపేరు తెస్తోంటే నేను సహించను. తీవ్రమైన చర్య తీసుకోవల్సి వస్తుంది... మైండిట్"

"మీరన్నది నిజమేనండీ. కాని చూడండి ప్రిన్సిపాల్‌గారూ! ... తినే అన్నంలో బల్లి వుందని చెప్పి మళ్ళీ అన్నం వండిపెట్టమంటే అది తప్పైపోయినట్లు వార్డెన్‌గారు కూకలెయ్యటం బాగుందంటారా? అదంతా కట్టుకథని నిజాలకి మసిపూసి మారేడుకాయచేసి విద్యార్థుల ప్రాణాలతో చెలగాటమాడుతోంటే చూస్తూ వూరుకోమంటారా?"

"వాడ్డూయూమీన్? మేమంతా అన్యాయంగా ప్రవర్తిస్తున్నామంటావ్? యస్... యుకెన్‌గో. మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. కాని మీ వాదనని విన్నట్టే అవతలి వారి వాదననీ, నేను వినాలనీ సాక్ష్యాధారాలనుబట్టే ఓ నిర్ణయానికి రావాలి తప్ప మీ బెదిరింపు లెక్కాదని మర్చిపోకండి"

"సాక్ష్యాలిచ్చే సర్వర్లు మాకు లేకపోవచ్చు. కాని ఆ కేంటీన్ భోజనం తినాలంటేనే ఇదైపోతున్న విద్యార్థుల కన్నా గొప్ప సాక్ష్యం వుండదనుకుంటాను. ఇదిగోనండి సమ్మె నోటీసు"

వాళ్లు విసవిసా వెళ్ళిపోతోంటే నుదురు పట్టుకుసుండిపోయారు ప్రిన్సిపాల్ గారు.

మర్నాడు సమ్మెకు పిలుపిచ్చి మద్దత్తు కోసం విద్యార్థులకి వివరిస్తోంటే బాలాజీ రావూ, వీర్రాజూ వచ్చి కరపత్రాలు పంచసాగారు.

బాలాజీరావు హాస్టల్ స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంటు. హాస్టల్లో సంఘం వాళ్ళకెక్కువ సీట్లివ్వకపోవడంతో ఇంచుమించు ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడతడు. కేంటీన్ సంఘటన గురించి తనకెవరూ చెప్పకుండా, తన సాయం కోరకుండా తనని పూర్తిగా నిర్లక్ష్యంచేసి రవిన్నాశ్రయించడం, అతను ముందుకొచ్చి సమ్మెకి పిలుపివ్వడం అతడికి భరించరానిదిగా వుంది. ఆ అగ్నికి సుందర్రావు గారు మరికొంత ఆజ్యం పొయ్యడంతో

రెచ్చిపోసాగాడు.

వీర్రాజు కాలేజీ ఎన్నికల్లో రవి చేతుల్లో ఓటమి చవిచూసినప్పట్నుంచీ కూడా రవి మీద పీకల్దాకా కోపం వుంది. టీచర్ల సమ్మెని బలపరిచి తన తండ్రిని ఎదిరించటంతో అది మరింత పెరిగింది. కాలేజీ హీరో అన్పించుకోవాలని, అంతా తన చుట్టూ భజన చేస్తోంటే బోర విరుచుకుని తిరగాలని కలలుకనే అతను అన్నిటా రవి ఆధిక్యత చూసి భరించలేక విల విల్లాడుతున్నాడు. రవిని చీమని నలిపినట్లు నలిపేస్తానని తన స్నేహితుల దగ్గర ప్రగల్భాలు పలుకుతున్నాడు.

ఈ హాస్టల్ వ్యవహారం ఒక సాకుగా వుపయోగించుకుని రవిని ఏకాకిగా చేసి అడ్డు తొలగించుకోవాలని వారి తాపత్రయం.

"కాలేజీలో, హాస్టల్లో అలజడీ, అరాచకం సృష్టించడానిగ్గాను ప్రిన్సిపాల్ గారన్నా, వార్డెన్‌గారన్నా కిట్టని కొందరు విద్యార్థులు వారిని ప్రతిష్ట చెయ్యడానిగ్గాను పన్నిన పన్నాగమే అన్నంలో చచ్చిన బల్లి కన్పించడం. అంతేతప్ప వాళ్ళు చెబుతోందల్లా అబద్ధం...ఒక ఫార్స్. వాళ్లు సమ్మె చెయ్యడానికి సిద్ధపడుతున్నట్టు తెలుస్తోంది. పరీక్షలకి రెండునెలల వ్యవధే వుండగా సమ్మె అనడం దారుణం, ఘోరం. మన చదువుల్ని మంట కలపడానికి పన్నిన ఆ కుట్రని భగ్నం చెయ్యాల్సిందిగా కోరుతున్నాం?"

అదీ వాళ్ళు పంచుతోన్న కరపత్ర సారాంశం!

కాని దానినెవరూ నమ్మలేదు. కేంటీన్-భోజనం తిన్న కొందరు వాంతులు చేసుకోవడం, ఆసుపత్రిలో అడ్మిట్టవడం అందరికీ క్రితం రోజునే తెలిసింది. అదీ కాక సుందర్రావుగారి చేష్టలు తెలీని వారెవ్వరూ లేరు!

వీర్రాజూ వాళ్ళూ కొందరు విద్యార్థుల్ని కాలేజీలోనికి తీసుకుపోయినా మిగతా వాళ్ళంతా సమ్మెలో పాల్గొన్నారు. అయితే అవాళ్టి ఉదయం క్లాసులేం జరగనందున మధ్యాహ్నం నుంచి వాళ్లు కూడా సమ్మెను బలపరిచారు.

దీనితో ఇంతవరకూ కొందరికే తెలిసిన హాస్టల్ అవకతవకలు రచ్చకెక్కాయ్. వార్డెన్‌గార్ని విమర్శించనివాళ్లొక్కళ్ళూ లేకపోయారు.

సమ్మె మొదలైన రెండో రోజు రాత్రి కొందరు బయటి వ్యక్తులు హాస్టల్ విద్యార్థుల మీద దాడిచేసి గాయపరిచారు.

పరిస్థితి వుద్రిక్తమయ్యింది.

ఊళ్ళో భయాందోళనలు చోటు చేసుకున్నాయ్.

అరాచక శక్తులు విజృంభించినందున కళాశాల ప్రశాంత వాతావరణానికీ, ఆస్తులకీ, ప్రాణాలకీ కూడా నష్టం వాటిల్లొచ్చని ప్రిన్సిపాల్‌గారు పోలీసు రక్షణ కోరారు.

పట్నంలో 144వ సెక్షన్ విధించారు. అయినా సమ్మె ఆగలేదు. ఆందోళన తగ్గలేదు. విద్యార్థుల మీద దాడిచేసిన నిందితుల్లో ఒక్కర్ని కూడా అరెస్ట్ చెయ్యలేదు.

వార్డెన్ సుందర్రావుగార్ని సస్పెండ్ చేసి దర్యాప్తుకు ఉత్తర్వు ఇచ్చింది ప్రభుత్వం. సమ్మెని ఉపసంహరించుకోమనీ, హాస్టల్ స్టూడెంట్స్‌కి వేరే భోజనం ఏర్పాటుచెయ్యబడుతుందనీ విద్యార్థులకి విజ్ఞప్తి కూడా చేశారు.

విజయోత్సాహంతో ఆనంద నాట్యం చేసింది విద్యార్థి ప్రపంచం.

* * *

రవి కాలేజీనుంచొచ్చేసరికి కుటుంబరావుగారు అతడి రూమ్ దగ్గర అతడి కోసం నిరీక్షిస్తున్నారు.

"ఎంతసేపయ్యింది మామయ్యా వచ్చి?" ఆయనెందుకొచ్చారో అని కొంచెం గాభరాపడుతూ అడిగాడు-ఆందోళనతో నిండివున్న ఆయన ముఖం చూసి.

"ఇంత క్రితమేలేగాని... నిన్నగాని, ఇవాళగాని మన జయంత్ వచ్చాడా ఇటు?"

"వూహూ... రాలేదే. నాక్కనిపించి కూడా చానాళ్ళయింది. జయంత్ నిన్నట్నుంచీ ఇంటికి రాలేదా?" ఆదుర్దాగా అడిగాడు.

"రాలేదురా"

"రాకుండా ఎక్కడి కెళ్ళాడబ్బా? ఎవరైనా స్నేహితులింట్లో వున్నాడేమో కనుక్కోకపోయారా?"

"కనుక్కున్నాంరా..."

"ఇంట్లో ఏమైనా దెబ్బలాడేవా?"

"లేదుగాని మావీధి చివర ధర్మారావుగార్లేరూ-వారింటికెళుతూండేవాడ్లేతరచూ. వాడికీ, వాళ్ళ పిల్లలకీ బాగా దోస్తీ కూడానూ. మరి నిన్నేం పాడుబుద్ధి పుట్టిందోగాని ఎవ్వర్లేకుండా చూసి వాళ్ళమ్మాయి చెయి పట్టుకున్నాట్ట. ఆ అమ్మాయి కేకలెయ్యడంతో పరుగెత్తుకొచ్చాడింటికి. అప్పుడే బడినుంచి నేనూ వచ్చాను. వాడేదోలా వుండేసరికి అలా వున్నావేమిట్రా అంటే కుక్క కరవబోయిందన్నాడు. కాబోల్లే అనుకుని నిన్న ఫస్టుగనుక తీసుకున్న జీతం డబ్బున్న చొక్కా పంకెనకి తగిలించి నూతిదగ్గరకెళ్ళాను కాళ్ళూ, చేతులూ కడుక్కోడానికి. తిరిగొచ్చి కాఫీ తాగి పచారీ సరుకులకెళ్దామని చొక్కా తొడుక్కుని చూసేసరికి డబ్బులేదు. అది జయంత్ పనేనని నిన్నట్నుంచీ వెదుకుతూనే వున్నాంగాని ఇంతవరకూ పత్తాలేడు ఎక్కడికి చెక్కేశాడో ఏమో! వాడు రాలేదన్చెప్పి మీ అత్త తిండీ తిప్పలూ లేకుండా కూర్చుంది ఏడుస్తూ"

ఆయన కళ్ళు తుడుచుకొంటోంటే రవికెంతో బాధేసింది. ఇక మేనత్త పరిస్థితి ఎలా వుండివుంటుందో వూహించడం కష్టంకాదు.

కాని జయంత్ ఇలా తయారవ్వడానికి అత్త గారాబం కూడా కారణమే.

ఇప్పుడెక్కడున్నాడని, ఎన్నిచోట్లని వెదకగలం? వాడొస్తేనేగాని ఆవిడ నోట్లో ముద్ద పెట్టుకోదు!

ఎలా?

ప్రకాష్‌తో ఆ రాత్రికి రానన్చెప్పి కుటుంబరావుగార్తో కలిసి వాళ్ళింటికి కెళ్ళాడు రవి.

అతణ్ని చూసి బావురుమంది అన్నపూర్ణ. పిల్లలు కూడా దిక్కుమొఖాలేసుకుని కూర్చున్నారు.

ఆమెనోదార్చడానికి అతడికి మాటలు దొరకలేదు. దొరికిన రెండు మాటలకీ ఆమె కన్నీటి ప్రవాహం ఆగలేదు!

తెల్లారగానే జయంత్ స్నేహితులందరిళ్ళకీ వెళ్ళి మళ్ళీ అడిగారుగాని అతడి ఆచూకీ దొరకలేదు. బంధువులిళ్ళకి వెళ్ళే ఆస్కారం లేదుగనుక సమీప పట్నాల్లో వెదికితే మంచిదన్పించి కుటుంబరావుగారొవూరికీ, రవి ఇంకోవూరికీ వెళ్ళారు.

జయంత్‌కోసం ఊరంతా వెదికాడుకాని ఫలితం శూన్యం.

బహుశా ఈ ప్రాంతంలో వుండి వుండదన్పించి రైల్వేస్టేషన్ వైపెళ్తోంటే స్వామి కన్పించాడు. అతడు బాగా చిక్కినందున రవి వెంటనే గుర్తుపట్టలేక పోయాడు. అతడే గుర్తించి పిలిచాడు.

"హాయ్ రవీ...ఎలా వున్నావ్? మనం కలిసి రెండేళ్ళపైనే అయ్యిందికదూ?"

"అవునవును... చాన్నాళ్ళయ్యింది. చాలా చిక్కిపోయావు స్వామీ" అతడి మొఖంలోకిచూస్తూ అన్నాడు. అక్కడతడికి పొగచూరిన పొగ గొట్టాలు కన్పిస్తున్నాయ్!

"ఓ చిన్న కార్మికుణ్ని. ఇంతకంటే ఎలా వుంటాను చెప్పు?"

"మీ ఫాక్టరీ ఎలావుంది?"

"దానికేం... లాభాలు బాగా పెరుగుతున్నాయి. మేంకూడా ఈమధ్య చాలా సాధించుకున్నాంలే. అందులో ఉచిత వైద్య సౌకర్యం ఒకటి"

"నీలాంటి తెలివైనవాడు ఓ చిన్న వర్కర్‌గా ఓ ఫాక్టరీలో కూరుకుపోవడం బావోలేదు. ప్రైవేటుగా ఇంటర్ చదవటమో, క్లరికల్ జాబ్‌కి ప్రయత్నమో చెయ్యలేకపోయావా?"

"ఏ మెషీన్ అయినాసరే నడవటానికి చిన్న నట్టుకి కూడా ఎంతో ప్రాముఖ్యత వుంటుంది. అంచేత నీలాటివాడుకూడా చిన్న వర్కర్ అంటూ చిన్నచూపు చూడటం బావోలేదు"

"సారీ...నా ఉద్దేశం అదికాదు"

"నాకు తెలుసుగాని పద ఇంటికెళ్దాం మీ వదిన్ని చూద్దువుగాని"

"నీకు పెళ్ళయ్యిందా స్వామీ! మరి నాకు వెడ్డింగ్‌కార్డ్ పంపలేదేం? అవున్లే... నేనెక్కడ గుర్తుంటాన్లే" నిష్ఠూరంగా అన్నాడు.

"అదికాదు రవీ... నా పెళ్ళి అనుకోకుండా జరిగిపోయింది. మా ఫాక్టరీలో పనిచేసే ఓ కార్మికుడు చనిపోతేనూ అతడి కూతురు అనాధ అయిపోతుందని చేయి అందించానంతేతప్ప మా పెళ్ళి ఆడంబరంగా శుభలేఖల్తో జరగలేదు"

"ఇప్పుడు కాదుగాని ఇంకోసారి తప్పకుండా వస్తాను. మా మామయ్యకొడుకు కొకడు ఇల్లు విడిచి పారిపోతేనూ వాడికోసం వెదుకుతున్నాం"

"అలాగా... సరేలే! అన్నట్టు నువ్వు మెడిసినేగా చదువుతోంట?"

రవి కళ్ళల్లో కన్నీళ్ళు చిప్పిల్లాయ్.

"అదేమిటి రవీ.... ఏమయ్యింది?"

నవ్వాడు. ఆ నవ్వులో జీవంలేదని ఇదరికి తెలుసు.

"ఇంటర్లో మంచి మార్కులొచ్చినా ఎంట్రన్స్ తప్పేను"

"ఈ ఎంట్రన్సు పరీక్షలూ అవీ కొందరి కోసం ఏర్పాటుచేసిన దొడ్డిదార్లు. లేకపోతే ప్రభుత్వం నిర్వహించిన పరీక్షల మీద ప్రభుత్వానికే నమ్మకం లేక మళ్ళీ ప్రత్యేక పరీక్షలు పెట్టడం సిగ్గుచేటు! పోనీ డొనేషన్ కాలేజీలో ట్రై చెయ్యకపోయావా?"

"అన్నివేలు తేవాలంటే బాంకు దోపిడీ చెయ్యాలి" నవ్వుతూ అన్నాడు.

"అవున్లే. డాక్టరై పల్లె ప్రజలకి నిస్వార్థంగా సేవచేద్దామనుకున్నవాళ్ళకి సీట్లు రావు. రెండు చేతుల్తో డబ్బు సంపాదిద్దామనుకునేవాళ్ళకే సీట్లన్నీనూ"

"వచ్చే ఏడాది మళ్ళీ ట్రైచేస్తాను"

"ఈసారి తప్పకుండా పాసవుతావు రవీ! నాకా నమ్మకం వుంది. ప్రస్తుతం డిగ్రీలో చేరేవా? ఆ కాలేజీలోనేనా?"

"అక్కడే"

తర్వాత కాఫీల్తాగి మిత్రులిద్దరూ వీడ్కోలు చెప్పుకున్నారు.

జయంత్ కోసం వెదకి వేసారి నిరాశతో తిరుగుముఖంపట్టిన రవి మనస్సంతా అల్లకల్లోలంగా వుంది.

జయంత్ మావయ్యకైనా కన్పించాడో లేదో! కన్పించకపోతే ఆ వార్త విని అత్తయ్యతట్టుకోగలదా?మరేంచెయ్యాలి..? జేబులు ఖాళీ అయిన వెంటనే తప్పకుండా తిరిగి వస్తాడని నచ్చజెప్పాలి. తప్పు తెలుసుకుని తప్పకుండా తిరిగి వస్తాడని ఆశపెట్టాలి. మొత్తానికేదో ఏదో చెప్పి ఆమెలో ఆశ నూరిపోయాలి.

కాని....నిజంగా జయంత్ వస్తాడా? అసలెక్కడికి వెళ్ళాడో ... ఏం చేస్తున్నాడో?!

బహుశా జేబులో పైసలైపోవడంతో ఏ హోటల్లోనో కప్పులు కడుగుతూ జరిగిందానికి పశ్చాత్తాపపడుతూ వుండొచ్చు. సిగ్గూ, భయం పోగానే ఇంటికెళ్ళిపోవాలనుకుంటూండొచ్చు.

* * *

ఛైర్మన్‌గారి కుడి భుజం రామనాథంగారు, సస్పెన్షన్‌లోవున్న వార్డెన్ సుందర్రావుగారు, వీర్రాజు, శేషగిరి, బాలాజీరావు కూర్చునున్నారు.

వారిముందు మందు తదితర పూజా సామాగ్రి వుంది.

బాలాజీరావు తప్ప మిగతావాళ్ళంతా అప్పటికే కొన్ని పెగ్గులు లాగించి ఒక స్థితికి చేరుకున్నారు. అతడు మాత్రం కూల్‌డ్రింక్ మెల్లగా తాగుతున్నాడు. వీర్రాజు నోట్లో సిగరెట్టు పొగలు కక్కుతోంది.

మందు మహత్యం ఎవ్వర్లోనూ కన్పించడంలేదు. అంతా మౌనంగా తీవ్రంగానూ ఆలోచిస్తున్నారు. మెదళ్ళోంచి ఆవిర్లు వస్తున్నట్టు అనుభూతి ఫీలవసాగారు కూడా.

''ఆ రవిగాణ్ని పైకి పంపించకపోతే లాభంలేదు. అంతకంతకీ వాడు ఏకు మేకవుతున్నాడు. స్టూడెంట్లు కూడా గొర్రెల్లా వాడి వెనకాలే పడుతున్నారు. నిన్న మొన్నటి వరకూ అనామకుడు-ఇవాళో పెద్ద నాయకుడై కూర్చున్నాడు. మొన్న నన్ను ఓడించినందుకే నా గుండె మండిపోతోంది. ఇవాళ సుందర్రావుగారి మీద పడ్డాడు. రేపు ప్రిన్సిపాల్ మీద ధ్వజం ఎత్తుతాడు. ఎల్లుండీ... వూహూ వాడు ఎల్లుండునే కాదు రేపునే చూడనివ్వకూడదు. వాడితోబాటు ఆ తైతక్కలాడి అరుణ పని కూడా పట్టాల్సిందే'' పచార్లు చేస్తూ అన్నాడు వీర్రాజు.

"శాంతం నాయనా..స్పీడు పనికిరాదు ఇలాటి విషయాల్లో" రామనాథంగారు వాదించారు.

"ఇంకా శాంతమేమిటి రామనాథంగారూ! నన్ను సస్పెండు చేయించి నా పరువు బజార్లో పెట్టాడు. వాళ్ళేమో ఎంక్వైరీ అన్న తీగ లాగడానికొచ్చి ఎకౌంట్లూ అవీఇవీ అంటూ డొంకంతా కదిలిస్తున్నారు. మా గుమస్తా ఓ మట్టి వెధవైనందున చాలా చోట్ల దొరికేట్టున్నాను. బాగా తినిపిస్తేగాని బయటపట్టం కష్టంలావుంది. ఇక వాడు భూమ్మీదుంటే నా ఆటలూ సాగవు నేనూ బయటపడను" విచారంగా అన్నారు సుందర్రావుగారు.

"అవునండీ! అటోఇటో తేల్చిపారెయ్యాల్సిందే. అప్పుడుగాని సంఘం అంటూ ఎగరడం మానరంతా" అక్కసుగా అన్నాడు శేషగిరి.

"ప్రిన్సిపాల్‌గారభిప్రాయంఏమిటో?"




రామనాథంగారన్నారు మెల్లగా.

"ఆయన కసలే భయంగా, గాభరాగా వుంది. వాడి పీడవిరగడ చేస్తానంటే మన అందరి కన్నా ఆయనే ఎక్కువ సంతోషిస్తాడు. ఇదివరకెప్పుడో ఓ కుర్రాణ్ణి కొట్టినప్పుడా సంఘంవాళ్ళాయన చేత కుర్రాళ్ళముందు క్షమాపణ చెప్పించినప్పట్నుంచీ వాళ్ళంటే మండిపోతున్నారు" సుందర్రావుగారన్నారు.

"ఇలాటి విషయాల్లో తొందరపడకూడదురా అబ్బాయ్! పైకి కన్పిస్తోన్నది వాడొక్కడే అయినా వెనకాల చాలా మందుంటారు. వాడికేమైనా జరిగితే వాళ్ళంతా లేచి ముంచెయ్యజూస్తారు. వాళ్ళకీ విచారణలకికూడా దొరక్కూడదు మరి"

"అదీ పాయింటేసుమా" సుందర్రావుగారన్నారు కళ్ళల్లో భయం కదుల్తోంటే.

రామనాథంగారు నవ్వేరు పెద్దమనిషి తరహాగా.

"మరేం చేద్దామంటారు?"

"నేనేర్పాట్లు చేస్తానుగా"

అయోమయంగా చూశారంతా.

"రేపెవ్వరూ ఊళ్ళో వుండొద్దు - గట్టి సాక్ష్యాలుగా నిలిచే పనులమీదెళ్ళిపోండి" అనేసి బయటికెళ్ళిపోయారాయన.

* * *

కెమిస్ట్రీ లేబ్‌లోనూ లైబ్రరీలోనూ, కాస్త సందడిగా వుంది. మిగతా కాలేజీ ఆవరణంతా నిర్మానుష్యంగానూ, ప్రశాంతంగానూ వుంది. ఇంకా గొడవలు జరగొచ్చేమోనని కాలేజీ ఆవరణలో పుంచబడ్డ పోలీసులు అక్కడొక్కరూ ఇక్కడొకరూ కూర్చునున్నారు.

లైబ్రరీనుంచి కొన్ని పుస్తకాలు తీసుకుని ఇంటిముఖం పట్టాడు రవి.

చీకటి పడబోతోంది అప్పుడప్పుడే.

బాటమీంచి వెళ్తోంటే ఇరుపక్కలా వున్న పూదలు దిగిన మర్రిచెట్లు జుట్లు విరబోసుకున్న దెయ్యాల్లా వున్నాయ్.

గాలి భయంభయంగా చూస్తూ వీస్తుంది.

ప్రకృతంతా దిగ్భ్రమకి లోనైనట్లుగా వుంది.

రవి ఇంకో పదడుగులేస్తే కాలేజీగేటు దాటతాడనగా ఇంతలో ఓ నలుగురు వ్యక్తులు మర్రిచెట్ల మాటునుంచొచ్చి రవిని పైబడ్డారు కర్రల్తో, బాకుల్తో.

"అమ్మా!"

ఆ ఆర్తనాదం నోటినుండి బయటికొచ్చి కాలేజీ పరిసరాల్ని కుదిపేయక ముందే అతడి తల బద్దలయ్యింది! వెన్నులో, గుండెల్లో రెండు బాకులు!!

మరుక్షణం గూండాలు కేంటీన్ వెనుక వైపు పారిపోయారు.

గేటుదగ్గర కాపలావున్న పోలీసు ఆ కేకకి తాగుతోన్న బీడీని గిరవాటేసి పక్కనే వున్న షోడాబడ్డీ మాటుకెళ్ళిపోయాడు. గేటు కొంచెం పైనున్న రామాలయం అరుగుమీద పేకాడుతోన్న పోలీసులు ఆట ఎత్తేసి సందు గొందుల్లోకి జారుకున్నారు.

అంతా గాఢ-ఘోర...నిశ్శబ్దం!

కళాశాల ప్రాంగణంలో బోర్లా పడి వున్న రవిలో చలనంలేదు.

అతడి శరీరం నుండి ప్రవహిస్తోన్న నెత్తుటి వాగుకు అంతంలేదు. ఎన్నెన్నో ఆశల్తో ఆ కాలేజీలో అడుగెట్టిన అతని ఆత్మకు శాంతిలేదు. 

# చతుర

## పబ్లిసిటీ




సాయంత్రం కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతుంటే శ్రీకాంత్‌ని చూసి చాలాకాల మైంది అనిపించింది. ఈమధ్యే విడుదల అయిన వాడి సినిమా గురించి నా అభి ప్రాయం కూడా చెబుదామని బయలు దేరాను.

శ్రీకాంత్ నా క్లోజ్ ఫ్రెండ్. ఇప్పు డిప్పుడే డైరెక్టర్‌గా అవకాశాలు వస్తున్నాయి. ఇంతకుముందు ఒకటి రెండు సినిమాలు ఓ మాదిరిగా విజయవంతమయినాయి. ఈ సినిమా గనక బాగా ఆడితే వాడి భవిష్యత్తుకి కాస్త బలమైన పునాది పడినట్లవుతుంది.

శ్రీకాంత్ ఇల్లుచేరి తలుపు కొట్టాను. తలుపువేసి లేనట్లుంది. తెరుచుకుంది. లోపలికి వెళ్ళాను. ముందు గదిలో లేడు. రెండో గదిలోకి వెళ్ళాను. అక్కడ శ్రీకాంత్ నీరసంగా మంచంమీద పడు కుని వున్నాడు. నా అలికిడివిని కళ్ళ మీదనుంచి చేతులుతీసి చూశాడు. నన్ను చూడగానే ఒకింత ఆనందం తొంగి చూసింది వాడి ముఖంలో.

"రా...రా...చాలా రోజులయింది నిన్ను చూసి" అన్నాడు లేచికూర్చుంటూ.

"నువ్వేమిటి అలా వున్నావు. దేనికో అప్‌సెట్ అయినట్లున్నావ్" అన్నాను వాడి పక్కన కూర్చుంటూ.

"ఏమీలేదురా" దాటేయబోయాడు శ్రీకాంత్.

"నా దగ్గిర కూడా దాస్తున్నావేమి టిరా! ఈమధ్య విడుదలైన సినిమా గురించేనా నీ బాధ అంతా?"

"ఆ...అదేరా"

"ఏం కథ బాగాలేదా?"

"కథకేం బంగారం. బ్రహ్మాండమైన కథ"

"సినిమాలోని కొత్త మొహాల్లో ఎవ రన్నా సరిగా నటించలేదా?"

# కతలు

"అబ్బే! అందరూ చాలాబాగా నటించారు"

"మరి విచారం ఎందుకురా? సినిమా విజయవంతం అవుతుందిలే"

"నీకు తెలీదురా. ఇది పబ్లిసిటీ యుగం. నేను ఫీల్డుకి కొత్త. మనకి డబ్బు ఇవ్వడానికి ఎవరు ముందుకి వస్తారు? అందుకని ఓ ముప్ఫయి థియేటర్లకి డిస్ట్రిబ్యూషన్ కూడా నేను తీసుకోవాల్సి వచ్చింది. పంపిణీదారులెవరూ ముందుకి రాలేదు. ఇక పబ్లిసిటీకి నా దగ్గిర డబ్బులేదు. ఉన్నదానితో కొద్దిగా బేనర్లు, వాల్‌పోస్టర్లు తయారుచేయించాను. పబ్లిసిటీలేని సినిమా గోవింద. ఇంతటితో నా పని సరి" బాధగా అన్నాడు శ్రీకాంత్.

"ఇదిగో....బాధపడింది చాలుగాని ఇక దిగులుమాని నే చెప్పినట్లు చేయి" అని ఓ ఉపాయం చెప్పాను.

"బ్రహ్మాండంగా వుందిరోయ్" అన్నాడు శ్రీకాంత్.

శ్రీకాంత్ దర్శకత్వం వహించిన 'అనురాగ నయనాలు' సినిమా విడుదలై ఓ వారంరోజులు గడిచాయి. ఆ సాయంత్రం నేను శ్రీమతితో కబుర్లు చెపుతూ టిఫిన్ తింటున్నాను. ఇంతలో ఇంటిముందు ఒక టాక్సీ ఆగింది.

శ్రీకాంత్ ఓ పెద్ద స్వీట్‌బాక్స్, పూలదండ తీసుకుని లోపలికి వచ్చాడు. రాగానే పూలదండ మెడలోవేసి కావలించేసుకుని "నీ ఐడియా బ్రహ్మాండంరా బ్రదర్. ఇక నా సినిమా సూపర్ హిట్టవుతుంది. అనుమానం లేదు" అన్నాడు నా నోట్లో స్వీట్ పెడుతూ.

"ఏమిటి విషయం?" అనడిగాను కాస్త తేరుకుని.

"అదేరా..'ఈ సినిమా దైవభక్తిగల వారందరికీ అంకితం' అని టైటిల్స్‌లో చేర్చమన్నావుకదా. అలాగే చేశాను. ఆ ఒక్క లైనూ బోలెడు పబ్లిసిటీ తెచ్చిపెట్టింది. రిలీజయిన మొదటిరోజు కొందరు నాస్తికులు సినిమాచూసి 'అనురాగ నయనాల'ను బేన్ చేయాలంటూ పోస్టర్లు తయారుచేసి అన్నిచోట్లా అంటించారు. ఆ మర్నాడు ఆస్తికులంతా 'ఇలాంటి మహత్తర చిత్రరాజాన్ని అందరూ చూసితీరాలి' అంటూ పోస్టర్లు అంటించారు. అలా ఆస్తికులు, నాస్తికులు నా చిత్రానికి ఎక్కడలేని పబ్లిసిటీ తెచ్చిపెట్టారు. ఇప్పుడా చిత్రాన్ని ఆస్తికులు, నాస్తికులు కూడా చూస్తున్నారు. హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడుస్తోందనుకో సినిమా" అని ఆనందపడిపోతున్న శ్రీకాంత్‌ని చూస్తూండిపోయాను.

—తుషార

## వీలునామా

విఖ్యాత రచయిత్రి శ్యామలాదేవిగారి వీలునామాని లాయరు విశ్వనాథంగారు విప్పుతూ ఉంటే చుట్టూ కూర్చుని ఉన్న నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళ గుండెలు దడదడలాడాయి.

ఆ దడదడకు కారణం, భర్త పోయే నాటికే ఆమె పేర బోల్డన్ని పొలాలూ, తోటలూ పెట్టేశాడు. అది చాలక ఆ తర్వాతకూడా ఆమె బోల్డంత డబ్బు సంపాదించింది. ఆవిడ నవలలు అనేకం

సినిమాలుగా కూడా వచ్చాయి. అయితే అది ఎంతుందో, ఏ రూపంలో ఉందో, ఎవరి పేరు మీద ఉందో మాత్రం ఇన్నాళ్ళూ ఎవరికీ తెలియనివ్వలేదావిడ.



లాయరుగారు కవరిప్పారు. అందు లోంచి స్టాంపు పేపరు మీద రాసిన వీలునామా, దానితో బాటే చిన్న నోటు పుస్తకమూ బయటపడ్డాయి. ముందుగా స్టాంపు పేపరు మీద రాసిన వీలునామాను చదివారు లాయరుగారు.

"ఇందుమూలముగా తెలియజేయున దేమనగా నాకు వివిధ ప్రదేశములలో ఉన్న ఇళ్లూ, తోటలూ, పొలములూ నా కొడుకులు నలుగురికీ సమానంగా పంచడ మయింది" అంటూ ఆ పొలాలూ మొద లైనవాటి గురించిన వివరాలూ, అవి ఎవ రెవరికి ఏవిధంగా పంచాలి అన్న వివ రాలూ ఉన్నాయి.

అది విన్న నలుగురు కొడుకుల మొహాలూ ఆనందంతో వెలిగిపోతే, ముగ్గురు కూతుళ్ల మొహాలూ చిన్న బోయాయి.

కాని ఆ తర్వాత లాయరుగారు చదివిన వాక్యాలు వినగానే కూతుళ్ళ మొహాల్లోకి కాంతొచ్చింది.

"ఇకపోతే నాకున్న ఇరవై నాలుగు ప్లాట్లనీ నా ముగ్గురు కూతుళ్ళకు ఏవిధంగా పంచడమో వివరంగా ఈ నోట్ బుక్‌లో రాస్తున్నాను"

తల్లి బోల్డు డబ్బు సంపాదించిందని తెలుసుకాని దానితో ఇరవైనాలుగుప్లాట్లు కొందని ఎవరూ ఊహించలేదు ఇంత వరకు. లాయరుగారు అలా చదవగానే నలుగురు కొడుకుల మనస్సులూ ఈర్ష్యతో భగ్గుమన్నాయి. కూతుళ్ల మొహాలు వెలిగి పోయాయి.

లాయరు నోటుపుస్తకం విప్పుతుంటే కూతుళ్ళ గుండెలు దడదడలాడాయి. నోట్ బుక్ తెరిచి చదవడం మొదలెట్టాడు లాయరు.

"ఒకటవ ప్లాటు: కథపేరు 'సరాగాల పన్నీటిలో విరాగాల కన్నీళ్ళు' నవల క్లుప్తంగా ఇది– రమాదేవి వాళ్ళింటి ఎదు రుగా చిన్న గుడిసెలో ఉంటూ ముష్టెత్తు కొనే రాజారాంని గాఢంగా ప్రేమిస్తుంది. కాని కొన్నాళ్ళకే తెలుస్తుంది – అతను అయ్యేయస్ పాసయినా ఎక్కడా ఉద్యోగం దొరక్క అలా ముష్టెత్తుకొం టున్నాడనీ.." ఈవిధంగా కొనసాగిందా ప్లాటు. లాయరుగారు కొంచం ఆగి మళ్లీ చదవసాగారు.

"రెండవప్లాటు : కథపేరు 'దెయ్యం నవ్వింది'. చతుర్వేది గదిలోకి రోజూరాత్రి వినతాదేవి వస్తూ ఉంటుంది. కొన్నాళ్ళకి వాళ్ళకో కొడుకు పుడతాడు. కాని ఆ తర్వాత తెలుస్తుంది – వినతాదేవి అనబడే ఆవిడ దాదాపు వంద సంవత్సరాల కిందటే చచ్చిపోయిందనీ, ఆ కొడుకూ వంద సంవత్సరాల కిందటే పుట్టాడనీ..."

లాయరు అలా చదువుకొంటూ పోతూనే ఉన్నాడు. కూతుళ్ళు, కొడుకులు ముగ్గురు మూర్ఛపోగా మిగిలినవారు ఆసక్తిగా వింటూనే ఉన్నారు – ప్రఖ్యాత రచయిత్రి శ్యామలాదేవి రాసిన ఆ వీలు నామాని!

—అవధానుల విజయలక్ష్మి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/HD/4